# అహల్యా సంక్రందనము.

సముఖము వేంకట కృష్ణప్పనాయకుఁడు.



శృంగారకావ్య గ్రంథమండలి ప్రబంధపరంపర — 3

# అహల్యా సంక్రందనము.

సముఖము వేంకట కృష్ణప్పనాయకుఁడు.

PUBLISHED BY
K. G. MURTHY
FOR SRUNGARA KAVYA GRANDHA MANDALI.
MASULIPATAM.

తొలికూర్పు.
ఆషాఢం, ౧౯౩౮
వేయి ప్రతులు.

ముద్రణము.
రామా ఆర్టుప్రెస్,
మచిలీపట్టణము.

*

శ్రీకామేశ్వరకవి సత్యభామా సాంత్వనమును బ్రకటించునప్పుడే మాకు, మధురనాయకుల యాదరణమున వర్ధిల్లిన సారస్వతమును తెలుఁగునాట వ్యాప్తిగావించవలయుననెడి తలంపుగల్గినది. తంజావూరు మహారాజుల రాసిక్యము చలువను వెలసిన కావ్యగ్రంథములు, చాల కాలముక్రిందనే ముద్రితములై జనాదరణమును బడసినవి. మధుర వాఙ్మయమునకు, మాయోపిన సేవలనొనరించి యుద్ధరించుటకు సారస్వతాభిమానుల ప్రోత్సాహ, ఆదరణముల నర్థించెదము.

విజయరంగచొక్కనాథుని దళవాయిగానుండిన వీరరాఘవాత్ముఁడు సముఖ వేంకటకృష్ణప్ప నాయకుఁడు, స్వయముగా కవియు, కవులను పోషించుచు, తన యేలిక జాడలను, వదాన్యత్వశేఖరుల ననుగమించి, చిరప్రతిష్ఠనందినవాఁడు. ఆతనికృతులలో మిగుల నుత్తమమగు నహల్యా సంక్రందనము పాఠకులకు, శృంగారకావ్యగ్రంథమండలి తృతీయప్రచురణముగా నందించుచున్నారము. మఱియు, ననుబంధములుగా- నాకవియే రచియించెనన్న రాధికాసాంత్వనమను నేకాశ్వాస శృంగార ప్రబంధమును, వచన సారంగధర నుండి, యాతని రచనానైపుణిని జదువరులెఱుంగుటకు రసవద్ఘట్టము నొకదానిని, వచన జైమినిభారతము నుండి, ఆంధ్రసాహిత్యపరిషదధిపతులు, శృంగారమయమని, తమప్రచురణమున విడిచిన భాగమును—నీమూఁటినిఁ గూడ జేర్చినాము.

గ్రంథపాఠ పరిశోధనావసరముల మాకత్యంతము నుపకారకులైన మిత్రుల కియ్యెడఁ గృతజ్ఞతఁ దెలుపవలసియున్నది. శిరోమణి తిరుమల వేంకట రంగాచార్యులవారు (ఆంధ్రపత్రికా కార్యాలయము, మదరాసు.) ప్రాచ్యలిఖితభాండాగారమునందున్న రెండుప్రతులను బట్టి మా 'అహల్యా సంక్రందనము' ను బరిష్కరించుట యే గాక, రాధికాసాంత్వనమును వ్రాసిపంపినారు. శతాధికగ్రంథకర్తలగు మద్దూరి శ్రీరామమూర్తి కవిగారు, తీరిక జేసికొని, మాకోరికను మన్నించి, ఆంధ్రసాహిత్య

పరిషద్భాండాగారమునుండి, రాధికాసాంత్వనము, సారంగధర, జైమినీ భారత భాగములను, శ్రమపడి, వ్రాసి యొసఁగినారు. సాహిత్య పరిషత్ గౌరవ కార్యదర్శి యగు శ్రీకొమ్మపల్లి సూర్యారావుగారు, మాకు వలసిన గ్రంథములు వ్రాయించుకొనుటకు, తగిన సదుపాయములు చేసినారు. ఈసారస్వతజీవను లందరకు మావినతులు మఱి యొక మా రెఱుకపఱచుచున్నాము.

ఆంధ్ర సాహిత్యపరిషత్తు భాండాగారమునందలి,

సారంగధర చరిత్ర వచనము (శిథిలమైన ప్రతి) నెం. 63

అహల్యా సంక్రందనము (అసమగ్రము) నెం. 2

వచన జైమిని భారతము నెం. 142, 308

రాధికాసాంత్వనము నెం. 177

ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునందలి,

రాధికా సాంత్వనము కాగిత ప్రతి నెం. R 199

అహల్యా సంక్రందనము కాగిత ప్రతి నెం. D 386

డిటో తాళపత్ర ప్రతి నెం. D 387

పై వాని యాధారమున, ముఖ్య ప్రబంధమును, అనుబంధములును బరిష్కృతములై ముద్రణము నందినవి. సారస్వతాభిమానుల యొద్ద నింక పాఠభేదములుగల ప్రతులున్న మాకు దెలియఁజేసిన ద్వితీయ ముద్రణమున వానిఁ జేర్చెదము. మఱియు నిటువలె నుత్తమ ప్రశస్తిఁ జెందిన యముద్రిత ప్రబంధములను సాహితీపరులు మాకు దయతో నొసఁగిన వానిఁ బ్రకటించుట కెల్లప్పుడును సంసిద్ధులము.

చదువరులు, మాకృషికిఁ దగిన ప్రోత్సాహమును సర్వదా నొసఁగుచు నింకనధికముగా మాచే నాంధ్రవాణి నర్చనల నోలలాడించి పరితృప్తిం బ్రసాదింతురుగాక, యని మనవి.

వ్యవస్థాపకుఁడు.



ఒక కొమ్మనే రెండుపూవులు పూసినప్పుడు, ఆకారవిశేషాల్లో, అందచందాల్లో గోరువాసి ఒకదానికొకటి తీసిపోయినా, పరిమళం హాయి చిమ్మేసౌరస్యం రెంటికీ సమానంగానే అలవడి ఉండటం సాధారణంగా సహజం. చుక్కల మినుకు మినుకుల్లో అంతదూరాన్న ఎక్కువ తక్కువ లెవరెంచుతారు, వెలుగుకు ముచ్చటపడటమే కాని!

—అటు తంజావూరులో, సర్వజ్ఞుడు, సకలకలారసికుడు, రఘునాథరాయలు: ఇటు మధురలో వరాంగనా అనంగ సర్వస్వమూర్తి రసికరాజు తిరుమలేంద్రుడు. రెండురాజ్యాలూ ఒకదానికొకటి క్షాత్ర మర్యాదలలో, వైరాలలో, పంతాలుసాధించుకుంటూన్నా, సారస్వతంలో జోడుపంచకల్యాణుల బారుగా హెచ్చుతగ్గుకాని కనను చూపించినవి. కన్నడ సామ్రాజ్యవైభవాలలో భాగస్వంగా చిక్కించుకున్న కావ్యవినోదపారవశ్యం, దక్షిణదేశాన, హొయిసల సామంతులకు జన్మహక్కు అయిపోయి, తరతరాలుగా, తామరతంపరగా ఫలించినది.

ఇద్దరు రాజులూ, తమ పేరు నిలువబెట్టె తమ అంతవారయే సంతతి కలుగుతూండవలెనని, కోరుకోవటం ఉచితమేకదా: రఘునాథరాయల వైభవం విజయరాఘవునిలో కోటికి కోరి కొండెక్కింది. తిరుమలేంద్రుని మనుమడు * రాజ్యమునకువచ్చిన తరువాతగాని, మళ్లీ తొలికాలపు వెలుగు జ్యోతిగా మెరయలేదు.

పితామహి మంగమ్మదేవి గారాబాలు చేసి పెంపకంలో, తిరుమలేంద్రుని మించగలవు అనే పెద్దల ఆశీర్వాదబలంలో చొక్కనాథుడు యుక్తవయసున రాజ్యానికి వచ్చి, ఆ హోదా నిలువబెట్టగలిగాడు. సమ

*కురుగంటి సీతారామయ్యగారు తమ గ్రంథాన, మధురరాజుల వంశావళి యిస్తూ, తిరుమలుని కొమారుడు, ముద్దువీరప్ప, అతని కుమారుడు చొక్కనాథుడు అన్నారు. సత్యనాథ అయ్యర్ గారి ఆంగ్ల మధుర నాయక చరిత్రములోనూ ఇలాగేఉన్నది. మరి రామయ్యపంతులుగారు మనుమడి మనుమడని లెక్కించారు. ఎందువల్ల?

పాలుగొంటూండే నెచ్చెలి. స్వయముగా కవి, కవుల శాశ్రియుడు ‡ నిరంతరం రాజసమ్ముఖాననే ఉండటంవల్ల తిరుమలేంద్రుని కొలువులో,

‡ఇక్కవి యైదాశ్వాసముల జైమినిభారత వచనకావ్యమునే గాక సారంగధరచరిత్రమను మూఁడాశ్వాసముల వచనగ్రంథమును, అహల్యా సంక్రందనమను మూఁడాశ్వాసముల శృంగారప్రబంధమును, రాధికా సాంత్వనమనియెడి యేకాశ్వాస శృంగార ప్రబంధమును రచియించెను. ఇందు మొదటిది, పాండ్యమండలాధీశ్వరుఁడగు విజయరంగచొక్కనాథున కంకితమొనర్చి మిగిలినవానిని శ్రీరంగస్వామికిఁ గృతినొసంగెను.

ఇందు జైమినిభారతము నైదాశ్వాసముల యాద్యంతములందును,

శ్రీరాధా వర చరణాం
భోరుహ భృంగాయమాన భుజగనపీరా
ధారా ఖండిత గాత్ర
శూరా శ్రీవిజయరంగచొక్కవజీరా!

ఇత్యాదిగాఁ గృతినాయక వర్ణన పద్యంబులును, బ్రత్యాశ్వాసాంతమునను,

'ఇది శ్రీపాండ్యమండలాధీశ్వర శ్రీవిజయరంగచొక్కనాథ మహీనాథ కరుణా కటాక్షసంపాదిత గజతురంగ మాందోళికాప్రముఖ నిఖిల సంపత్పరంపరీ సమేధమాన సముఖమీనాక్షినాయక తనూభవ ...' ఇత్యాదిగా గద్యములు నుండుటంబట్టి యితండు విజయరంగ చొక్కభూపాలునకు సమకాలికుఁడై యాతనికిఁ గృతినిచ్చిన కేవల కవియనియే కాక, యహల్యాసంక్రందనములో శేషము వేంకటపతి కవిచెప్పినట్లుగాఁదన్ను వర్ణించుకొనిన, 'ధైర్యమా శౌర్యమా ... శౌర్య సాంద్ర!' (1–40) అనుపద్యముంబట్టి యితఁడు పాండ్యభూనాథుని యాస్థానమందలి ముఖ్యసామాజికులలో నొకఁడైనట్లును దెలియుచున్నది. మఱియు—

తే. గీ. ... 'రంగధరపతి నేను సారంగధర చ
రిత్ర వచనము చేసి తత్కృతిని నాకు

రాల్లో, సారస్వతవిహారాల్లో తనను మీరేవారు, ఆకాలంలో మరొకరు లేరనిపించాడు. సాహిత్యపోషణలో అపరిమితుడుగా కళాసామ్రాజ్యాన్ని కూడా తోడునీడల్లో వర్ధిల్లచేశాడు. దేశంలోప్రజల కన్నులూ మనసులూ ఆనందంతో విప్పారించాడు.

సముఖ వేంకట కృష్ణప్పనాయకుడు † చొక్కనాథుని దళవాయి. కావ్యగీతావినోదాల్లో ఆతనితో సరిసమానుడుగా అరమరికలు లేకుండా

---

†......జైమిని భారతమునందుగూడ యీతనివంశావతారము వర్ణింపఁబడియుండునుగాని, పరిషత్తునకు దొరికిన ప్రతుల యందు నవతారికాభాగము పోయినది. శేషము వేంకటపతికవి తనవంశావతారమును వర్ణించినట్లుగా నొక్కరీతిగా సారంగధరచరిత్రయందు, నహల్యాసంక్రందనము నందును, వర్ణించుకొనిన యాతని వంశక్రమ మిట్లని తెలియుచున్నది.

కేశవప్పనాయుడు (మూలపురుషుడు)
|
వేంకటనాయుడు
|
పెదగురవప్పనాయుడు
|
ఎల్లిసెట్టినాయుడు
|
వేంకటనాయుడు = వేంకటాంబ
|
మీనాక్షినాయుడు = అలమేలమ్మ
|
వేంకటకృష్ణప్పనాయుడు.

—జైమిని భారతభూమికతే, ఆం. సా. పరిషత్.

పాలుగొంటూండే నెచ్చెలి. స్వయముగా కవి, కవుల శాస్త్రియను ‡ నిరంతరం రాజసమ్ముఖాననే ఉండటంవల్ల తిరుమలేంద్రుని కొలువులో,

‡ఇక్కవి యైదాశ్వాసముల జైమినిభారత వచనకావ్యమునే గాక సారంగధర చరిత్రమను మూఁడాశ్వాసముల వచనగ్రంథమును, అహల్యా సంక్రందనమను మూఁడాశ్వాసముల శృంగారప్రబంధమును, రాధికా సాంత్వనమనియెడి యేకాశ్వాస శృంగార ప్రబంధమును రచియించెను. ఇందు మొదటిది, పాండ్యమండలాధీశ్వరుఁడగు విజయరంగచొక్కనాథున కంకితమొనర్చి మిగిలినవానిని శ్రీరంగస్వామికిఁ గృతియొసంగెను.

ఇందు జైమినిభారతము నైదాశ్వాసముల యాద్యంతములందును,

శ్రీరాధా వర చరణాం
భోరుహ భృంగాయమాన భుజకరవీరా
ధారా ఖండితశాత్రవ
శూరా శ్రీవిజయరంగచొక్కవజీరా!

ఇత్యాదిగాఁ గృతినాయక వర్ణన పద్యంబులును, బ్రత్యాశ్వాసాంతమునను,

'ఇది శ్రీపాండ్యమండలాధీశ్వర శ్రీవిజయరంగచొక్కనాథ మహీనాథ కరుణా కటాక్షసంపాదిత గజతురంగ మాందోళికాప్రముఖ నిఖిల సంపత్పారంపరీ సమేధమాన సముఖమీనాక్షీనాయక తనూభవ ...' ఇత్యాదిగా గద్యములు నుండుటంబట్టి యితండు విజయరంగ చొక్కభూపాలునకు సమకాలికుఁడై యాతనికిఁ గృతినిచ్చిన కేవల కవియనియే కాక, యహల్యాసంక్రందనములో శేషము వేంకటపతి కవిచెప్పినట్లుగాఁ దన్ను వర్ణించుకొనిన, 'ధైర్యమా శౌర్యమా ... శౌర్య సాంద్ర!' (1–40) అనుపద్యముంబట్టి యితఁడు పాండ్యభూనాథుని యాస్థానమందలి ముఖ్యసామాజికులలో నొకఁడైనట్లును దెలియుచున్నది. మఱియు—

తే. గీ. ... 'రంగధరపతి నేను సారంగధర చ
రిత్ర వచనము చేసి తత్కృతిని నాకు

మీనాక్షీనాయకుని + యింటిపేరు సముఖమని మారి అప్పటినుంచీ ఆకోవకు అదేనిలిచి పోయిందని వాడుక. నిశ్చయించే ఆధారాలు స్పష్టంగా

---

సంకీర్తము సేయుము శుభంబు లగును నీకు

(సారంగధర ప్రస్తావన)

శా. 'వాసిన్ రంగవిభుండ నేను ... ... నీకు మేలొనర్చన.

(అహల్య 1—15)

—'అని యానతిచ్చుటయు నేనును నోడనమేల్కాంచి పురోహిత భృత్యామాత్య సామాజిక వర్గంబులు గొలువం గూర్చుండి యుభయ భాషాకవితా విశేషులైన శేషము వేంకటపతి, బుణిగె శ్రీకృష్ణ కవీంద్రులు మాకాప్తసఖులు గావునం బిలిపించి, యాశుభస్వప్నంబు వినిపించుటయు ...' అని సారంగధరచరిత్రమునందు, నహల్యాసంక్రంద నమునందును దనకుఁగూడ భృత్యామాత్యసామాజిక వర్గము గలదని వ్రాసికొనుటంబట్టి పూర్వగద్యములో వ్రాయబడినట్లుగా సీతఁడు విజయరంగచొక్కనాథుని దయచే సామంతరాజై కొన్నిగ్రామములకు అధిపతియైనట్లు కూడఁ దెలియుచున్నది.

శ్రీవిజయరంగచొక్కనాథుఁడు 1704—31 నడుమఁ బాండ్య మండల మేలినవాఁడగుటచే (ఆం. సా. ప. ప. సంపు: 2— 220) మన కవి కూడ నక్కాలముననే యుండెననుట స్పష్టము.

[—జైమిని భారతం పీఠికలో మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు.]

† మీనాక్షీనాయకుడు ... తిరుమలనాయకుని మంత్రిగానుండెనని యొకప్రతీతి కలదు. వేంకటకృష్ణప్ప నాయకుడు తిరుమలనాయకుని మనుమని మనుమడగు విజయరంగచొక్కనాథుని యాస్థానమున నుండెను. ... దీనినిబట్టి తండ్రికిని గుమారునికిని నడుమ నంతరమధికముగా గను పట్టుచున్నది. వేంకటకృష్ణప్పనాయకుడు మీనాక్షీనాయకుని వృద్ధదశలో బుట్టినవాడనియు, విజయరంగచొక్కనాథుని రాజ్యకాలమునందు వేంకట

లభించడం లేదుకాని, వేంకట కృష్ణప్పనాయకుని వంశక్రమం చెపుతూ, వెంకటపతి, పూర్వీకుల, నామములు మాత్రమే తెలుపుతూ, మీనాక్షి నాయని దగ్గరకురాగానే యింటిపేరు కలపడం, పై ఆలోచనకు కొంత ఊతయిస్తూన్నది.

విజయరంగ చొక్కనాథుడు విలాసచతురుడైన దక్షిణనాయకుడు అని ప్రసిద్ధిలో ఉన్నచాటువులు ఋజువుచేస్తున్నవి.

---

కృష్ణప్పనాయకుడు కూడ వృద్ధుడుగా నుండెననియు నూహించినచో నీయంతర మత్యధికముగా దోపకపోవచ్చును, గాని, వేంకటకృష్ణప్ప నాయకుని తల్లియగు అలమేలక్క 'మంగమ్మసాకుడుకూతు' రను ప్రతీతి యుండుటచే, నామెభర్తయగు మీనాక్షినాయకుడు విజయరంగచొక్క నాథుని పితామహి యగు మంగమ్మదేవిక్రింద మంత్రిగానుండెనని యూహించుటయే సమంజసముగా గన్పట్టుచున్నది. ఈ మంగమ్మదేవి, 1689—1704 వరకు విజయరంగ చొక్కనాథుని సంరక్షణ కర్త్రిగా రాజ్యము చేసెను.

మీనాక్షి నాయకుడు మధురమీనాక్షి యాలయమున కెదుట నొక మండపమును గట్టించి, యఖండ దీపముగూడ నిల్పెనట. విజయ రంగచొక్కనాథు డనేకధర్మకార్యములు చేసెను. శొంఠిగున్నయ్య యను నాంధ్ర బ్రాహ్మణున కొక యగ్రహారమిచ్చెనట. ఈ బ్రాహ్మ ణుని సంతతి వారిప్పటికిని నాయగ్రహారమనుభవించుచు పెరియకొళ గ్రామమందున్నారు.

విజయరంగచొక్కనాథుడు గతించిన పిదప నాతనిభార్య మీనాక్షమ్మ 5, 6 సంవత్సరములు మాత్రమె రాజ్యము చేసెను. అనంతరము దేశము తురుష్కాక్రాంతమాయెను. అప్పుడు వేంకట కృష్ణప్పనాయకుని కుటుంబమువారు తమబంధువగు వడగరై జమీందారు నాశ్రయించి, యచ్చటనే నివసించిరి ...'

—కైమినిభారత భూమికలో జయంతి రామయ్యపంతులుగారు.

'రమ్మనెరా తనదే నే
రమ్మనెరా పంచశరుని కాపోర్చుట భా
రమ్మనెరా నీవేతన
సొమ్మనెరా విజయరంగ చొక్కవజీరా!
'మాటికి మాటికిని నొక
చోటికి రమ్మనుచు నెనయ జూచితి...'

ఇత్యాదులు చాలా లభిస్తున్నవి. రసికుడైన కవి- ప్రభువు సముఖాన మెలగే సదస్యులకు రాజశ్రీతికని కాని, స్వయముగానే కాని, ఆ ధోరణులు, ఆపోకడలు అలవాటు అయిపోవడంలో వింతఏమీలేదు. వేంకటకృష్ణప్పనాయకుడు ఒకవంక ప్రభువుతో సమానంగా అన్నివిధాల భోగాలూ అనుభవించాడు, శేషము వేంకటపతి మొదలైన కవులను పోషించాడు, తాను కావ్యాలు రచించాడు. మరోవంక, యుద్ధాలలో గడిదేరి సంగరసవ్యసాచి అనే బిరుదందుకున్నాడు.* విజయ రాఘవ రాయలను ససైన్యంగా రూపుమాపి, తంజావూరు రాజ్యాన్ని కూలద్రో

* వేంకటకృష్ణప్పనాయకునికి 'సంగర సవ్యసాచి' 'సంగర కిరీటి' అనేబిరుదములుండేవని, శ్రీ చేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించిన 'తంజావూరు ఆంధ్రరాజుల చరిత్రము' అనే ప్రాచీన వచన గ్రంథాన్ని బట్టి తెలుస్తున్నది. కాని, శేషము వేంకటపతి వర్ణించి వట్టుగా ఉన్న అహల్యాసంక్రందనం అవతారిక పద్యాలలో ఎంతవరకుచూసినా, వేంకటకృష్ణప్పనాయకునికి, 'లీలా మనోజాకృతీ!', 'కంతుజయగతగూప' -'కవి కల్పక' 'భాషాఫణి గ్రామణీ' ఇలా సందర్భానికి సరిపోయే విశేషణ గౌరవముచే కనపడుతూన్నవి కాని, సంగరసవ్యసాచి, సంగర కిరీటి_ వీటిప్రశంసేలేదు. 'రిపుజయాధార' 'శౌర్యసాంద్ర' యిలాగని పరాక్రమాన్నికూడా అభినందించడం మరువనివాడు, ముఖ్యవిషయములను ఎందుకు వదలివేశాడో తెలియకుండా ఉన్నది. బహుశః అప్పటికిలా ఆ బిరుదులు లభించి ఉండవనుకోవలెనా?_ కురుగంటిసీతారామయ్యగారు, తమ ఉపన్యాస సంగ్రహములో, ఈ మాట ఎత్తనేలేదు.

కాడు.§ వీటన్నింటినీమించే మరోగౌరవం పొందాడు. వాగ్గేయ కారుడు క్షేత్రియ వేంకటకృష్ణప్పనాయకునిమీద పదములు రచించాడు† ఈవిషయంలో మహారాజుకన్న కూడా ధన్యుడు.

ఈతడు విజయరంగచొక్కనాథునివల్ల సమస్తమర్యాదలూ పొందు తూ, మహావైభవంగా రాజు సెబాసనే కీర్తితో ఆతనికి కుడిభుజమై ఉండే వాడు.

వచన జైమినీ భారతము వేంకటకృష్ణుని రచనలలో మొదటిది. తరువాత సంకల్పించిన అహల్యా సంక్రందనంలో దీనిప్రశంస ఉంది. నరాంకితము చేసిందల్లా దీనిని ఒకదానినే: కృతిపతి, విజయరంగ చొక్క నాథుడు.

అహల్యాసంక్రందనమును కోరి కృతిపుచ్చుకున్నది, కులదైవము ప్రభువుతో నామసారూప్యమున్న, ప్రభువుల ప్రభువు-శ్రీరంగనాథుడు సారంగధర, ఆదేవునకే.

---

§ఈ ప్రశంస కూడా, వేంకటకృష్ణప్పనాయకుని గ్రంథములలోకి ఎక్కకుండా, చరిత్రాంశంగానే నిలిచిపోవడంచూస్తే, విజయరాఘవుని జయించడంతో కాని, సంగర సవ్యసాచి సంగరకిరీటి బిరుదములు రాలే దేమో; అప్పటికేగ్రంథములు రచించడంముగిసి చాలాకాలమైందేమో?

†'రమ్మనవే సముఖానరాయబారమేటికే' మొదలైన మూడు నాల్గుగు పదాలు వేంకటకృష్ణప్పనాయకుని మీద క్షేత్రియ చెప్పాడని వినికిడి. తిరుమలేంద్రుని ఆస్థానాన్ని ఆ మహాకవి పావనంచేస్తూ మధురలో నివసించు తూండేనాటికి, వేంకటకృష్ణుడు అప్పుడే అంకురించిన యౌవనంలో విలాసవిహారాలకు కాలుదువ్వుతూండటం; ఆతనిచక్కనివిగ్రహం అంతకన్న చక్కని రాసిక్యం, గమనిస్తూ క్షేత్రియ ముగ్ధుడై పోయి, ఆతనిమీద పదములల్లడంవినీ, పండుముదుసలి అయిన తిరుమలేంద్రుడు ఎంతో మెచ్చుకుని, మీనాక్షీనాయడు ఏమీ కంటగించుకోకుండా సర్దిచెప్పాడనీ, దక్షిణదేశంలో భరతాభినయవిదుల సంప్రదాయంలో నిలిచిపోయినకథ.

వేంకటకృష్ణప్పనాయకుని రచనల్లో ఉత్తమమైనది. ఆశ్రియమిచ్చి, ఆంధ్రవాణీవిలాసములను అంత అలజడిరోజులలోనూ వన్నెతరగకుండా కాపాడుకుంటూవచ్చిన ప్రభువులమనసు వచన కావ్యముల మీదికి మరలినప్పటికీన్నీ, రాచ

అహల్యా సంక్రందనము.

బాటనే, కావ్యనిర్మాణం విషయాల్లో, అనుచరులు అనుసరించవలసిఉన్నప్పటికిన్నీ, నిరంకుశత్వం పరిపాలనలోనేకాని, కావ్యాలాపాలమీదికి మహా రాజులు దుమికించనందువల్ల, కవులకు, తామేర్చి కూర్చిన కుసుమాలలో, తమ మనసుకు నచ్చేరీతుల్లో మాలలల్లి కావ్యకన్యకు నేపథ్యశృంగారంపు అందాలుదిద్దడానికి వీలైంది. ఆశ్రియుడైన రసికమూర్తి వచనకావ్యములు కృతులందుతూ, కృతులుగానిర్మించుతూ ఉంటే ఆశ్రితుడై ఆతనిచేత బహువిధముల సన్మానింపబడుతూ ఉన్న కవి-సేనాని, వచ్యప్రబంధాలు భగవదర్పణచేసి ప్రశంసలందు తూండటంకలిగింది. రాజుతలచుకొంటే, రక్తిరహదారులనే ముక్తిమార్గాలుగా మార్చగలుగుతాడుకదా!

ఇతివృత్తము, ప్రఖ్యాతంగా ఉన్నదానినే, ప్రఖ్యాతిలో, ప్రామాణికములుగా ఉన్నగ్రంథాలలోంచి సంగ్రహించుకొని, కల్పనలలో, కథాగమనచాతుర్యంలో, మాత్రం తమపనితనంచూపించడం ప్రబంధకవులలో చాలవరకు పరిపాటిగా వస్తూఉన్నది. వేంకటకృష్ణుడు తెనుగునాటను తెనుగుమీరిపోయి అన్నిమూలలా అల్లుకుపోయిన పురాణగాథను తీసుకుని, పద్యశ్యానికి ఆద్యశ్యంచదువరులకు కళ్ళెదుట మెరసేలాగా, అన్నిదృశ్యాలూకలసి ఏకచిత్రంగా చమకితమయే జాణతనపు ఔచిత్యం ఈప్రబంధము రచనలో ప్రదర్శించాడు. అందువల్లనే రసప్రవాహంలో, శాస్త్రరీత్యా గమనానికి ఎప్పటికప్పుడు అడ్డుతగులుతూండవలసిన విస్తర వర్ణనలు, విప్రలంభోపాలంభ ఉపన్యాసాలు, గాలించినా ఇక్కడ కాన రావు. మామూలు మహాప్రబంధాలు, మోడులు కిక్కిరిసి దొర్లుకు వచ్చేనదులవరదలు అయితే, అహల్యాసంక్రందనం, గాలికిచెదరిరాలే కొండ పూవులను అలలమీద తేలికగా తేల్చిమోసుకుంటూ, అలసగమనంతో పరవళ్ళుపోయేసెలయేరు. తిక్కనను మించిపోయింది ఈతని 'దర్శకత్వం.'

వస్తువును విశేషంమార్చకుండా, ఇతరపురాణాలలోనుంచి విచిత్ర సందర్భములేమి అతుకుపెట్టుకోకుండా, రామాయణంలో పద్మపురాణంలో, అగుపించే కథనేతీసుకున్నాడు. గౌతమునియిల్లాలిని, ఏలాగైనాపొందాలని, అంతకుపూర్వంవివాహసందర్భములో విఫలమనో రథుడై పరితపించుతూన్న దేవరాజు, రాయబారాలునడిపి, అహల్యతన యందు అనురక్త అని తెలుసుకుని, మగనిని కోడికూతతో, అర్ధరాత్రివేళ స్నానానికి సాగనంపి, ఆఅవకాశంలో, మనసుతీర్చుకుంటాడు. చేసిన పనికి, ఇరువురికీ శాపాలుతగులుతవి. ఇదీప్రబంధంలోఉన్నకథ. ఈసంద ర్భములో అహల్యకథనుగురించి కావ్యరసికులెరుంగవలసిన విశేషాలు చాలాఉన్నవి. [illegible]

వాల్మీకిరామాయణంలో ఉన్నకథే, ఉత్తరకాండలోనూ వస్తుంది. నిజానికి సందర్భముఅంతగాలేకపోయినా, బ్రహ్మదేవుడు ఇద్రజిత్తుకోరిన వరాలుయిచ్చి ఇంద్రుడిప్రాణాలుదక్కించినప్పుడు గ్రహచారందాటడం ఎవరితరమూకాదని ఊరడించుతూ, వెనుకటిగౌతమశాపకథను మళ్లీ ఒక మారు ఏకరువుపెట్టి ఉరిసిన పుండుమీద ఉప్పు కారముచల్లినట్లు, శచీం ద్రుని అమాయకంగా ఆయాసపరచుతాడు.

అహల్య—అంటే సర్వాంగసుందరి: అవయవములలో ఆకారంలో ఏవిధమైన ఒచ్చెములున్నూలేనిది అనిఅర్థమట, బ్రహ్మఅభిప్రాయంలో: ఒకేఅచ్చులో అసంఖ్యాకమైన ప్రజనుసృష్టిచేసి విసిగి, వాణీపతి, లోపాలులేని క్రొత్తదనపురామణీయకం సంకల్పించి కరువునబోసి, అహల్యను నిర్మించడం కలిగింది: కుమారిలభట్టు, ఈకథ సాంకేతికమని, అహల్య—రాత్రి, ఇంద్రుడు—సూర్యుడు ఇలా తీసుకోవలసిందంటాడు. అహల్య అంటే ఊషరక్షేత్రం — ఇంద్రసమాగమంవల్ల, అంటే వర్షం కురిసి, తడిసి, ఫలించడం: ఇదో నిర్వచనం వైదికవివరణంగా ఉన్నది. బ్రాహ్మణంలో అహల్యాజారుడన్న మాటనుపట్టి, తరువాత పురాణాల్లోకి కథలు కల్పించ బడినవని, మీమాంసకుల అభిప్రాయం.

ఆంజనేయుని కథలన్నీ ఒకచోటకూర్చిన పుష్పగిరి తిమ్మన్న సమీరకుమార విజయంలో అహల్యావృత్తాంతం చిత్రంగాచెపుతాడు. ఏలాగంటే.

బ్రహ్మ, అహల్యను నిర్మించి, గౌతమమునికి భార్యగాయిచ్చిన కొంతకాలానికి ఇంద్రుడు చీకటి తప్పుచేసి, భంగపడుతాడు. గౌతముడు భార్యమీద నిప్పులుచెరగడం మొదలుపెట్టడం ప్రజాపతికి తెలిసి ఆశ్రమానికి పరుగెత్తుకుంటూవచ్చి, కొంతచమత్కార ప్రసంగంచేసి *అల్లుడి

*మ. పవడంపున్ జిగివాతెఱన్ సుధయు, రంభామోహనస్ఫూర్తి యూ
రువులన్, మందగతిన్ సితేభవిభుతీరున్, దంతసంపత్తి వ
జ్రవిలాసంబు దగన్ స్వవస్తుచయవిభ్రాంతిన్ సురాధ్యక్షులిం డీ
నవలా మేకొని నేరికేల కినియన్ నాతప్పుగా కింతయున్.

సీ. వదనలోచన కైతవమున రాకాచంద్ర
కమలంబులకు బొందు కలుగఁజేయు
మందస్మితోష్ఠ దంభంబున జంద్రికో
దయ రాగములకు బాంధవ్య మునుప
గమనలీలా వలగ్న చ్ఛలంబునను మ
త్త కరి కేసరులకు సఖ్యంబు నెఱప
సరసభాషా రదచ్ఛద్మంబునను శుకీ
దాడిమీబీజాళి దగులు పఱప

తే. గీ. నేఁ బ్రయత్నంబు చేసి యీ యిందువదన
సృజన చేయుట దెలియక జేసెదలుక
కుమ్మరికి నొక్కయేడును గుదియ కొక్క
పెట్టనెడు మాట నిజము గాన్పించె నిపుడు.

తే. గీ. మందయానల డెందంబు మంచి మలుకఁ
జెందనేటికి నాపల్కుఁ జిత్తగించి
యువిద కిదిగాక నేరంబు లొకటిరెండు
గావుము...

—సమీర కుమారవిజయం, ప్రథమాశ్వాసము 182—84.

అలుకతగ్గించి, ఆతప్పు కాయించుకమే కాకుండా, ఉత్తరత్రి ఒకటి రెండాలాటి తప్పటడుగులుపడినా, సహించేటట్టు మాటపుచ్చుకుని, తిరిగివెళ్లిపోతాడు. కొంతకాలానికి, గౌతమునికి అహల్య అంజన అనే ఒకకూతురిని కంటుంది. ఆపిల్లను, ఇంద్రుడికి మొదటకన్ను, వాలి అనే పిల్లవాణ్ణి పెంచుకుంటూ, ఆదంపతులు ఖులాసాగా సంసారంచేస్తూండగా, ఒకనాడు ఋతుస్నాతఅయి, కొలనుఒడ్డున తల తడి ఆరబెట్టుకుంటూ నిలుచున్న అహల్యమీద, అప్పుడే ఉదయిస్తూన్న సూర్యుడికన్ను పడుతుంది. ఆతడికి మనసుచెదిరి, రథం ఆకాశంలోవిడిచి, చల్లగా క్రిందకు వచ్చి, ఇంద్రుని తాతననిపించిపోతాడు. ఆప్రణయం పండి సుగ్రీవుడు పుడతాడు. మానికి ఈసంగతి తెలుస్తుంది, కాని అన్నమాట తప్పేందుకు వీలులేదుకనుక, సూర్యుడికిశాపం — శాపమోక్షం మర్యాదలు జరిగించినా అహల్యవిషయంలో చూసీచూడనట్లు ఊరుకుంటాడు. తర్వాత కొంతకాలానికి, ఇంద్రుడికి అహల్యమీద మళ్లా మనసుమళ్లి, కోడికూతకూసి ఆమెతో కోరికతీర్చుకుంటాడు. ఈ విషయం పసిది అంజన కనిపెట్టి తండ్రి స్నానముచేసిరాగానే ఆయనకుచెపుతుంది. అహల్య, తాను మనఃపూర్వకంగా వ్యభిచరించలేదనీ, గౌతమవేషంలో వచ్చియింద్రుడు మోసగించటంవల్ల, ఒక్కడంలో, పాతివ్రత్యం నెరపుతూన్నాననన్న సదభిప్రాయమేకాని, వేరుయోజనలేదనీ, చెప్పి కోపగించవలదని మగనిని వేడుకుంటుంది. కాని లాభముఉండదు. భార్యను శిల అయిపొమ్మని శపించి, అధూకుడుల్లో ఔచిత్యము మరచిపోయి, వాలి సుగ్రీవులను, వానరులుగా పుట్టవలసిందని అనేస్తాడు. దీనివల్లనే ఇంతకు మూడిందికదా అని, వాలీ అహల్యాకలసి అంజనను కోతియైపోతావని శపించి వాళ్ళకసి యిలా తీర్చుకుంటారు. సుగ్రీవుడు, చెల్లెలిని ఆదరించి, భయంతీరేమాటలు చెపుతాడు.

ఇంద్రునివల్ల అహల్యకు రెండోసారి కలిగిన కొడుకు శతానందుడు. ఆశ్రమాన్ని గౌతముడు వెంటబెట్టుకునివెళ్లి జనకుడియింటి పౌరోహిత్యం కుదిర్చి, అక్కడనుంచి తపస్సుచేసుకునేందుకు హిమాలయాల్లోకి వెళ్లిపోతాడు. —— ఈ కథ నిజంగా కవులు అవలంబనముగా తీసుకో

తత్వార్థాధిగమనము ఇక విరమించి, ప్రస్తుతముగా వేంకటకృష్ణప్ప నాయకుని శిల్పాన్ని పరిశీలించనౌను. ఆతడు కవిమాత్రముకాకుండా దర్శక చాతుర్యములు కూడా అలవరచుకొన్నవిన్నాణి. అహల్యను ప్రజాపతి సృష్టిచేయవలసిన అవసరం కల్పించేందుకు ఇంద్రసభలో, ఋషులందరిచేత ఒకనాటకం ఆడించుతాడు. తగవులతో మొదలుపెట్టిన కథ చివరవరకూ అలాగేనడవడం, మునుల శృంగారకళాభిప్రాయాలను పురస్కరించుకొనివచ్చిన అహల్యా రూపకల్పన, తుదకు, మునిమండలిలో ఒక అమాయకునకు విషప్రియం కావడం, తపసుకు ఫలంగా అనుభవించుతూన్న స్వర్గవిలాసినుల ప్రీడతనాల హెచ్చుతగ్గులమీద వాదాలు తెగని మానుల ప్రచ్ఛన్న శృంగార-ప్రకటనలకు ఫలితం గౌతమునికి గార్హస్థంలో శృంగార సాహచర్యం కొన్నియుగాలవరకూ లోపించడం. విధి నిర్ణయక్రమంలో ఒడి దుడుకులు-భర్తమీద భక్తి, పరాయివానిమీద వలపూ, రెండూసరితూగినప్పుడు హృదయం ఉన్న కామిని అనుభవించే అంతరక్షోభ; ఇవన్నీ-కావ్యం చదువుతూన్నప్పుడు భావనను గిలిగింతలు చేస్తూ తోచే సన్నివేశాలు. ఇలా అనుకునేందుకు ఆస్కారం కలిగించే రచనా ప్రాగల్భ్యం వేంకటకృష్ణప్ప నాయకుని సొమ్మైనది. స్థూలంగా, ఆలోచించినప్పుడు, ఇంతతోచదు. నాలుగువందలపద్యాలతో మూడాశ్వాసములుగా, చక్కనికవిత్వముతో ప్రబంధము నిర్మించినాడు అనే అనిపించినా, మానసికంగా, కావ్యరసాన్ని అనుభవంలోనికి రా జేసుకున్నప్పుడు, కవి కల్పనలోవుండేసత్తా, ప్రయోగాలు చిగిరించే అర్థశక్తి ద్యోతకమాతుంది. అర్థవైభవం కలిమిగాఉన్న మహాకవి, శబ్దాడంబరమును లక్ష్యముచేయడు అనడానికి 'అహల్యా సంక్రందనము' ప్రమాణము.

ఈ కథనే తీసుకుని సంగమేశ్వరుడు 'అహల్యా సంక్రందన విలాసం' అనే ప్రబంధాన్ని రచించినాడు. ఆతడు ఇంద్ర అహల్యా సంగమముతో కథను, తాననుకొనినటుల మంగళాంతముగా, గౌతముడుస్నానానంతరము-సూర్యోదయమగుదాకా ఎక్కడో-గడిపి యింటికి తిరిగివచ్చి,గొడవలేమీ తెలియకుండా, తెలుసుకోకుండా, సుఖంగా ఉంటూన్నారు, అని

ముగించాడు. ఇలా చేయడం ఉచితమానా? అహల్య అనుభవించిన తీయందనము, చివరకు అనుభవించిన బాధ మీదుగా చూస్తేనేకాని, సంపూర్ణముగా అవగతముకాదే! హృదయం వెన్నెలలో పండించుకునేందుకు, కామభోగిని, చేయగల త్యాగం, లజ్జావతి అయిన కులపాలిక చూపించగల నిర్లక్ష్యం, సహించగల యాతన, అప్పుడుకాని-ఆనందానికి విలువ కట్టేందుకు వీలుపడదే! హర్షపండితుడు నలుని కథ త్రుంచివేశాడంటే, అక్కడసబబున్నది. ఆపోలిక యిక్కడ పనికిరాదు.

వేంకటకృష్ణప్ప నాయకుని ప్రబంధము ఏవిధమైన అనౌచిత్యానికిన్నీ వొడమీయదు. పాకమా, ముదిరి కటువు పడదు: శృంగారమా, సభ్యతను ముంచివేసి ఉచ్ఛృంఖలముగా అతివేలముకాదు: కల్పనలా, బింకము తప్పదు-సర్వమధురమైన సద్గ్రంధము.

ముద్దుపళని, 650 పద్యాలతో, రాధామాధవ విలాసాన్ని కథగా తీసుకుని ప్రబంధముగా రచించినది. ప్రతాపసింహుని ఉంపుడుకత్తె

రాధికా సాంత్వనము.

అయిన ఈమె రచన, తంజాపూరు సారస్వతములో చివరగ్రంథము-అని బ్రౌను పండితుడి అభిప్రాయం. ప్రస్తుతం దొరుకుతూన్న ప్రతిలోగాని 605 కు మించి పద్యములుండక పోవడం వల్ల అంకెలు తారుమారుగా పడినవేమో అనిసమాధానము చెప్పుకోవచ్చును. తంజాపూరు నాయకరాజుల చల్లని యేలుబడిలో వెలసిన కావ్యగ్రంథాలలో నిదే చివరదానో కాదో, రూఢిగానిశ్చయించడానికి ఆధారములు లేవు.

ముద్దుపళని, స్వతంత్రముగానే గ్రంథము రచియించినది, అని యింతవరకున్నూ ప్రసిద్ధిఉన్నది. ఆమెవలలో చిక్కిన రాజగురువు వీరరాఘవాచార్యుడు, గ్రంథరచనలో, అంతోయింతో సాహాయ్యము చేయుచుండా ఉండడని, అసలు ఆతడే రచియించి, ఆ వలపుగత్తెపేర వెలయించి ఉండటానికి కూడావీలున్నదనీ, ఇలా, నిందలు తప్పకుండా వస్తూన్నవి. వానికి తోడు, ఇప్పుడు వేంకటకృష్ణప్పనాయకుడు ఈ రాధికాసాంత్వనము రచించాడని అంగీకరించేటట్లయితే, ముద్దుపళనికి ఇంత

వరకూ సారస్వతంలో, ఎవరి నిర్వాహకత్వం వల్లనైతేనేమి, సంక్రమించి ఉంటూన్న ప్రతిష్టయావత్తూ మాసిపోయి, గ్రంథచౌర్యం చేసిన నీచురాలు అని అనవలసి వస్తుంది. ఎందుచేతనంటే, పద్యాలన్నీ ఒకటే-ఉన్నంతవరకూ: సంభోగవర్ణన, అహల్యాసంక్రందనంలో ఉన్న వచనమే! కథలో, ఉపనాయిక, ఇక్కడ సత్యభామ-ఈ రవంత భేదమే తప్ప.

కాని, ముద్దుపళనికి, ఈఅపవాదుతొలగించేందుకు, సదుపాయములు, కనబడుతూన్నవి. ఏమనంటే,

నముఖ వేంకటకృష్ణప్పనాయకుడు, రాధికాసాంత్వనము ఏకాశ్వాసప్రబంధముగా నిర్మించాను అనేందుకు, ఇతరగ్రంథాలలో కాని, ఆతడు రచించిన గ్రంథాలలోనైనా కాని, ఎక్కడా ఆవ్రశంస కనబడదు.

ముద్దుపళనికావ్యం ద్వితీయాశ్వాసంలోనుంచి మొదలుకొని కొన్ని పద్యాలుఏరి, చివర అహల్యాసంక్రందనము వచనమూ, ఆశ్వాసాంత గద్యమూ, కలిపి, ఇళఅన్నచోట సత్యభామ అనిమార్చి, కలగాపుల గంగా, ఎవరో చిలిపితనానికి, వేంకటకృష్ణప్పనాయకుడికి ఈ అనవసర ఖ్యాతీ, ముద్దుపళనికి అపఖ్యాతీకలిగించడానికి చేసినవని అనిపిస్తుందే కాని, రెండుకావ్యాలూ పరిశీలనగా చదివితే, ఒకరు సంగ్రహంగా కూర్చినదానికే మరొకరు వెనుకాముందూ అదుకులువేసి, గ్రంథమంతా కేవల స్వకపోలకల్పితమనే ప్రతిష్టకలిగించుకునేందుకు ప్రియత్నించారు, అనిసూచనగా అయినా కనబడకపోవడమే కాకుండా, స్పష్టంగా, ఈవిషయంలో ముద్దుపళనికి అన్యాయంజరిగిందని తెలుస్తుంది. జయంతి రామయ్య పంతులుగారు ప్రకటించిన జైమిని భారత భూమికలో రాధికా సాంత్వనము వేంకటకృష్ణప్పనాయకుని కృతి అని వ్రాయబడినది. నిడదవోలు వెంకటరావుగారు, సత్యభామా సాంత్వనం భూమికల్లో, అలాగే అన్నారు. కాని ఎవరున్నూ అలా అనడానికి కారణములు ఏమిఉన్నవో చెప్పారుకారు.

ఇలా సందేహాస్పదంగాఉన్నా, రాధికాసాంత్వనమును ప్రస్తుతం ఈసంపుటంలో ప్రకాశకులు చేర్చడం, ముద్దుపళని కవిత్వం తీయదనంతో

మరోమారు చదువరుల నోరూరించే సాధుప్రయత్నమే కాని, ఆ రస మోహిని ప్రతిభను కళంకితము చేయాలనికాదు, అని సమాధాన పడవలసి ఉంటుంది.

సారంగధర చరిత్రము.

పడుచుతనంలో ఉండే కుమారుడికి సంసారసౌఖ్యం కలిగించటానికి పూనుకుని, ఆ ఉత్సాహం ఆత్మీయంగా విషమంగా అనువదించుకుని, భంగపాటు వచ్చినప్పుడు, చెదరినమనసులతో, యౌవనమత్తైన వృద్ధులు ఇహపరదూరులయేటట్టుగా చేసే హంగామాలో కవుల కల్పనకు తులతూగకలిగిన ఇతివృత్తలక్షణం తరతరాలుగా, మనదేశంలో, విలాయతీ సారస్వతాల్లో అనేకరూపాలలో గోచరమౌతూనేఉన్నది. ప్రకృతికి విరుద్ధగమనం తీర్చడానికి యత్నించినందువల్ల రేగే ప్రళయజ్వాలలు సారంగధర కథలో ప్రత్యక్షమౌతూన్నవి.

ఈకథంతా మనదేశంలోనే జరిగిందా. ఇంతపరిహాసపాత్రమైన పని, తెలుగువారికి భారతంప్రసాదించడానికి పూనుకున్న రాజనరేంద్రుడు చేసి ఉంటాడా? నమ్మేవీలులేదు - నమ్మవలసిన అవసరమున్నూ లేదు. చరిత్రలో రాజనరేంద్రుడి కుటుంబంలో, సారంగధరలో వచ్చే పేరులున్నవారేలేరు. పోనీ, ఇదేమంతచరిత్రలోకి ఎక్కతగిన ఉత్తమము సందర్భం అని, సారస్వతంలో నిలిచిపోలేదేమో అనుకుందామన్నా, భారతం ఉపక్రమణికలో కాకపోయినా, వచన గ్రంథముగా అన్నా వెలయకుండా మానేదా? అప్పకవికి పూర్వం ఎవరూ ఈఘటనను తల పెట్టనేలేదు. అతని మాటల్లో నిజాయితీ ఉండేదీ లేనిదీ, తనకు నన్నయ భట్టీయం సిద్ధప్రసాదమని తేల్చడంకోసం అసందర్భంగా అతడు ఆడిన అబద్ధాలే ఋజువుచేస్తూన్నవికదా? తెలుగులో, ఈకథను పద్యకావ్యంగా రచించి, తంజావూరు రఘునాథరాయలకు అంకితంచేసిన చేమకూర వెంకన్న కథ మాళవదేశానికి సంబంధించిందికాని, తెలుగునాట జరిగింది కాదనీ, చిత్రాంగి రాజనరేంద్రుని భోగస్త్రీకాని, మహిషి కాదనీ చెప్తూండటంలేదా? వంగదేశంలో ప్రచారంలో ఉన్న, కథలో, సారంగధరుడు, పూర్ణుడనే భక్తుడు: చిత్రాంగి, లూనా అనే భమర

వనిత. మహాకవి గిరీశచంద్రుడు, పూర్ణచంద్ర అనేనాటకం వ్రాశాడు ఈఇతివృత్తం తీసుకుని. — శ్యాలకోటను, శాలివాను డనే రాజు పరిపాలించుతున్నాడు. ఇచ్ఛా అనే ఆమె ఆతని మహిషి. పూర్ణుడు, కుమారుడు: కొంతకాలానికి రాజు, లూనా అనే మోసగత్తెను రాణిగాచేసుకుని, అసలుభార్యను విడిచిపెడతాడు. లూనా, ఆమెతండ్రి, జాంగలికుడైన జంబూ, వీళ్లుఇద్దరూచేరి, రాజ్యం అపహరించాలి ఏలాగైనా అని కుట్రలు చేస్తూంటారు. లూనా, పూర్ణుడు తనను బలాత్కరించాడని రాజుతో అబద్ధముచెప్పి, కళ్లుపొడిపించి పాడునూతిలో కూలద్రోయిస్తుంది. -ఇక రాజును కడతేర్చడానికి, విషం పానీయంలో కలిపి త్రాగించపోయే సమయానికి, గోరక్షనాథుడనే పరమ శివరూపుడైన సిద్ధుడిఅనుగ్రహంవల్ల కళ్లువచ్చి, సన్యాసి అయిపోయిన పూర్ణుడు అక్కడకు వచ్చి తండ్రిని కాపాడుతాడు. రాజు, లూనా చేసిన ద్రోహం అప్పటికి పూర్తిగా గుర్తించినా, ఆమె అదృష్టంవల్ల, పూర్ణుని బోధలలో రాజుమనసు కరిగి ఆమెను క్షమించుతాడు. వలచి, ఆతడే దైవమనినమ్ముకుని, సమాగమంకోసం వేచుకుని ఉన్న సుందరా రాణి వలపును ధన్యంచేయకుండా,ఆమెకూ, తల్లికీఉపదేశంచేసి వారి అనుజ్ఞ తీసుకుని పూర్ణుడు, జీవితం సన్యాసిగానే గడపుతాడు.

ఇది, గిరీశబాబు నాటకం కథాసంగ్రహం. సారంగధరుని కథ — కథలలో, నామములలో తేడాలతో హైందవ సారస్వతంలో విశేషం గావ్యాపించి ఉన్నది.* వేంకటకృష్ణప్పనాయకుడు, చేమకూరవానిని

* నవసాథుల చర్యలకు ప్రధానరంగము మహారాష్ట్రదేశ భాగముగా గనబడుచున్నది. శివపుత్రుడగు మీననాథుడు తండ్రివలన నధ్యాత్మవిద్యోపదేశమును బొంది, ధరణిపై జరియింపబొమ్మన, నాతని యాజ్ఞవడసి, భూలోకమున సులలిత యోగాబ్ధిచంద్రుడై, సకలదేశంబులునుదిరిగి, మాళవదేశంబున, రాజమహేంద్ర నరేంద్రపరిపాలితంబగు మాంధాతపురంబున దొలుత విడిసిన వాడయ్యెను. ఈసందర్భమున నీతడు తిరిగినదేశములలో నాంధ్రదేశమున్నట్లు చెప్పబడియుండలేదు.

అనుసరించి, మధురమైనశైలిలో వచన సారంగధరచరిత్రను రచించినాడు. ముద్రింపబడవలసిన గ్రంథములలో ముఖ్యముగా ఇది ఒకటి.

ఈతడు తొలుత వాసమేర్పఱచుకొన్నట్లుగాచెప్పబడినది, మాళవదేశము నందలి మాంధాతపురముగాని, యది యాంధ్రదేశము నందేపట్టణమును గాదు.

ఈ మాంధాతపురాధీశుండగు రాజమహేంద్రుని కుమారుడు, సారంగధరుడు. ఈతనికథయంతయు, నీమాలవదేశగతమగు మాంధాత పురముననే జరిగెననియు, తత్ పురసమీపమునందలి కొండలలో వాస మేర్పఱచుకొనియున్న మీననాథుని యనుగ్రహమువలననే యాతనికి గాలుసేతులు మరల గలుగగా, 'చౌరంగి' యనునామమున సిద్ధుడై యాతని శిష్యులలో నొకడయ్యెననియు, నీరాజమహేంద్రుని యాలమందల నుగాచు గోరక్షకుడుగూడ, నాతని ముఖ్యశిష్యులలో నొకడై, యోగ సామ్రాజ్యపట్టభద్రుడయ్యెననియు జెప్పబడినది....

... మీననాథుడుకాని, యాతని వెంటనంటియున్న సారంగ ధరుడుకాని, యాంధ్రదేశమునకు వచ్చినట్లైన గనబడదు. ఇట్టి నవ నాథుల కథలన్నియు హిందూదేశమున బశ్చిమతీర భాగమునకు సంబం ధించినట్లగపడుచుండగా నిందుప్రధానపురుషులలో నొక్కడును మీన నాథుని తొలిశిష్యుడును నగు సారంగధరుని గూర్చినకథ యాంధ్రదేశము నకును, నందు నాయకరత్నమనుబోని రాజమహేంద్రవరమునకును సంబంధించినదిగా జిరకాలమునుండి యీదేశమున దలంపబడుచుండుట యాశ్చర్యకరము కాకమానదు...

సారంగధరుని గూర్చిన కథలు:— మత్స్యేంద్రనాథుని యనుగ్రహమువలన సిద్ధుడై చౌరంగి యనుపేరు వహించిన యీసారంగధరుని కథ భిన్నరీతులగానవచ్చుచున్నది. మహారాష్ట్రభాషలోని నవనాథచరిత్రను బట్టి రచింపబడిన తెలుగుగ్రంథములో, నీచౌరంగి పేరు కృష్ణాగరుడని కలదు. ఈతడు కౌండిన్య నగరాధిపుడగు శశాంగనృపాలుని పుత్రుడు. ఈతని పట్టమహిషి మందాకిని. వీరికి చిరకాలము సంతానములేకుండుటచే

జైమిని భారతము:—

'...ఇందు బ్రిమీాల యర్జునుని రాక విని, యాతని మదిలో గామించుటయు యుద్ధముజేసి యాతనిని వశపఱుచుకొని యింటికి

---

వీరు మాధవుని ధ్యానించి, సంగమేశ్వరమున నాతనిబూజింప, నాప్రదేశమున నొకనాడు రాజు అర్ఘ్యంబిడుసమయంబున శివవీర్యబలంబుచే నాతని యంజలీభాగంబున నర్భకుడుద్భవించెను. ఆతని దెచ్చి రాజు భార్యకొసగి కృష్ణాగరుడని నామకరణంబొనర్చెను. పిదప నీతనికి వివాహముజేయ, రాజు ప్రయత్నముచేయు సమయంబున మందాకినీదేవి మరణించుటయు, రాజు, కొమరునికై యుద్దేశించిన చిత్రకూటనగరాధిపుని కుమార్తెయగు భుజావంతిని దానె వివాహమయ్యెను. ఈమె యొకప్పుడు నవయౌవనుడగు కృష్ణాగరుని జూచి మోహించి, రాజు మృగయావినోదంబున నరణ్యంబునకేగినతఱి, యొక చెలికత్తెను బంపి యాతనింబిలిపించి, తనచిత్తంబునగల చిత్తజునితాపమును వెలిబెట్ట, నాత డతిక్రుద్ధుడై యామెప్రార్థనమును దిరస్కరించి, తనయింటికిబోయెను. పిదప, నీవిషయము కృష్ణాగరుడు తండ్రికెఱిగించునేమో యనుభయముచే, బరితపించుచుండు సమయంబున దన చెలికత్తెచేసిన దుర్బోధనలచే, నేరంబు కుమారునిపై వైచి, రాజునకు గోపము పుట్టించి, కరపాదఖండనము జేయించెను. అప్పుడా యూర దిరిమ్మరుచున్న గోరక్షనాథు డీవిషయము మత్స్యనాథునికి దెలిపి, కృష్ణాగరుడు శివవీర్యోద్భవుడగుట యెఱింగి, చతురంగ పీఠముపై కరచరణంబులు ఖండింపబడిన కతంబున నాతనికి చౌరంగనాథ నామంబిడి తండ్రికెఱిగించి వానిం దోడ్కొని, బదరి కాశ్రమంబునకుజని, యచ్చట ఘోరతపోనియమంబున, గరచరణంబులతో గూడ, మహాసిద్ధుల నాతడు బడయునట్లుచేసి, యనుగ్రహించెను.'

చేమకూర వేంకటకవి సారంగధరచరిత్రకు టీకవ్రాయుచు నందా కథకు మూలమనదగిన చౌరంగికథ నవనాథచరిత్రములందిట్లు కలదని, యీాక్రింది కథను వేదము వేంకటరాయశాస్త్రులుగారు ఇచ్చియున్నారు.

దీసికొనివచ్చి, యాతనితో గ్రీడించుటయు మిక్కిలి పెంచివ్రాయ బడినది. ఆ భాగము ఇప్పటి లోకమునకు రుచింపదని యిందు ముద్రించుట

---

రుద్రపురమున భులేశ్వరుడను రాజు కలడు. ఆతనికి, చంద్రావతి, శోభావతి యను నిద్దఱుభార్యలు. శోభావతి, సవతిని వేలార్చుటకై, యామెపై అంకులుమోపి, గర్భిణియగు నామె నరణ్యమునకు వెడలగొట్టించెను. ఒకశివాలయముకడ నొకగంధర్వకన్య యీామెకు మత్స్యేంద్రవ్రత ముపదేశించెను. చంద్రావతియు, మునుల యాశ్రమమున నొకసుతునిగని, చంద్రశేఖరుడని మునులచే నామకరణము చేయబడిన యాతనికి మత్స్యేంద్రోపాస్తి నుపదేశించెను. ఒకప్పుడు, భువలేశ్వరుడు, యజ్ఞముచేయుచుండగా, మునీశ్వరులతోగూడి యీ కుమారుడచ్చటకు బోవుటయు, యజ్ఞభూమికడ మునిశిష్యులతో బంతులాడుచున్న యీకుమారుని, శోభావతి చూసి మోహించి, యాతని బంతి తనచేటికచే దెప్పించుకొనెను. బంతియడుగబోయిన చంద్రశేఖరునికిని శోభావతికిని, పావురమడుగబోయిన సారంగధరునికి చిత్రాంగికి జరిగినవృత్తమే జరిగినది. శోభావతీప్రేరణంబున రాజు చంద్రశేఖరుని కాలుసేతులు తలారులచే దటిగించెను. మత్స్యేంద్రనాథ స్మరణముచే నాతడు కాలుసేతులు మరలబడసి తల్లియొద్దకు బోయెను. రాజు తథ్యమును దెలిసికొని శోకింప, మత్స్యేంద్రనాథుడాతనిచే ప్రాయశ్చిత్తముగా నొకశివాలయము నిర్మింప జేసెను. అదియే బదరికాశ్రమమున భులేశ్వర మనుపేరనున్న దేవాలయమట.

వీనిని బోలిన కథ యొకటి కొంతభేదముతో గన్నడభాషలో గూడ, 'కుమార రాముని కథ' యనుపేరుతో బాడసూపుచున్నది.

— పదునాల్గవశతాబ్దిని కంపిలిరాయుడను రాజొకడు హంపీ సమీపమున గల కంపిలినగరము పాలించుచుండెను. ఈతనికి గుమార రాముడను కుమారుడొకడుకలడు. ఈతడు మహాశూరుడు, బాహుబలపరాక్రమశాలి. దిగ్విజయార్థము బయలుదేరి, యనేకులగు రాజులనోడించి, తండ్రికి గప్పముగట్టునట్లుచేసెను...

వ్రాని వేసినారను. ఇదిగాక పరిషత్తుకు వచ్చిన రెండవ ప్రతియందుమాత్రమే, యట్టివిశేష వర్ణనము కనంబడుచున్న



ఒకనాడు కంపిలిరాయడు వేటకై యరణ్యమునకు బోయిన సమయంబున కుమారరాముడు స్నేహితులతో జెండ్లాటనాడుచుండ నా బంతి, విధివశమున రాజు రెండవభార్యయగు రత్నాజి మేడపై బడెనట. దానిని తెచ్చుకొనుట కీత డచటికి పోయి యామెనడుగగా, నామె యీతని మోహించి, క్రీడాగృహమునకు రమ్మనుటయు, నాతడా పాపకార్యమున కంగీకరింపక, విదిలించుకొని పాఱిపోయెను. రా జరణ్యము నుండి యింటికిరాగానే, రత్నాజి, కుమారరాముడు తండ్రి యింటలేని సమయముజూచి, తనమేడకువచ్చి తన్ను బలాత్కరించెనని కొండెములు చెప్పగా, రాజామె మాటలను నమ్మి కుమారునికి మరణదండనము విధించెను. మంత్రియగు బైచప్ప రత్నాజి చేసిన మోసమును దెలిసికొని, కుమారు నొక పాతాళగృహమున దాచి, యాతని వధించితినని రాజుతో జెప్పి, యాతనిని సన్మతింపజేసెను. రా జన్యాయముగా గుమారుని చంపించెనన్నవార్త లోకమున వ్యాపించెను. ఈసందర్భమును, ఢిల్లీ సుల్తాన్ దెలిసికొని, కంపిలిరాజ్యమును స్వాధీనము చేసికొనుటకై కొంతసైన్యముతో బహదూర్ ఖానుని బంపి, యాతడద్దానిని సాధింపలేకపోగా, తానె స్వయముగావచ్చి కోటనుముట్టడించెను. అప్పుడు కుమారరాముడు జీవించియున్నచో, శత్రువును సులభముగా పాఱదోలి కోటను రక్షించి యుండెడివాడని, జనులందరు రాజును నిందింపసాగిరి. ఆసమయమున బైచప్పమంత్రి భూగృహమునుండి కుమారరాముని దీసికొనివచ్చి, యాతని ముందిడుకొని, కోటవాకిలి దెఱచుటయు నా కుమార రాముడు శత్రుసేనలను జెండాడి, యావలికి బాఱదోలెను. కాని, ఢిల్లీసుల్తాన్ సేన లపారముగా నుండుటచే, వారితో బోరాడుచూ, కుమారరాముడు రణరంగమున బ్రాణముల విడువ వలసినవాడయ్యెనట.

...ఢిల్లీసుల్తాన్‌గానున్న తుగ్లక్ కంపిలిరాయనిపై దండెత్తి యానగరమును స్వాధీనపఱుచుకొనినట్లు, చారిత్రిక నిదర్శనములు గలవు. రాజమహేంద్రవరమందు వతెనె అచ్చటను, గొన్నిస్థలములను

ముద్రిత జైమిని భారతపీఠికలో ఉన్నది. లోకం అంతటికీ ఒకేరుచి కాదని, మనకు సిద్ధాంతంగా అంగీకారం అవుతూన్నప్పుడు, ఒకేఒకరు, అభిరుచి విషయంలో ఆధారం లేకుండా యావత్తు లోకానికీ ప్రాతినిధ్యం వహించడం అంతసజావుకాదేమో; ఏమైనప్పటికీ, ఉన్నఆ ఒక్క-ప్రతినే ఆధారంగాచేసుకొని, వీరైనంతవరకు స్ఖాలిత్యములు రానీకుండా, పరిషత్తువారు విడిచివేసిన భాగం ఈ సంపుటంలో ముద్రించినందువల్ల, స్వల్ప గ్రంథపాతములు మినహాగా, జైమినిభారతముకై ఇంచుమించు సమగ్రంగా, లభించే అవకాశం కలిగింది. వేంకటకృష్ణప్పనాయకుని రచనను-అనౌచిత్యము, అశ్లీలత — వీనికెడమీయని భాగాన్ని అకారణంగా, తోసివేసే రసనీరసత్వం లోకులకు అంటగట్టడం భావ్యము కాదుగదా!

---

'చిత్రాంగిమేడ, రత్నాంగిమేడ యున్నస్థలము' లని చెప్పి చూపుచుండు వాడుకయు గలదట...

మఱియు, బౌద్ధజాతకములలోగూడ, వీనిని బోలిన కథయే గలదట—

[— కొరన ద్విపద నవనాథచరిత్ర పీఠికలో, కోరాడ రామకృష్ణయ్యగారు.]

ఙ్ఞ ఇది అయిదాశ్వాసముల వచనకావ్యము... ఈకవి అధ్యాయ క్రమమున గద్యము వ్రాయుటబట్టి సంస్కృతాశ్వమేధ పర్వమునుగూడ చూచినాడని చెప్పవలసివచ్చినది. కాని, వచనరచనమంతయు, బనములు వాక్యములు సమాసములు ప్రయోగించుటలో, గూడ, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని పద్యకావ్యమునే వచనశైలిలో వ్రాసెనని చెప్పగలదు. కాని, కవి యందందు, విశేషముగా శృంగార వర్ణనాసందర్భములందును సామాన్యముగా యుద్ధవర్ణములయందు, నాసంస్కృతాంధ్ర కావ్యములను రెంటిని గూడమీఱి, యథేచ్ఛముగా గల్పనము గావించి, స్వకవిత్వమును గూడ గొంతవరకిందు జొనిపెను. మఱియు. మూలమును, నాంధ్రపద్యకావ్యమును గూడ మీఱి వర్ణనాతిరేకంబునను, గథిత కథనంబునను గ్రంథ మామూలాగ్రముగా బెంచివ్రాసెను...

[— జైమిని భారత పీఠిక]



అనురాగ విలాసభావనలు నురుగుల తరగలై యౌవనపూర్ణ వికాసంలో మానసాంబుధిని అల్లకల్లోలంచేయడానికి తలపడిన పారవశ్యవేళల్లో, కలాచైతన్యంతో అందాల మెరుపులు స్పందించే నీ తరుణజీవనం, శాపంతో, జడమైపోయి, లాస్యము పేరుకుపోయిన చాపరాయిగా అయిపోయిందే! ఆనందజ్వాలామాలికలు, పాషాణ శీతలత్వానికి దిగిపోయినవే.

గౌతమముని కోపతాపం విసురుతో, ఆదిమూర్తి అయిన క్షమాదేవి, ఓదార్పు కౌగిలింతలోకి నీవుచేరుకొని, కళంకలేశాన్ని, సర్వమూ పునీతంచేసే మృత్తికాస్నానంతో, గోటమిాటే శావు. నీకు సంక్రమించిన దోషము, శాంతమూర్తి అయిన ముని హృదయకమలంలో, నీవునేరక చేసిన తప్పిదంతో, ఔర్వాంగారాలని రగుల్పడమే. కాని, ఆతని అనుగ్రహంలో, ఆగ్రహానికికూడా సవ్యమైన వినియోగం కలిగించేనేర్పు, తనశాంతిలో, నీకుశాంత — స్థిరావాసం — మోక్షఫలంగా ప్రసాదించడంలోనే కనిపించడంలేదా?

పతి ఈర్ష్యాతపంలో, యౌవనవైభవ— జీవితకుసుమాలు వాడిరాలిపోయినవి, కాని, అంకురఫలితంకోసం బీజరూపములుగా, వృంతాలువీడిపడి, నవనవోదయ ప్రాభవం దక్కించుకున్న పరువం వానికి ఉన్నందువల్ల, నీవు రత్నగర్భలో మరుగుపడి ఉన్నంతకాలమైనా, విశ్వాలోచనులైన కవుల మానససీమలను విడనాడలేక పోయినావు.

నీవు జాణవుకావా? ప్రియులను గికురించే ప్రౌఢతనపు జాడలు ఎరుగని పట్టరాలవా? శిలవై, బాహ్యానంచార ప్రవృత్తులు అరికట్టుకున్నా, అంతర్వాహినిగా గమకించే జీవనకల్లోలినీ సీకర రహస్యచనములతో దోహదాలుదిద్ది, ఆచలువలతో, లతాశ్రీ — ఆళీజనాన్ని వెలయించుకుని, వాని వికసన హాసాలతో, పురాతన ప్రియుడైన సూర్యుడికి, వెనుకటి శృంగారగాథలు పుల్కరింతలుజేసి, నీవు ఆహ్లాదానికి మురిసిపోవడం నేర్చుకోలేదా?

పాతివ్రత్యపు వలలో, లోకమోహిని నైన నీ అలవికి మించిన అందాలని ఒడిసివేసి, ఇతరులు తేరిచూడకుండా, చీకటిపాతరలలో నిక్షేపంలాగా పదిలపరచుకున్న గౌతముని స్వార్థతపస్సు మాధికి బుజుధిక్కారమేనమ్మా — నీ నవపల్లవ హృదయం ప్రనకరామోదాన తహతహతో క్రోరకించడం: యామినికి వశంగతుడై, నీకు ఆలోకనభాగ్యం అస్తమింపజేసుకునే దినరాజు త్రిపాఅరుణాస్తమున ముఖ బింబం శోణ — పాండిమాభాసంతో, విప్రలంభ — దైన్యం నిట్టూర్పుగా, లయ కలిపించుకుంటుందమ్మా. ఫలరూపానికి తెచ్చుకోలేని, ప్రణయ కాంక్షలు, తారకాసంతానాన్ని నీకు ప్రదర్శించి, నీమాతృహృదయాన్ని ఒరుసుకుపోయి చీకటితెరలమీద వెలుగులజాలరులు అల్లి, అరుణోదయందాకా, నిన్ను ఎంత అలయించుతా యమ్మా.

మానవలోకానికి హితోపదేశంగా అల్లుకుని పోయినా, నీప్రణయం దేవరహస్యమన్నమాట నీమనసు ఒకటి ఎరుగునేమో? — చీకటిలోనేకాదూ, మునిపాదపరిచర్యలతో నవసి పోయిన నీకోమలాంగుళులు, సౌందర్యమూర్తి సంస్పర్శనకు నోచుకున్నవి. తిమిరావకుంఠనం మరుగునకాదూ, నీమనసునిండిన ప్రణయం నీవుకోరిన తీరుల్లో పండింది! నీవుచేసింది చీకటితప్పుకాదు: అంతవరకూ, నీకన్నె తనాన్ని ఆశ్రమపాంతాలలో వెన్నెలగా కాయించిన, ఆతప్పు-చీకటిది.

నీదీ తప్పిదమని ఎవరుఅగ్రహించారు? మాధవునికే స్వీయలైన వనదేవతలు, ప్రణయానికి ఆహుతి అయిపోయిన, నీధీరతనానికి కుసుమాంజలులుగా, వర్ణమయమనులైన వనసీమలను

విడిచి, నీవు ఉనికి కాజేసుకున్నందువల్ల ప్రణయపుణ్యభూమి అయిపోయిన ధూసరక్షేత్రానికి, ఫలకేదారాలను విడిచిరాని వసంతుని తర్లించుకునివచ్చి, అడవితీవెల పెనయల్లికలుగా, నిన్ను కౌగిలింతలతో సమాశ్వసించలేదా? ధరిత్రీదేవి, రంగురంగుల కీటకాల అలలురేపి, భ్రమరగానాలు సన్నివేశరోదసిని మూర్ఛనల తేల్చేవిధానం కలిపించి, ఆశ్రమప్రశాంతికి, ప్రణయాస్థాన విలాసములు అలవరచి నీ వంటరితనంలో, మధురభావనలు తీయతేనియల ధారలుగా ఊరించలేదా? అంధకారము, జడశాంతి— నీరాగహృదయంలో ప్రణయంనాటిన వెలుగుతీవలు నవలుసాగడానికి, విరులై కోరికలు సుప్రసన్నంగా విరియడానికి, శామ పాలికలు, అర్థవంతంగా, నిలిసిన రక్షలు.

కాని, ఆవెలుగులు మళ్లా వెలుగులో కాని విప్పారవా? అందుకోసమేనా, ప్రణయపరిపూతమై చంద్రకాంతస్వచ్ఛమైన, నీమూర్తిలో, జీవన విద్యుత్ప్రభలు నింపుకోవాలని, ఆమహామహుడి స్పర్శకు కాచుకుని, అలికిడికి తలఒగ్గి, యుగాలుగా, రవంతఅయినా చలించని ఉత్సాహంతో, ఉండటం?- పాపము అని అనరాదు, ఎందుకనీ, అదే నీ కలుషాన్ని అంతా కడిగివేసింది. శాపము- నీకు నూతన శుభ్రజీవనానికి అవకాశం కలిగించింది.

నవనవోదయ విలాస విభ్రమాలు, నీ పునరుజ్జీవిత మూర్తిలో, వెలుగులుగా మెరసినా, వాటి తారళ్యాన్ని, చమకితంచేయడానికి అని అయినా, ఆ అంతుభేదనుకున్న చీకటి కనుకొలకులనుండి జారిన మంచుబిందువుల బరువులు, నీ కనురెప్పలు నీలోత్పల దళాలుగా మ్రోయక తప్పదు. నీ కైశ్యము, దీర్ఘవర్షా-శైవాల పుంజాలకు మెరుగులు పెడుతూండక తీరదు.

నీవు చీకటులు తెమల్చుకుని వెలుగులో తలవత్తడంలో- నీప్రబుద్ధమూర్తిలో, అతి-ప్రాక్తనత, నవ-నవీనత, చిత్రరీతిలో మిళితమైపోయినవి. విరిసీ విరియని, విరికన్నెలాగా తరుణివి అవుతావు: నగరాణి లాగా, అనాదివై ఉంటావు.

* * *

మహాకవి రవీంద్రుడు, అహల్యా శాపకథా కథనంలో, సుప్త భారత దేవీమూర్తికి, ప్రబోధగీతం ఆలాపించాడు. ఆయనరచనను, వివరణగా విస్తరించుకుని, ఇలా భావమును వ్యాఖ్యానించుకున్న సమాలోచనలలో, శాపాహతికి ప్రణయారంభాన్ని ఆవాహుతి యిచ్చుకున్న పాపరాశికి, స్మరణమాత్రాన పాపపరిహారంచేసే దివ్యప్రభావం, పాతివ్రత్య బలంచేత దక్కించుకున్న పుణ్యమూర్తులతో జత కలిపి, పంచకన్యలలో ఒకదాన్నిగా గౌరవించిన, పురాణమునుల భావ ఔదార్యం, భావనా-ఔచిత్యం, విస్పష్ట మౌతుంది.

వంకలు మిగిలిపోని అందాలకు నూతనములైన చందములలో అవతువ సారూప్య సహాయోగానికి అయి, సాఫల్యం ప్రసాదించి వైదిక విజ్ఞానాన్ని అన్వర్థమయిపోయేటట్టు నిలుపుకున్న పుత్రికాపతి, మనసార కన్న సంతానం, కానక కానక, కనిన మోహనమూర్తికై వశం అయిపోయిన నిరంతర-ప్రణయ యోగారూఢినికాని, కామ-సామగానం, ఉదాత్త ధోరణీ ముఖరితముగా ఉద్గీథ - ప్రణయ ప్రణవోపాంశువు కాలేకుండా ఉండేది.

అహల్య మధుర ప్రణయ మధుమోహిని. ఆమెకు మనసైన పొలయలుకల కలిమినంతా, కావ్యకన్యకు సింగారపు మురిపెములు అందగించడానికి, రాసిక్య పణంతో నిలుచుకున్న మధుర నాయకుడి కృతి, మధుర కృతులకు నాయకమే అని కావ్యానందులు అంగీకరించి తీరవలసింది.

రామకృష్ణశాస్త్రి

శ్రీరస్తు.



# అహల్యాసంక్రందనము.





## ప్రథమాశ్వాసము.

శ్రీ సొబగొందు నిందుసర
సీసరసీరుహకేసరద్యుతిన్
వీసరవోక మీసరపు
నిగ్గుల జగ్గుల దుప్పటిన్ దటి
ద్భాసితనీలమేఘు ఘన
భాసిలు రంగనివాసుఁ గౌస్తుభో
ల్లాసు రమాధివాసు సవి
లాసమతిన్ నిరతిన్ నుతించెదన్.

ఉ. రంగమహీశుకొమ్మ జిగి♦రంగులబంగరుబొమ్మ సంపదల్
పొంగుచు నిచ్చు గుమ్మ పతి♦ఱొమ్మడబాయని ముద్దుగుమ్మ య
య్యంగజుఁ గన్నయమ్మ శర♦ణార్థికి వేలుపు మ్రానికొమ్మ నె
మ్మిం గరుణించి యిచ్చు నెల♦మిన్ గలిమిన్ బలిమిన్ దిరంబుగన్. 2

ఉ. బంగరుగట్టు సింగిణియుఁ ♦ బంకజలోచన దివ్యబాణమున్
రంగుగఁ దాల్చి వ్రేల్మిడిఁ బు♦రంబులు ద్రుంచి జగంబుఁ బ్రోచు ప్రాక్
జంగము క్షీరవారిధి ని♦షంగము భక్తజనావనక్రియా
చంగముఁ గిరిత్రరంగ మల ♦ సౌందరలింగము నాశ్రయించెదన్. 3

చ. కరమునఁ జిల్కఁ బల్క జిగి♦కమ్మలు చెక్కులఁ గుల్కఁ గన్నులన్
వరకృప చిల్క మోవిఁ జిఱు♦నవ్వుల వెన్నెల దొల్క ధాత్రికిన్
వర మొసఁగన్ గదంబవన♦వాటిఁ జెలంగెడిమేటి సుంద రే
శ్వరుని వధూటిఁ గొల్తుఁ గృత♦బంధవిమోచనఁ బద్మలోచనన్. 4

ఉ. అంబ జగత్త్రయంబును ద♦యం బరిపాలనచేయు సద్గుణా
లంబ సహాసకోమల క♦ళాలలితాననచంద్రబింబ హే
రంబుని గన్నయంబ సుర♦రత్నసమాధరబింబ మాకు ని
త్యం బఖిలాండనాయిక జ♦యం బనయంబు నొసంగుఁ గావుతన్. 5

ఉ. ప్రాంచితవేదనాదము స♦మంచితమున్ నలుమోములన్ మరుత్
ప్రాంచిత కాంచనాచల గు♦హాంచలతన్ రహిమించు నీరుఁబోల్
పంచు గురాని వేడ్క మిగు♦లన్ నడిపించు విరించి నెంచి భా
వించి నమస్కరించెద స♦మీహితసాహితి సేకరించఁగన్. 6

ఉ. సారతరంగిణీ కనక♦సారసరాజమరాళి కై వడిన్
హారి హిరణ్యగర్భ వద ♦ నాంతరసీమ వసించువాణి శృం
గార సరోజపాణి నవ♦కంధరవేణి విలాసధోరణిన్
వారక నిచ్చ నిచ్చలు ని♦వాసముచేయు మదీయజిహ్వికన్. 7

చ. కుడుములు చాల మెక్కి కలు♦గుంబలులాయపుఁ దేజి నెక్కి ప్రా
పుడువుల వన్నె కెక్కి మహి♦నూల్కొను విఘ్నములెల్లఁ జెక్కి య
య్యుడుపతి మౌళిపాదముల ♦ కున్నత భక్తిని మ్రొక్కి భక్తులన్
విడువక ప్రోచు భవ్యమతి ♦ విఘ్నపతిన్ సుమతిన్ భజించెదన్. 8

సీ. రామకథా సుధా♦రసములు వెదచల్లు
సర్వజ్ఞు వాల్మీకి ♦ సన్నుతించి

బహువేదశాఖలఁ బల్లవింపఁగఁ జేయు
భారతకవి వ్యాసుఁ బ్రస్తుతించి
నవరసవర్ణనానంద హేతువులైన
కాళిదాసాదుల గణనచేసి
తెనుఁగున భారతం బొనరించి మించు న
న్నయ దిక్కనముఖ నెట్టనం దలంచి
తే. గీ. ఇలను సకలరహస్యముల్ దెలుపఁజాలు
భాస్కరుని సోము నెంతయుఁ బ్రస్తుతించి
అర్థి ఘనమార్గదర్శనులైన కవుల
సంతతంబును మన్మానసమున నెంతు. 9

ఉ. మందున కేల రంభ ; కడుజారున కేల కులపరిచింత ; పా
మందున కేల సాధుజనసంగతి ; కష్ట నికృష్ట లోభియా
చండికినేల నిర్మల యశంబులు ; వేశ్యకు నేల సిగ్గు ; దు
ష్పండితుకైనవానికిని సత్కవితారసగోష్ఠి యేటికిన్ ? 10

వ. ఇవ్విధంబున నిష్టదేవతావందనంబును సుకవిజనానందనంబును గుకవినిందనంబునుం గావించి సకలకలికలుష తిమిరభాస్కరోదయంబును, నుల్లసితసంపత్పల్లవ వాసంతికావాసంబును, నవరసనిగూఢగంభీరంబునుంగా నెద్దియేనియు నొక్క మహాప్రబంధంబు రచియింపఁ బూనియున్న యప్పా డొక్కనాఁటి ప్రభాతకాలంబున: 11

ఉ. కస్తురిబొట్టు నెన్నుదుటఁ గౌస్తుభరత్నము పేరురంబునన్
బ్రస్తుత శంఖచక్రములు బాహువులన్ నతనాభిఁ దమ్మియున్
సిస్తుగ నొప్ప భూసతియు శ్రీసతియున్ దనుఁజేరి కొల్వఁగాఁ
గస్తురిరంగసామి కలఁ గానఁబడెన్ గరుణాతిభూమియై. 12

వ. ఇవ్విధంబునం గనుపట్టిన యద్దేవునింగాంచి సముచిత వినయసంభ్రమంబులు మనంబునం బెనంగొనఁ బులకితగాత్రుండనై సాష్టాంగ దండప్రణామం బాచరించి కరకమలపుటంబు నిటలతటంబున ఘటియించి

యానందభరితుండనై యుండ నన్నుఁ గనుంగొని యద్దేవుండు గంభీరమధుర భాషణంబుల నిట్లనియె. 13

తే. గీ. సముఖమీనాక్షినృపగర్భ ♦ విమలజలధి
చంద్ర, వేంకటకృష్ణేంద్ర, ♦ శౌర్యసాంద్ర,
మునుపు జైమిని భారత ♦ మనఁగ వచన
కావ్య మొనరించినట్టి సత్ ♦ క్కవివి గావె! 14

శా. వాసిన్ రంగవిభుండు నేను, ధరణిన్ ♦ వాక్ప్రౌఢిమన్ నీ వహ
ల్యాసంక్రందన మన్ ప్రబంధము రసో ♦ ల్లాసంబుగాఁ జేయ జే
రాసం గోరి వినంగ వచ్చితిఁ బ్రియం ♦ బొనట్టు నాపేరిటన్
భాసిల్లం దగ నంకితంబు నొనగూ ♦ ర్పన్ నీకు మేలౌ నికన్. 15

వ. అనియానతిచ్చుటయును దోడన మేలుకాంచి మేలుకాంచినహృదయంబున నుదయంబునఁ గాల్యకరణీయంబులు నిర్వర్తించి యంత దంపడి మెఱయ బురోహిత భృత్యామాత్య సామాజిక బంధువర్గంబులు గొలువం గూర్చుండి యుభయభాషాకవితా విశేషులైన శేషము వేంకటపతి, ములిగెగ కృష్ణకవీంద్రుఁడు నాకాప్తసఖులుఁ గావున వారిం బిలిపించి, యీశుభస్వప్నంబు వినిపించుటయు, వారలు సంతోషభరితాంతరంగులై శ్రీరంగవల్లభుండు శ్రీభూమీసమేతుండై నీకుం గనుపట్టెం గావునసతతో ధిక ధనధాన్య కరితురగ భటకదంబకాది నానావిధసంపదలును, బహుగ్రామభూములునుం గలుగు; సప్తసంతతనంబులలో నతిశ్లాఘ్యంబైన ప్రబంధసంతానంబు నిర్మింపు మనియెం గావున శీఘ్రంబె మీతండ్రికి నీవు జనియించినచందంబున సకల గుణాధారులైన కుమారులు నీకుంగలుగుదురు; స్వామిహితకార్యఘటనా ధుర్యుండవు, బంధుజనపోషకుండవు, శ్రీరంగపతిపదారవిందమిళిందాయమా నమానసుండవుం గావున నీ కిట్టిశుభస్వప్నంబు గలిగె; భవదీయవంశావ తారక్రమంబు వర్ణించెద మాకర్ణింపుమని యిట్లనిరి: 16

కం. శరణంబులు జగముల కా
భరణంబులు వేదములకుఁ ♦ బంకజలక్ష్మీ

కరణంబులు నారాయణ
చరణంబులు సెసఁగు శూద్ర • జాతికి నిరవై. 17

కం. నాలవవర్ణం బనియెడి
పాలసముద్రంబునందు • భాపుకలక్ష్మీ
లోలుఁడు లోకావనకరు
ణా[1]లీలుఁడు కేశవప్ప • నాయఁడు వెలసెన్. 18

ఉ. ఇంద్రుఁడు భోగసంపద, నుపేంద్రుఁడు రూపముచేత, నా హరి
శ్చంద్రుఁడు సత్యవాక్యమునఁ, • జంద్రుఁడు కాంతినిరూఢి, చాపని
స్తంద్రిత రామచంద్రుఁడు, ల • సన్మతిచాతురిచేత శేషభో
గీంద్రుఁడె యంచు భూమిజను • లెన్నఁగఁ గేశవనాయఁ డొప్పగున్.

కం. ఆ కేశవనాయనికిన్
రాకేశవదాతకీర్తి • రాజితపుణ్య
శ్లోకుఁడు వేంకటనాయఁడు
శ్రీకాంతున కబ్జభవుని • చెలువునఁ గలిగెన్. 20

ఉ. చందురు ఱొమ్ము మెట్టి యర • చందురుతాలుపు సజ్జుగిట్టి యా
నందిని ముక్కుగుట్టి సుర • నాయకదంతిని జెక్కుగొట్టి య
స్పందితలీల సీరి యొడిఁ • బట్టి చెలంగుచుఁ గీర్తి వీనులన్
విందొనరించు నార్యులకు • వేంకటనాయఁడు భూపపుత్రుఁడే! 21

కం. పెదగుర్వపనాయఁడు త
త్పదమలమూర్తికిని బుట్టి • శాశ్వతకీర్తిన్
గుదురై యీవిని జదురై
యెదురైన విరోధినృపుల • నెల్ల జయించెన్. 22

కం. అతనికిఁ గలిగెను బౌదా
నతశాత్రవుఁ డెల్లిసెట్టి • నాయఁడు రేఖా

(పాఠాంతరము.) 1 శీలుఁడు

రతిపతి భాషావాచ
స్పతి భోగానుభవమున దివస్పతి యనఁగన్. 23

కం. శంకరకైంకర్యపరుం
డంకభయంకరుఁడు గల్గె నతనికి నుర్వీ
సంకటహారసాయకుఁ డగు
వేంకటనాయకుఁడు భువనవిశ్రుతయశుఁడై. 24

సీ. ధన్యుఁడై నృపతిమూర్ధన్యుఁడై నిర్ధూత
దైన్యుఁడై నృపసంఘమాన్యుఁ డగుచు
గేయుఁడై సుజనాళిగేయుఁడై దానరా
ధేయుఁడై విద్వద్విధేయుఁ డగుచు
ధీరుఁడై కనకాద్రిధీరుఁడై కదనహం
వీరుఁడై సద్గుణహారుఁ డగుచు
శీలుఁడై హరిభక్తిశీలుఁడై సంగీత
లోలుఁడై కవిబృందపాలుఁ డగుచు

తే. గీ. సకలబాంధవసంతోషి సత్యభాషి
స్వామిహితకారి స్వజనరక్షణవిహారి
వెలయు బహుసంపదలచేత విబుధభాగ్య
దాయకుండైన వేంకటనాయకుండు. 25

కం. ఆనరపతి వేంకటమా
మానినిఁ బెండ్లాడి వరకుమారునిఁ బడయన్
దానతపోధ్యానాదు ల
నూనగతిన్ బెద్దకాల మొనరించుతఱిన్. 26

కం. భూనుతు లాదంపతులకు
మీనాక్షీసుందరేశ మృదుపదపద్మ
ధ్యానాక్షయవిభవుం డగు
మీనాక్షయనృపతి గల్గె మేదురయశుఁడై. 27

సీ. మక్కువ మీఱంగఁ ♦ జొక్కనాథస్వామి
తనమహాలింగమ♦ధ్యంబు వెడలి
చంద్రరేఖాజటా♦శార్దూల చర్మాహి
డమరుత్రిశూలముల్ ♦ కొమరుమిగులఁ
గలలోనఁ గనుపట్టి♦కరుణాకటాక్షముల్
చెలఁగఁ గటాక్షించి ♦ చేరఁ బిల్చి
కేలిశూలమ్ము డా♦ కేలఁగైకొని హస్త
మస్తకసంయోగ ♦ మాచరించి

తే. గీ. ఆయురారోగ్య పుత్రపౌ♦త్రాభివృద్ధి
ధనకనకవస్తువాహన♦తతుల విమల
తత్త్వ విజ్ఞాన మొసఁగె నే♦ధార్మికునకు
నతఁడు కేవలనృపుఁడె మీ♦నాక్షివిభుఁడు. 28

సీ. కప్పమీఁటినకంది♦వప్పలకుప్పలు
రాజ్యంబు వెలసేయు ♦ నాజ్యములును
బహుపుణ్యఫల పరి♦పాకముల్ శాకముల్
నిచ్చమెచ్చుల నిచ్చ♦పచ్చడులును
విప్పడంబుల నొప్పు ♦ నప్పడంబులరాసు
లతిరసంబులు వడ ♦ లతిరసములు
చంద్రమండలసుప్రి♦సన్నము లన్నముల్
ప్రీతిసుధారసములు ♦ పాయసములు

తే. గీ. వెలయమృష్టాన్నసత్రముల్ ♦ వెట్టె సేతు
బాట నల్లూరు లోపలఁ ♦ దేటతీయ
నీటిమేటితటాకంబు ♦ నిధి యొనర్చె
మేదినీశ్వరమాతృఁడే ♦ మీనవిభుఁడు. 29

సీ. ఈలంపునీలంపు ♦ మేలికంబంబులు
కులశైలజాలంబు ♦ కొమరుఁదాల్ప

రంగారుబంగారు ♦ వ్రాఁతచిత్రంబులు
కిన్నరనరసురా♦కృతులు గాఁగ
నేతులజోతుల♦నెఱి దీపమాలికల్
తారకాగ్రహముల♦దారి మీఱ
నెఱమట్టుకఱిపట్టు ♦ నిగ్గుచందువపొందు
ఘనఘనాఘనముల ♦ గరిమఁబూన
తే. గీ. నిండుమెండున బ్రహ్మాండ♦మండలంబు
రహిఁ మహామంటపంబు స♦ద్భక్తియుక్తి
సుందరేశ్వరుసన్నిధిఁ ♦ జందమొంద
నమరఁ గట్టించె సముఖమీ♦నాక్షివిభుఁడు. 30

కం. బంగారుబొమ్మయుం బలె
రంగారఁ వన్నెవాసి ♦ రాణింపంగా
రంగగు నలమేలమయను
నంగన నాఘనుఁడు పెండ్లి♦యై విలసిల్లెన్. 31

చ. కులమును శీలమున్ విభుని♦కూర్మియు బాంధవపోషణంబు ని
శ్చలపతిభక్తి సత్యమును ♦ జక్కఁదనంబును గల్గి యొప్పుచున్
జలధరనీలవేణి నవ♦సారసపాణి మనోజ్ఞవాణి యా
మెలఁతలమేలుబంతి యల♦మేలమయింతి చెలంగెఁ గీర్తులన్. 32

సీ. పంకజాతము డించి ♦ పతిడెంద మలరించి
కలుముల వెదచల్లు ♦ కమలపాణి
వృత్తభేదములేక ♦ విభుసమ్ముఖాలోక
మాన్యయై పొలుపొందు♦మంజువాణి
వామవర్తన డింది♦వరు నైక్యముంజెంది
మహనీయయా సర్వ♦మంగళాఖ్య
ఒకచాయఁ జేయక ♦ యొగి నాథుఁ బాయక
రాజద్గుణాఢ్యయా ♦ రమ్యసంజ్ఞ

తే. గీ. యనుచుఁ బొగడఁగఁదగిన తో♦య్యాలులమిన్న
సరసవాగ్జితనవమాధ్వి ♦ పరమసాధ్వి
ఘనయశోవల్లి యాశ్రిత♦కల్పవల్లి
మహితగుణపేటి యలమేల♦మావధూటి. 33

సీ. పలికెనా కపురంపుఁ♦బలుకులరాసులు
ఘుమఘుమవాసించి ♦ కొమరుమించుఁ
గనువిచ్చిచూచెనా ♦ కలికల్వ రేకుదొం
తరవసంతములసం♦తనలు మీఱుఁ
జిఱునవ్వునవ్వెనా ♦ నెఱచందమామ వె
న్నెలకన్న మిన్నవ♦న్నెలు చెలంగు
కలికినెన్నడ ముద్దు♦గులికెనా రాయంచ
కొదమజొంపముల సం♦పదలుపొదలు

తే. గీ. సరససంగీతసత్కళా♦శారదాంబ
వినుతపాతివ్రతిఁ గుమారిఁ ♦ గనినయంబ
సకలజనమాన్య సాధుర♦క్షణవదాన్య
వెలయు నలమేలమకు సాటి ♦ కలిమిబోటి. 34

శా. ఆరామామణి మీనభూవిభుఁడు దా♦మత్యంతభక్తిన్ సదా
శ్రీరాజిల్లఁగ వేంకటాచలపతిన్ ♦ శ్రీకృష్ణునిం గొల్వఁగా
వీరాగ్రేసర, నీవు గల్గితి జగ♦ద్విఖ్యాతకీర్తి ప్రభల్
మీఱన్ వేంకటకృష్ణభూప సుకృతీ ♦ లీలామనోజాకృతీ! 35

సీ. చిగురుజిరాకొతుఁ ♦ జెనఁకుచక్కఁదనంబు
కదనంబు రిపులఁ బు♦ల్గరవఁజేయుఁ
జేయుదన్వత్కర్ణ♦శిబిదానశీలంబు
శీలంబు ధర్మదా♦క్షిణ్యశాలి
శాలిధాన్యసువర్ణ♦సహితమ్ము భవనమ్ము
నమ్మువారికి నిధా♦నమ్ము మాట

మాటఁజూచును ధైర్య♦మహిమ జాళ్వాగట్టు
గట్టురాయల్లునిఁ ♦ గదుముఁగడఁక
తే. గీ. కడకనులయందె వసియించుఁ ♦ గమలవాస
వాసవ పురారి మురవైరి ♦ భక్తిదొరలు
దొరలు నీసరి యగుదురె ♦ దరహాసముఖ
సముఖవేంకటకృష్ణేంద్రి, ♦ శౌర్యసాంద్రి! 36

సీ. చదువఁగానేర్తువు ♦ శారదాశారదా
జ్ఞాననానూపురా♦ర్భటుల ధాటిఁ
బాడఁగా నేర్తువు ♦ పండితాపండితా
కర్ణనానందసం♦ఘటన పటిమఁ
బలుకఁగానేర్తువు ♦ భావజాభావజా! [illegible]
టోపగాటోపని♦రర్గళోక్తిఁ
దగ వ్రాయనేర్తువు ♦ తారకాతారకా
నీకరేఖాసమా♦నేక లిపుల
తే. గీ. మెచ్చనేర్తువు కవితల♦మేల్మిఁ దెలిసి
యిత్తు వేనుఁగుపాఁడిగా ♦ నెలమిఁగవుల
కన్నిగుణములు నీయందె ♦ నమరె నౌర!
రిపుజయాధార వేంకట♦కృష్ణధీర! 37

ఉ. ఎంతయొయార మెంతసొగ♦సెంతపరాక్రమ మెంతరాజసం
బెంతవిలాస మెంతనయ ♦ మెంతవదాన్యత యెంతఠీవి మేల్
సంతతశౌర్యధాటి విల♦సద్గుణపేటికిరీటి వన్నిటన్
కంతుజయంతరూప, కవి♦కల్పక, వేంకటకృష్ణభూవరా! 38

సీ. వింటివా నీవంటి♦వింటివాని ధరిత్రిఁ
గంటి నే నల్లము♦క్కంటి నొకని
సాటిగా నీ వొక్క♦సారి గాటపువీథి
దూరుచోఁ బొదలలోఁ ♦ దూరు రిపుఁడు

వింతమీఱంగ నీ ♦ వింత మీటినఁ దేజి
మంతుకృద్వైరిసా♦మంతు నణఁచు
వేదండమెక్కి నీ ♦ వే దండ వచ్చినా
వే దిక్కుసొచ్చు దా ♦ వేది పరుఁడు;

తే. గీ. ఉన్నతోన్నతి నెన్నుచో ♦ మిన్న వీవె
నిన్ను సన్నుతిసేయును ♦ బన్నగపతి
విమలచారిత్ర, మీనభూ♦విభునిపుత్ర
సముఖవేంకటకృష్ణేంద్ర, ♦ శౌర్యసాంద్ర! 39

సీ. ధైర్యమా శౌర్యమా ♦ దాక్షిణ్యమా పుణ్య
మా నయమా జయ♦మా ప్రతాప
మా శుభరూపమా ♦ మహితవిజ్ఞానమా
దానమా భోగమా ♦ శ్రీనిమూఢ
యోగమా యాశ్రిత♦వ్యూహసంరక్షణ
రాజద్విలాసమా ♦ రమ్యమంద
హాసమా మహితసౌ♦హార్ద స్వభావమా
భావమా భూరిప్ర♦భావమాన్య,

తే. గీ. నీకె తగునంచుఁ బాండ్యభూ♦నేత విజయ
రంగచొక్కేంద్రుఁ డత్యంత♦రంగసబహు
మానసామాజికత్వ మిం ♦ పూన నొసఁగె
సముఖవేంకటకృష్ణేంద్ర ♦ శౌర్యసాంద్ర! 40

మ. నలనాసత్యవసంతులం(?) గెలుచు సౌం♦దర్యంబు ధైర్యంబు దో
ర్బలము౯ స్వామిహితానువృత్తి దయయు౯♦ప్రౌఢత్వము౯ విద్యయు౯
వెలయ౯ బాల్యమునందె నీవు మధురో♦ర్వీనాథు మెప్పించవా
భళిరా, వేంకటకృష్ణభూవరమణీ, ♦ భాషాఫణిగ్రామణీ! 41

కం. అందముగ నహల్యాసం
క్రందనము౯ రచనసేయఁ♦గా నేరుతువా

పొందుగ మధురిమ జగదా
నందము ఘటియింపు మనుచు ♦ నను నిట్లనఁగన్. 42

వ. నేను ప్రమోదభరితమానసుండనై. 43

— ♦ షష్ఠ్యంతములు ♦ —

కం. హరికి నవనవనీతా
హారికి సకలగుణరత్న ♦ హారికి మురసం
హారికి మందరధారికి
క్ష్మారమణీమణిమనోను ♦ సారికి హరికిన్. 44

కం. హాటకమయచేలునకున్
ఘోటకచటులప్రచార ♦ గుణశీలునకున్
పాటితరిపుజాలునకున్
నాటితనానాప్రపంచ ♦ నటజాలునకున్. 45

కం. చూటీకుడుత్త నాచ్ఛా
ర్యాపీడాసంబంధగంధి ♦ సుమసరధృతికిన్
క్రీడావల్లవపతికిన్
నీడజకులసార్వభౌమ ♦ నిర్భరగతికిన్. 46

కం. అభిసరణరమిత నిచుళా
ప్రభుకన్యామణికిఁ గైట ♦ భద్విపసృణికిన్
నభసదురస్స్థలశుభకౌ
స్తుభవాసరమణికి దమిత ♦ దుర్దమఫణికిన్. 47

కం. శస్తునకున్ రక్షణకృత
హస్తునకున్ వాసవునకు ♦ నాత్మీయతనూ
విస్తారితభువనునకున్
కస్తూరీరంగపతికిఁ ♦ గరుణాకృతికిన్. 48

వ. అంకితంబుగా నాయొనర్పంబూనిన యహల్యా సంక్రందనంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన: 49

శా. శ్రీరంజిల్ల నహల్య మౌనిసతియై ♦ వృత్రారిపై మోహ మే
దారిం గూరిచెఁ దానఁ గల్గిన దురం♦తం బైన శాపంబునన్
శ్రీరామాంఘ్రిరజంబు లెవ్విధము దీ♦ర్చెన్ బల్కు మంచీసమా
చారంబున్ జనమేజయుం డడుగ వై♦శంపాయనుం డిట్లనున్. 50

మ. పదియార్వన్నియ రెక్కపక్కనొకరా♦బాబావజీరుండు సాం
ద్రదయాంగీకృతయావరాజ్యభరతన్ ♦ రక్షింప లోకత్రయీ
విదితం బై యమరావతీపురము శో♦భిల్లున్ వియద్వాహినీ
మృదువాతూల వినీత దివ్యయువతీ♦క్రీడా పరిశ్రాంతియై. 51

చ. సురమణి ముద్దుమోవి సుధ♦చొక్కపునవ్వు బలారివాహముల్
కురులు, సురద్రు గుచ్ఛములు ♦ గుబ్బలు, వేలుపువాఁక యచ్చపున్
మెఱుఁగు మణుంగునై, చికిలి♦మించఁగఁ దత్పురలక్ష్మి కాంతివి
స్ఫురణభవిష్ణు విష్ణుపద♦భూషణమై చెలువొందు నిచ్చలున్. 52

తే. గీ. మండలీభూతశక్రకో♦దండ మనఁగ
దైత్య చక్రాంగకంపనో♦ద్దండ మగుచు
రమ్యఘృణిజాత నూత్నచి♦రత్నరత్న
ఝాటమై దీటుమీఱు న♦వ్వీటికోట. 53

ఉ. రాణఁ జెలంగునప్పురవ♦రంబున నుండు జనుల్ నిజాశ్రిత
త్రాణధురాధురంధరులు ♦ దానయశఃపరిశోభితాత్మకుల్
ప్రాణిదయాళు లౌట యొక♦బాధమె యచ్చట నుండునట్టి పా
షాణము వృక్షముల్ పసులు♦నైత మభీష్టము లిచ్చుచుండఁగన్. 54

సీ. అచ్చటికలభంబు ♦ లజపీఠకమలంబుఁ
జేనంటి నై పాద♦శిక్ష నడుగు
నచ్చటి తురగంబు ♦ లభ్రకేశనిమాళిఁ
గుప్పించి సాదులు ♦ ద్రిప్ప మరలు

నచ్చటి యరదంబు ♦ లవ్విష్ణురథమును
దలమీఱి సారథుల్ ♦ నిలుప నిలుచు
నచటిభటు లజాండ ♦ మవియవ్రేయఁ దలంచి
యది నీరు బుగ్గయం ♦ తనుచునెంతు
తే. గీ. రచటి పాత్రిలు నృత్త వి♦ద్యానిరూఢిఁ
బూని శారద వెలవెల ♦ వోవ నాడి
యాదిగురువని మెప్పిక్కుదు ♦ రమరపురముఁ
గోరి వర్ణింపఁబూన నె♦వ్వారితరము? 55

చ. వసువులకెల్ల సంతతని♦వాసము విశ్వవిభూతి కాశ్రియం
బెసఁగు ననంతరత్నముల♦కిమ్ము మహాసుమనఃప్రికాండ సం
వసతి మరుద్గణాంచితము ♦ వల్గుసుధర్మము సౌమ్యజీవహా
ర్ష సదనమై చెలంగు నను♦రావతి నెన్నఁదరంబె యేరికిన్? 56

మ. వరబృందారక గర్భయా పురరమా♦వామాక్షికిన్ బహ్మభీ
కరదైత్యగ్రిహశాంతికై సలిలచ♦క్రివ్యాజ వర్ణాంకశం
ఖరథాంగాంకిత శుద్ధరూపమయ ర♦క్షాపట్టికన్ గట్టెనా
హరిపాదాంబుజసంగ గంగయె యగ♦డ్డై యొప్పు నవ్వీటికిన్. 57

సీ. కలిగించు నొకకొమ్మ ♦ కలమాన్నపరమాన్న
బహుభూపఘృతసూప♦పానకములఁ
గల్పించు నొక కొమ్మ ♦ ఘనసారహిమనీర
పాటీరకాశ్మీర♦పంకములను
దొరకించు నొకదళం ♦ బురుహేమమణిదామ
శాటికాపేటికా ♦ సముదయముల
నిచ్చునొక్కొక్కసుమం ♦ బెలమించుతుల మించు
ప్రియంపు గరువంపుఁ ♦ బద్మముఖుల
తే. గీ. నీగతి సమస్తవస్తువు ♦ లీఁగఁ దివురు
వేల్పుమానులుఁ దీవలు ♦ వేనవేలు

దనర విలసిల్లుఁ దత్పురో♦ద్యానమగుచు
నందనంబు జగత్ప్రియా♦నందనంబు. 58

ఉ. శ్రీలుదయింప దిక్పతులు ♦ చేతులు మోడ్చి భజింపఁ దమ్ముఁడై
శ్రీలలనామనోహరుఁ డ♦శేషభరంబును నిర్వహింపఁ బా
తాళముపట్టి శాత్రవులు♦తద్దఁ గృశింప నిలింపపట్టణం
బేలును భోగసాంద్రుఁడు సు♦రేంద్రుఁడు భూరి మహాదినేంద్రుఁడై. 59

సీ. వృత్రగర్వస్ఫూర్తి ♦ విదళించినయినుండు
పాకసామజమదో♦త్పాటనహరి
పరమహీభృత్తుల ♦ భంజించు జిష్ణుండు
తటిద్యైన శరవృష్టి♦గురియు ఘనుఁడు
మఘశతయాజియా ♦ మహితసుధర్ముండు
భువనైకభారంబుఁ ♦ బూనువృషుఁడు
కరమున శతకోటి ♦ గలస్వస్థజీవనుఁ
డమరభోగినులతో ♦ నలరుభోగి

తే. గీ. శచికుచంబుల మకరికా♦సముదయంబు
వ్రాయు లేఖర్షభుం డన♦వద్యహృద్య
మాఘ్యవిచికిలరుచిరస♦మాఖ్యగాంచు
దేవతాసార్వభౌముండు ♦ తేజరిల్లు. 60

చ. అతఁ డొకనాఁడు కుందనపు♦టందపుదుప్పటి వల్లెవాటుతో
సతతముఁ దాపులీను హరి♦చందనపుఞ్ జిగి మేనిపూఁతతో
నతుల కిరీటహారకట♦కాంగద ముఖ్య విభూషణాళితో
రతిపతిమీఱుసోయగము ♦ రాజసముఞ్ దళుకొత్తు ఠీవితోఞ్. 61

చ. చిలుకలకొల్కి యొక్కరుతు ♦ చేరి పరాకు పరా కటంచనఞ్
జలరుహపాణి యోర్తు సర♦సఞ్ కయిదండ యొసంగ ముంగలఞ్
వాళహళి నొక్కగంధగజ♦యాన బరాబరి చేయ వాలునుం
బలక కలాంచి కుంచె యడ♦పం బొకకొండఱుఁ బూనికొల్వఁగఞ్. 62

సీ. వేవన్నె బంగారు ♦ వింతగోడలచాయ
పగలింటి యెండల♦భ్రమలెసంగ
ఇంద్రనీలస్తంభ♦సాంద్రరోచిచ్ఛటల్
బహుళాంధకారవి♦భ్రాంతి నీయఁ
బద్మరాగాంకుర♦ప్రాంశు వితర్దికల్
జ్వాలదగ్నిమండల ♦ జ్ఞప్తి నింప
నిర్మలవజ్రమ♦ణీకుట్టిమంబులు
స్వచ్ఛాంబుపూరసం♦శయము నింప

తే. గీ. నుద్యదితరేతర ప్రతి♦యోగవస్తు
సంగతులు శక్రకార్ముక♦శక్తి యొక్కొ
యనఁదగిన కాంచనాంచిత♦యవనికావి
తాన పరికర్మమైన ♦ సుధర్మయందు. 63

చ. కరమునఁ గంకణాలు విడి♦గాజులు గల్లనఁ బల్లవాధరల్
వరుసగ నిల్చి చామరలు ♦ వైవ మహోన్నతభద్రపీఠిపై
సురగరుడాహిచారణ వ♦సుప్రముఖుల్ శుచి ధర్మ దైత్యరా
డ్వరుణ సమీర యక్ష పుర♦వైరులు సూరెలఁ జేరి కొల్వఁగన్. 64

కం. కొలువున్నతఱిఁ బరాశర
కలశోద్భవ కణ్వ కండు ♦ కవి గాధేయా
దులు వచ్చి యతనిచే మ్రొ
క్కులుగొని కనకాసనములఁ ♦ గూర్చుండిరటన్. 65

తే. గీ. నలపురూరవు లాదిగాఁ ♦ గలుగు చక్ర
వర్తులు పదాఱుగురు రాజ♦వర్యు లమిత
కీర్తిధుర్యులు వైభవ♦స్ఫూర్తి మెఱయ
నన్నగాహితుసభను గూ♦ర్చున్నతఱిని. 66

సీ. అతిరాత్రయాజుల ♦ యరిదికుండలములు
మెట్టె మించులుగాఁగ ♦ నెట్టుపఱిచి

సత్రియాజుల వెల్ల ♦ జన్నిదంబులు దీసి
సన్నగజ్జెలు గూర్చి ♦ సంఘటించి
ఉక్థయాజుల కన♦కోత్తరీయంబుల
మేలుముసుంగుగాఁ ♦ గీలుకొల్పి
అల వాజపేయయా♦జుల యాతపత్రంబు
లెండకుమఱుఁగుగా ♦ నేర్పఱించి
తే. గీ. తలిరువిలుకాని బిరుదుప♦తాక లనఁగ
నోరపైఁటలు జీర నొ♦య్యారమెసఁగ
వత్తు రిందుని కొలువుకు ♦ వారకాంత
లచ్చెరువునొంది సురలెల్ల ♦ మెచ్చి పొగడ. 67

సీ. "సోమయాగఫలంబు ♦ సుదతి నీ కిచ్చెను
మొగ మిషు ద్రిప్పవే ♦ ముద్దుగాను
సోమపానఫలంబు ♦ భామ నీ కిచ్చెను
ఇంతేనా? ఆనఁగ నాకు నీ ♦ యధర మీవె
కలికిరో సాన్నాయ్య♦కలశాల ఫల మిత్తు
బటువైన కుచములఁ ♦ బట్ట నీవె
రమణిరో నా మహా♦వ్రతఫల మిచ్చెను
రతుల న న్నేలవే ♦ బ్రతికి పోదు"
తే. గీ. ననుచు శౌండిల్య కౌండిల్య♦ముని పరాశ
రాత్రి గార్గేయ గౌతమ ♦ చ్యవన భార్గ
వార్వ జమదగ్ని శాకల్య ♦ పర్వతాది
ఋషులు మోహింప నప్సర♦స్త్రీలు మఱియు. 68

సీ. "అషు ఇషు బోవకే ♦ యిషువులచే నిన్ను
విషమాస్త్రుఁడేచీని ♦ వెట్టిపడుచ
వాజపేయఫలంబు ♦ వలదన్నే యో మోష
యిందుఁడ్రేఁ డే మిచ్చెని♦యిషు నిలువవె

మేము శుంఠల మషే ♦ మీరు [1]నేర్చినపాటి
యెఱుగ మషే వేద♦మెల్ల జదివి
యతివ నీవు [2]ద్వారోష్ట ♦ యయ్యోదినము లయ్యో
నగరికిఁ బోవకే ♦ నడుమ నెపులో ”

తే. గీ. అనుచు ఛాందసు లగు సోమ♦యాజివరులు
వెంట నంటంగ మధుమయ♦వినయభరిత
మంజుభాషల చేత స♦మ్మతులు చెప్పి
వెడలి రప్పుడు వేలుపు♦వెలవెలఁదులు. 69

మ. గొనబుంజందురుకావిపావడలపైఁ ♦ గొప్పిమ్మించురాయంచడాల్
మినుకుంజీరలకుచ్చెలల్ గులుకఁగా ♦ మిన్నేటిపొందమ్ము ల
ల్లన వక్త్రాంబుజపాళికిన్ మఱుఁగుగా♦హత్తించుచున్ గంతుమో
హనదివ్యాస్త్రములోయనన్ వెడలి రొ♦య్యారంబుతో నచ్చరల్. 70

ఉ. చిన్నిమిటారులో చికిలి♦చేసిన మారునిచిక్కటారులో
వెన్నెలగుమ్మలో మెఱుఁగు♦వెట్టిన కెంపుకడానిబొమ్మలో
పొన్నలబంతులో మగుడఁ♦బోవనిమిన్నుమెఱుంగుకాంతులో
యెన్నఁగనంచు నభ్రచరు ♦ లిచ్చలమెచ్చఁగ వచ్చిరచ్చరల్. 71

సీ. అశ్రాంతనవయౌవ♦నారంభ యా రంభ
శృంగారరసరేఖ ♦ చిత్రరేఖ
రతిరహస్యజ్ఞాన♦రాశియా నూర్వశి
అంగజాతాగ్నికి ♦ నరణి హరిణి
పాటలాధరజిత♦పానక మేనక
హాటక సమరోచి ♦ యా ఘృతాచి
తరుణులందెల్ల నుత్తమ యా తిలోత్తమ
మణితమంజులభాష ♦ మంజుఘోష

పా. 1. చదివిన. పా. 2. బహిష్ఠ (?)

తే. గీ. రామణీయకవిభ్రమ♦రామ హేమ
సరసనుతగీత నృత్యప్ర♦చార తార
మఱియుఁ బక్కనవేలుపు♦మచ్చెకంటు
లెలమి నరుదెంచి రపుడు దే♦వేంద్రసభకు. 72

కం. అంజలులు సేసి వేలుపు
లంజెలు నిలిచిరి బలాసు♦రధ్వంసికడన్
రంజనఁ బూజించి రహిన్
గంజాస్త్రుఁడు నిలిపినట్టి♦ కైదువు లనఁగన్. 73

ఉ. వారిజపత్రలోచనల ♦ వాసవుఁ డల్లనఁ దేరఁ జూచి శృం
గారపు వింతలేనగవు ♦కన్గొనలన్ దళుకొత్తఁ గొల్వులో
వారల నెల్లఁ గాంచి "యిటు♦వచ్చిన యచ్చర గచ్చరాండ్రలో
నే రుచిరాంగి చక్కనిది ♦ యెవ్వతె విద్యలమేటి" నావుడున్. 74

కం. దేవేంద్రుఁ జూచి వరుణుఁడు
"దేవా! దేవరకుఁ దెలియ♦దే సకలంబున్
నీవడిగినచో నుత్తర
మీవలె నటుగానఁ బలుక♦ దేఁ దోఁచినటుల్. 75

ఉ. ఆటదియన్న నూర్వశి య♦థార్థము పల్కెద నింతెకాని మో
మోటమి నాకు సైఁపదు బు♦ధోత్తమ! పాటల నాటలందు స
య్యాటలమేటి చక్కఁదన♦మా గొనమా యలబోటికే తగున్
పాటలగంధులెల్ల నల ♦ భామిని గోటికి సాటివత్తురే!" 76

చ. అనవుడు మిత్రుఁ "డౌనవు, జ♦లాధిపువాక్యము నిక్క మూర్వశీ
ఘనకచ రూపసంపద జ♦గన్నుత మెంతని సన్నుతింప నా
ఘననయదేశ్య రక్తిపరి♦కల్పన యేరితరం, బదేమి యీ
మునివరు లిప్పురూరవుఁడు ♦ మున్నగు రాజులు ము న్నెఱుంగరే?".

కం. అనినఁ బురూరవుఁ డచ్చటి
జననాథుల మొగముఁజూచి ♦ "సర్వజ్ఞనిధుల్



ఘను లీమిత్రావరుణుల్
కన్గి పలికిరి నిజ మిదే య♦ఖండిత" మనినన్. 78

శా. ఆకంధీశ్వరుమాటకున్ నగుచు య♦క్షాధీశపుత్త్రుం డనున్
"మీ కీయూర్వశిమీఁది యాస దురుసై ♦ మి మ్మిట్టు లాడించెనో
కాకున్నన్ గుణగుంభరంభను వినా♦గా నోర్తు నగ్గింతురా
నాకాధీశుఁడు తక్కువా రెఱుఁగరా ♦ నారీపురంభాయనన్". 79

ఉ. ఏచినపేర్మి యక్షసుతుఁ ♦ డీగతిఁ బల్కినఁ గంధమాని దా
సైచక "యిందుసన్నిధి న♦సత్యములేలర, పేరెదోరి, ప్ర
మ్లోచకు నూరుకాండజిత♦మోచకు లేశము సాటి వత్తురే
ఖేచరసిద్ధసాధ్యఫణి♦కింపురుషామర చంపకాంగులున్? 80

ఉ. పున్నమచందురుం గెలుచు ♦ ముద్దుమొగంబును దేటమాటలున్
సన్నని కౌను మేనుజిగి♦చందముఁ దీయనిమోవియందమున్
కన్నులతీరు నీలముల♦కప్పను మించినకొప్పుసౌరు నా
యన్నులమిన్నకే తగు న♦టన్నది విన్నది లేదె యెన్నఁడున్. 81

కం. నాగంబుల నాగంబుల
నాగంబులఁ గెల్చు కురులు ♦ నాభియు నడలున్
భోగంబుల భోగంబుల
భోగంబులఁ దరుణియూరు ♦ భామ చను లేలున్. 82

కం. చేరలకు మీఱుకన్నులు
బారెఁడుకీల్జడయు ఱొమ్ము ♦ పట్టుపుకుచముల్
బేరజముల నారజముల
నీరజముఖి లెనయె దాని ♦ నీటుకు" ననినన్. 83

చ. బలిమిని గంధమాని నొక ♦ ప్రక్కకుఁ ద్రోచి విభాండకుం డనున్
"నెలఁతలమేలుబంతి హరి♦ణీహరిణాక్షియె యాలతాంగి దాఁ
గిలకిలనవ్వుచున్ దివిరి ♦ కిన్నరమీటుచు వచ్చుముచ్చటల్
కులుకులు పావురాలపలు♦కుల్ బెళుకుల్ మఱి కోటిసేయవే? 84

చ. పెదవిని వింతకావి నను♦పెక్కె నక్కిల్జడకీవి కల్వలన్
జెదరఁగఁజేయు కన్నులును ♦ సిస్తగు జక్కవ నేలుచన్నులున్
మదకరినేలు నెన్నడలు ♦ మల్చినరీతిని నొప్పు నున్దొడల్
ముదముగఁ జూచినంత నల ♦ బోటికి జోటులు సాటి లేరెటన్. 85

ఉ. దాని యొయారపున్ సొగసు ♦ దాని మిఠారి కఠారి చూపులున్
దాని కడానిమేనిజిగి ♦ దాని చనుంగవలో పటుత్వమున్
దాని గళంబుకీవియును ♦ దాని కరంబుల సోఁగ వ్రేఁగెయున్
దాని శిరోజకాంతియును ♦ దానికిఁ గాని మ ఱెందు లే దొకో". 86

కం. వార లిటుపల్కుపల్కులు
సై రింపక కౌశికుండు ♦ జడముడివీడన్
దూరంబున జపమాలికఁ
బారంగా వైచి యమర♦పతి కభిముఖుఁడై. 87

ఉ. "ఆనికచేసి పల్కెదహ♦హా, కసుమాలపుఁ బంజలంజెలన్
గానకళావిశారద మె♦గానఁ గళానిధిఁబోలుచాన యా
మేనక యుండు దానిజిగి♦మే నకలంకసువర్ణకాంతికిన్
దానక; మింతి విభ్రమవి♦తానక మచ్చెరువిచ్చు నిచ్చటన్. 88

ఉ. కన్నులు చేరలన్ గొలువఁ ♦ గాఁదగుఁ గా నరపేద చన్నులా
కిన్నరకాయలంగెలుచుఁ ♦ గీల్జడబారకు మీఱు మోము క
ప్పున్నమచందమామ యొక ♦ పోలిక వాలికతూపు చూపు నా
కన్నులయాన, దాని కెన ♦ గాన జగాన మెుగానఁ బల్కెదన్. 89

కం. భూమియు నాకాశంబును
గామినికటిరుచికిఁ గౌను♦కాంతికి సాక్షుల్
ప్తామును బట్టెద నే నా
భామిని నూఁగారు కెందుఁ ♦ బ్రితిలేదనుచున్. 90

చ. వదలనినిష్ఠ మీఱఁగఁ ద♦పంబున వర్తిలు మేము సైతమున్
మదిమదిదానితోఁ దగిలి ♦ మానము మానము నేటిపాలుగా

నదెయిదె చేప్పుమా పనుచు ♦ హాయనముల్ పడి యుంటి మన్న చో
మదవతి రూపరేఖలను ♦ మాటికి మాటికి నెన్న నేటికిఁ?." 91

చ. అనుటయు మాండకర్ణిముని ♦ "యంద ఱటుండఁగనింతు మెండుగా
జననుత కామజన్య సహ♦జన్య సరోచి ఘృతాచి యున్నత
స్తనకటిభార తార వని♦తాజనతానుతనామ హేమ ర
త్యనుపమలాలసాలస మ♦దాలస యివ్వరి పంచరత్నముల్." 92

కం. నావిని పరాశరుం డను
"నీ వేలుపుఁ జెలులు చిలువ♦యింతులు మర్త్య
స్త్రీవితతి దాశకన్యక
లావణ్యముఁ బోలలేరు ♦ లక్షాంశంబుఁ. 93

ఉ. మాటలు వేయు నేమిటికి ♦ మన్మథమోహనవిద్యయైన యా
పాటలగంధియూరు లల♦బంగరుబొమ్మ వెడందకన్ను లా
గాటపుగబ్బిగుబ్బెతచొ♦కాటపునెన్నుదు రెన్నిచూచు చో
నేటికి రంభ యాహరిణి ♦ యేటికి నాశశిరేఖ యేటికిఁ? 94

శా. ఫాలక్షోణి చెమర్పఁ గాను బెళుకఁ ♦ బాలిండ్లు వ్రొంగార దో
ర్మూలంబుల్ దళుకొత్త నూరురుచి సొం♦పుల్ గుల్క నేత్రప్రభల్
మీలందోలఁగ నేటవాలువగ న♦మ్మీనాక్షియా యేటిలో
నేలేలోయని పాడు చోడఁగడపే ♦ యింపొక్కటే చాలదే?" 95

సీ. "అంజనాపతిఁ బోలు♦కుంజరగామిని
కలుగునే" యనె మరు♦ద్గణవిభుండు
"తప్పమాట లివేల ♦ దారుకావనినుండు
నతివలే యతివ" లం♦చనె హరుండు
"చాలించవయ్య, స్రుం♦జయునికూఁతురి కెన
గారు పోపొ"మ్మనె ♦ నారదుండు
"శరవణంబుననుఁ గొం♦దఱుకాంత లున్నారు
వారు మీసర"మని ♦ వహ్నిపలికె

పా. 1. పది

తే. గీ. మఱియు సభలోని మునులును ♦ సురలు నృపులు
దారిచూచిన చెలుల వే♦ర్వేఱఁ బొగడి
"రంత రంతామెఁగడ మహా♦రాజసభ"న
టంచుఁ గంచుకి వారల నమరబెట్టె. 96

కం. అత్తఱిఁ బురూరవుం డను
"మెత్తురె యొకపాటిదాని ♦ మిత్రావరుణుల్
పుత్త్రడిబొమ్మకు గుమ్మకుఁ
జిత్తజుచార్వసికి నూర్వ♦శికి సరిగలరే?" 97

కం. ఆరాజరాజనందనుఁ
డారాజుంజూచి "కొంకె ♦ లనుకొంటేనే
నారీమణి రంభారం
భోరుకు నూర్ రోసినట్టి ♦ యూర్వశి సరియే?" 98

కం. అనుటయుఁ జందురు మనుమఁడు
కనుదమ్ములు జేవురింపఁ ♦ గరకరిమీఱన్
ధనరాజకుమారకునిన్
గనుఁగొని యిట్లనుచుఁబలికెఁ ♦ గాంతాళముతోన్. 99

కం. "ఉండ్రా, యత్యాధమ, నీ
తండ్రిం గని తాళుకొంటిఁ ♦ దగఁ గాకున్నన్
తీండ్రింబగు కత్తిని నీ
జెండ్రపు నాలుకదళంబు ♦ ఛేదింతుఁ జుమీ!" 100

చ. అనినఁ గుబేరనందనుఁ "డ♦హా"యని చెట్టుగఁగేకవైచి క్రొ
మ్మినమినలీను కప్పజిగి♦మీసముపై జెయివైచి "తోరి ఛీ
చెనఁటి, గరాస, యీసభను ♦ జెప్పినటుల్ మఱి నీవు చేయకుం
డిన విడ రాచకోఁచ, ధగి♦డీ!" యని దిగ్గనలేచి వీఁకతోన్. 101

మ. రమణీరత్నము రంభఁ జూడ బురుసా♦రంగున్ జెఱంగున్ నెఱా
కొమరుం దుప్పటి కాసెగా బిగిచి జ♦గ్గుల్ మీఱు గొప్పిం బైరుమాల్



జముదాడింబరుఁజంది యేది మఱి రా♦జా, లెమ్ము వాల్గొ"మ్మనన్
బొమ లల్కన్ ముడివెట్టి వీరరసవి♦స్ఫూర్తిన్ విజృంభించుచున్. 102

కం. "రాకలకోమటికొడుకా,
పోకలఁ బోమెదవదేర, ♦ పోరా పోరా,
నీకున్ మత్తే కొరడా
చేకొని కొట్టింతుఁ గొంకె ♦ చెనఁటి గరాసా! 103

కం. "మొగమున మీసముఁ గలిగిన
మగవాఁడై తే కడిందిమగఁటిమి మీఱన్
తెగఁబడిపోట్లాడవలెన్
బిగువేమిర, రాచములుచ ♦ విఘతునె నిన్నున్.

ఉ. "పందగులామ, నీవు నొక ♦ బంటవె? గెంటనికిన్కతోడఁ బో
రందరి చిక్కటారిని గొ♦లారిక మంపిననాఁటి కెచ్చటన్
పొందుగ దాగియుంటివిర ♦ పోర, ధనంబులు గూడఁబెట్టు వాఁ
డెందును సంగరంబునకు ♦ నేర్పడి ప్రాణము దెంపుచేయునే?. 105

ఉ. "బంటుతనంబు లాడుకొని ♦ పారకు; రావణుచేతి పెట్టునన్
కంటికి నీరు గ్రమ్మఁ గల♦కంబడిపారెను నీదుతండ్రి నీ
యింటను లేదు పౌరుష మొ♦కింతయు; బీరములేల చేతిక
త్తంటకు కోడెకాఁడ! చురు♦కంటఁగ వెంటనె చెంపఁగొట్టెదన్." 106

చ. అని మొలవంక దుస్సి సమ♦రార్భటిఁ జావడిక్రిందికిన్ గుభా
లన దుముకన్ ధనేశసుతుఁ ♦ డట్లనె చేయ జయంతుఁ డిద్దఱన్
బనివడి రెండు బాహువులఁ♦ బాయఁగఁ ద్రోయుచు "మీర లిర్వురున్
దనుజులమీఁద మార్కొని ప్ర♦తాపముఁ జూపుఁ" డటంచు నిల్పఁగాన్.

కం. "నీకేమి యాతఁ డాతఁడుఁ
బైకొని మార్కొనిన నిన్నుఁ ♦ బ్రార్థించిరటో
యీ, కొట్లాటలు దీర్పఁగ
నాకాధిపతనయ" యనుచు ♦ నారదుఁడనియెన్. 108

సీ. అపుడు విభాండకుం ♦ డాగ్రహంబున లేచి
బలిమిచేఁ దన కమం♦డలువుఁ గొట్టె
చెయిమించి మాండక♦ర్ణియుఁ జేతిదండంబు
పెళపెళాలనఁ ద్రొక్కి ♦ విఱిచివైచె
పోటుకునఁ బర్వత♦జటిలుండు జడచుట్ట
విదళించి యట త్రెంచి ♦ విసరివైచె
కండుమహాముని ♦ కడుఁగోపగించుక
పడుపాటుగాఁ గక్షు♦పాల చించె
తే. గీ. కండ నెఱచేసి పటపటఁ ♦ బండ్లుకొఱికి
గోచు లెగఁగట్టి జందెముల్ ♦ కుఱుచబట్టి
అట్టహాసంబు లొనరించి ♦ యౌడుఁగఱచి
మునులు గుంపులుగూడుక ♦ మొనసిరంత. 109

సీ. 'తారతమ్య మెఱుంగ♦లే రిందు' అని లేచె
గాధేయుఁ డంత లో♦కములు బెదర
'నీవేమి తెలిసి వ♦ర్ణించితో మేనక'
నని యాతని విభాండుఁ ♦ డదిమెఁ గేల
'హారిణితోఁ దిరిగిన ♦ యడవిమెకంబ వీ'
వని కండు వతనిమే ♦ నప్పళించెఁ
'గండువు కేకాని ♦ కాదు ప్రమ్లోచ' యం
చతని వెక్క దట్టె మ♦హర్షి యొక్కఁ
తే. గీ. డదియె పెదపెదమాటలై ♦ యలుకవాదమి
జడలు పీడఁగ వల్కలా♦చ్ఛాదనములు
జార దండకమండలుల్ ♦ పాఱవైచి
గజిబిజిగఁ బోరుచుండ నా♦ఖండలుండు. 110

ఉ. "అచ్చరమచ్చెకంటులకు♦నై కడు హెచ్చిన మచ్చరంబుతో
విచ్చలుగాను మెచ్చగువి♦వేకము లెల్లను వెచ్చపెట్టి వీ

రిచ్చుట దొమ్మిగూడి కల♦హించినఁ దేరుగడేలపుట్టు నీ
రచ్చ లణంచఁగా వలయు♦రా" యని యింద్రుఁడు చేయమర్చుచున్.

ఉ. గాధిజుఁ జేరి వేఁడుకొని, ♦ కండుమహామునికిం బ్రియోక్తులన్
బోధనచేసి, శక్తిసుతు ♦ పొంతకుఁ బోయి, విభాండకున్ "వృథా
గాథ [1]య"టంచుఁ బల్కి భయ♦కారి మునీంద్రుని వాదణంచి స
ప్రోధుల మిత్రు నప్పటిఁ బు♦రూరవు యక్షుఁ దాళఁ బట్టుచున్. 112

కం. "ఏకాంత ఎవరి కితవో
యాకాంతను వారు పొగడు ♦ టదియుక్తం బే
వీకాకేల వాదు మీలో
'లోకోభిన్నరుచి' యనెడు ♦ శ్లోకమువినరే." 113

చ. అనుటయు నొక్కతాపసుఁ "డ♦హా! పదివేలయినా తిలోత్తమే
వనిత" యనంగ, వేఱొకఁడు ♦ "వామ" యనంగ, నొకఁడు "చిత్రరే
ఖ"న మఱికొంద ఱందుఁ "బద♦హాటక మాలిని భీమ పుండరీ"
కన, వెసఁ బుట్టెఁబెట్టు కల♦హంబులు నారదుఁ డుబ్బియార్వఁగన్. 114

కం. "రాజానుమతో ధర్మో'
నా జను లనుకొందు రిగాన ♦ నవ్యప్రతిభన్
మాజగడముఁ దీర్పఁగను బి
డౌజా, నీవె"యని మాను♦లందఱు వేఁడన్. 115

కం. "నలువగల సృజించిన య
న్నలువ గలఁడు నిర్ణయింప ♦ నలినాక్షుల మి
న్నలువగ లటపోవుద"మని
నలువగలన్ శీవిమెఱయ ♦ నగరిపుఁ డంతన్. 116

చ. ఉఱుముల బండికంప్లరొద ♦యొప్పగు వాల్మెఱుపుం బతాకలున్
చిఱుమెఱుఁపుం ధ్వజంబులును ♦ జేరుబలాకలబారు చామరల్

పా. 1. యి"దంచు

శరమణిచాపముల్ వెలయ ♦ సొరగు నభ్రరథంబు నెక్క భా
సురసురదుందుభుల్ మొఱయ ♦ సూరెల సూరులు సన్నుతింపఁగన్. 117

సీ. గంధర్వ లోకవంక ♦ గాంధారపంచమ
బంధురగాంధర్వ♦పటిమఁ జూపఁ
జారణ లోకకేళ్రివ ♦ ఘోరణుల్ మీఱఁ గై
వారముల్ సారెకు♦సారెఁ జేయ
నచ్చర లోకచాయ ♦ హెచ్చుకోపుల మెచ్చు
లచ్చెరువ్వగాఁగ నా♦ట్యములు సలుప
సంయమి లోకయిక్క ♦ సామ జయస్తోమ
నామాభిరామమం♦త్రములు బొగడఁ

తే. గీ. త్రిభువనైకాధిపత్యంబుఁ ♦ దెలుపఁజాలు
గొప్పము త్రెంపు జంపుల♦గొడుగునీడఁ
దరుణు లిరుగడఁ దెల్లచా♦మరలు వీవ
వెడలె జేజేలయెకిమీఁడు ♦ వేల్పువీడు. 118

కం. కసవులు మేసియు నని మొన
నసువులఁ బాసియు విరోధు ♦ లలయంగ యశో
వసువులగు వసువు లుజ్జ్వల
వసువులొలయ వెడలిరపుడు ♦ వాసవుమోలన్. 119

మ. కుడిగోత్రాత్తులగుబ్బచన్నుగని సి♦గ్గుల్ గుల్క డాకంటితో
నెడదా కీల్జడపాటుఁజూచి పులకల్ ♦ హెచ్చంగ ముప్వాన్నిప
చ్చడమొప్పన్ నెలవంకతోఁ గనకభా♦స్వన్నాగభూషాళితో
మృడులే తెంచిరి వేడ్కఁ బద్మభవునిన్ ♦ వీక్షింప జంభారితోన్. 120

తే. గీ. తరణికిరణంబు లచ్చర♦మెఱుఁగుఁబోండ్ల
మెఱుఁగుసొమ్ముల కొకవింత ♦ మెఱుఁగువెట్ట
బారసూరులు సలిపిరి ♦ బారు సూరు
లాగమంబుల నుతియింప ♦ నాగమంబు. 121

చ. అల వినువాక కుందనపు ♦ టందపుఁదామరతావిఁ గుల్కుచున్
సాలయు మరుత్కుమారకులు ♦ సొంపుమెయిన్ వెనువెంట నంటఁగా
నలకలు వీడఁ గౌను లసి♦యాడ సురాంగన లేఁగుదెంచి రు
త్పలశరుఁ డూర్ధ్వలోకముల ♦ పైని గుడించిన యమ్మలో యనన్. 122

కం. నగరిపుఁ డివ్విధమునఁ జని
నగరీతివిశాలసాల♦నయనోత్సవదన్
ప్రగుణిత నవరత్న ధగ
ద్ధగితన్ వాగ్జాని రాజ♦ధానిం గనియెన్. 123

సీ. ఏప్రోలు వాణీవ♦రేభితాశోకంబు
శోకంబు మోదంబు ♦ సుడియ చెందు
ఏపురి రవికోటి♦ఘృణియుతాభోగంబు
భోగంబు మోక్షంబు ♦ పొసఁగునెందు
ఏపురం బంబర♦శ్రీపరమాకల్ప
మాకల్పము వసింతు ♦ రార్యులెందు
ఏపూర్మతల్లి య♦హీనతరానంద
రానందదఘకర్మ♦రతుల కెందు

తే. గీ. సంతతవసంత సరసర♦సాలసాల
ఫలరసాలోలకీరాది ♦ పత్త్రిజాల
గదితఋగ్యజుషంబు ని♦ష్కల్మషంబు
నగుచు నవ్వీడు జోడులే ♦ కలరు నెపుడు. 124

చ. వరజగదండభిత్తి కల ♦ వన్నియకోట బహిస్థితాంబువుల్
పరిఘ లతఃపరప్రకృతిఁ ♦ బాదమహావనదుర్గమై తగన్
కరమరుదారు నేపురము ♦ కామరుషాపరుషారికోటులన్
దరియఁగనీయ దన్నలువ ♦ నాల్గుమొగాలఁ బరామృశింపఁగన్. 125

శా. ఆలోకంబునఁ గోటిసూర్యనిభది♦వ్యాస్థానమధ్యంబునన్
శ్రీలింపొందు చిరత్నరత్నవిలస♦త్సింహాసనాగ్రంబునన్

బాలాదిత్యమహత్సహస్రదళయుక్ ♦ పద్మోజ్జ్వలత్కర్ణికన్
హేలాసృష్టజగత్త్రయుండు కొలువుం ♦ డెన్ ధాత చేతోధృతిన్. 126

సీ. క్షణకళాఘటికాది ♦ కాలంబు సాకార
మై గడియారమం ♦ దండ పల్క
గ్రహతారకారాశి ♦ గణము లల్లనఁ జేరి
పంచాంగదినశుద్ధిఁ ♦ బల్కరించ
సకలదిగ్దేవతల్ ♦ సభికుల నెల్లను
జోటులెఱింగి కూ ♦ ర్చుండ ననుప
పంచభూతంబులు ♦ ప్రణమిల్లి యే సృష్టి
నేమించునో యని ♦ మోముఁ జూడ

తే. గీ. వేదములు వందిజనములై ♦ వినుతిసేయ
శాస్త్రములు వేత్రపాణులై ♦ సంచరింపఁ
జెలఁగి కొలువున్న త్రైలోక్య ♦ సృష్టికర్త
నగరివాకిట నిజవాహ ♦ నంబు డిగ్గి. 127

కం. ప్రతిహారి తోడరా న
ప్రతిహారివిభూతి మెఱయ ♦ నమరేంద్రుఁడు దా
శతధృతిసన్నిధికిం జని
నతిచేసి సమున్నతాస ♦ నంబున నుండెన్. 128

ఉ. సారసపత్రనేత్ర విల ♦ సన్నవనీరదగాత్ర పావనో
దారచరిత్ర కంసముర ♦ దానవజైత్ర రమాకళత్ర శం
పారుచినేత్ర బోధరస ♦ మాత్ర పృథాసుతమిత్ర భక్తహృ
న్నీరజబాలమిత్ర వర ♦ నీరజపత్రపవిత్రకీర్తనా! 129

కం. కస్తూరీతిలకాంకిత
నిస్తులముఖచంద్ర వదన ♦ నిందితచంద్రా
అస్తోకద్యుతివిస్తృత
కౌస్తుభమణివక్ష విమల ♦ కమలదళాక్షా! 130

స్రగ్విణి

వారణాధీశదు♦ర్వార భీవారణా
ధారణా యోగిహృ♦ద్వాసనిర్ధారణా
కారణశ్రేణికా♦కల్పనా కారణా
చారణక్షేమవై♦శాల్య దోశ్చారణా. 131

— గద్య —

ఇది శ్రీమత్పాండ్య మండలాధీశ్వర శ్రీవిజయరంగ చొక్కనాథ మహీ
నాథకరుణాకటాక్ష సంపాదిత గజతురంగ మాందోళికా ఛత్ర
చామర విజయకాహళ భూరిభేరీబిరుదధ్వజ ప్రముఖ నిఖిల
సంపత్పారంపరీసమేధమాన సముఖ మీనాక్షీనా
యక తనూభవ శ్రీమీనాక్షీదేవీ కటాక్ష
లబ్ధకవితాసాంప్రదాయక వేంకట
కృష్ణప్పనాయక ప్రణీతంబైన
యహల్యాసంక్రందనంబను
మహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.



# అహల్యాసంక్రందనము.



## ద్వితీయాశ్వాసము.



శ్రీకనకవిమానాంతర
కాకోదరరాజతల్ప ♦ కలితాపేక్షా
శ్రీకనకాంగీప్రేమ ఘ
రాకలితవిశాలవక్ష ♦ రంగాధ్యక్షా!

వ. అవధరింపుము. 2

కం. ఆయెడ నవ్వాలికథ సా
ఖ్యాయతి జనమేజయుండు ♦ కరుణింపుమనన్
ధీయుతవర్యుఁడు వైశం
పాయనుఁ డిట్లనుచుఁ బలికెఁ ♦ బరమప్రీతిన్. 3

ఉ. ఆమెయిఁ జిన్నినవ్వు వద♦నాబ్జనివాసినియైన చానకున్
గోమలకాంతి వింతమెఱుఁ♦గుల్ ఘటియింప విరించి యిట్లనున్
"సేమమె నీకు సర్వసుర♦శేఖర! భద్రమె దేవకోటికిన్,
ధీమహితుల్ మునుల్ సఖులె, ♦ నీ విటువచ్చినదేమి?" నావుడున్. 4

ఉ. "స్వామికటాక్షవీక్ష లని♦శంబును గల్గుటఁజేసి యేమెయిన్
నేమమె మాకు సర్వసుర♦శేఖర ! నే నొకప్రశ్న చేసెదన్
నీ మును సృష్టిసేసిన య♦నేకవిధ ప్రమదాజనంబులో
నేమదిరాక్షి చక్కనిది ♦ యేర్పడ నానతియిమ్ము" నావుడున్. 5

కం. మోమునఁ జిఱునవ్వొలయఁగఁ
దామరచూ లనియె నముచి♦దమనునితోడన్
"నామనసుకు సరిపోయిన
భామామణిఁ గాన నీప్ర♦పంచములోనన్. 6

సీ. "రంభ యెన్నఁగ జడ♦ప్రాయ,యూర్వశి నల్ప
జీవంబు లేనిది ♦ చిత్రరేఖ
వామన పొట్టిది ♦ వక్రాంగి శశిరేఖ
హరిణియటంటిమా ♦ యడవిమెకము
గానుగరోల్ ఛాయఁ ♦ గను నతిలోత్తమ
పగలు చూచినచో న♦భాన తార
ధాన్యమాలిని మోము ♦ దర్శించిన ఖరంబు
పాండువుమేనిది ♦ పుండరీక

తే. గీ. నాగకన్య లటంటిమా ♦ నడలు కుంటు
తక్కువారలచందంబుఁ ♦ దలఁపనేల
ముజ్జగంబులలో నున్న♦ముదితలందు
నొచ్చె మొకయింత లేనిది ♦ యొక తెలేదు!. 7

సీ. "కన్నులైతే సరే, ♦ కన్నవిన్నదిగాని
మించుఁదళ్కులు గుమ్మ♦రించవలదె!
చన్నులైతేసరే, ♦ స్మరరాజ్య పట్టాభి
షేకకుంభంబులై ♦ చెలఁగవలదె!
వదనమైతేసరే, ♦ వరమనోహర్షాబ్ధి
శరదిందుబింబమై ♦ మోఁజయవలదె!

రూపమై తేనరే, ♦ చూపరకనులకు
నిర్వాణసౌఖ్యంబు ♦ నింపవలదె

తే. గీ. కాంతయైనంత సరియె ని♦ష్కాముఁడైన
మౌనివరునైన మరునిబం♦దానుగాఁగఁ
జేయవలవదె యిటువంటి♦చిన్నిచాన
ముజ్జగంబులలోఁగాన♦బుధనిధాన! 8

మ. "కుదురై యొప్పులకుప్పయై తనువునం ♦ గోరంత యొచ్చెంబు లే
నిదియై నొవ్వని జవ్వనంబు గలదై ♦ నిద్దంపుటొయ్యారియై
మదనోజ్జీవితయై గరాగరికయై ♦ మాణిక్యపుం బొమ్మయౌ
మదిరాక్షిన్ సృజియింతునే నొకతె మ ♦ న్మాహాత్మ్యమున్ జూడుమా!"

కం. అనిపలికి పద్మగర్భుఁడు
తనగురుఁ డగు బద్మనేత్రుఁ♦దలఁచి ప్రయత్నం
బొనరఁ జతుర్దశలోకీ
వనితాజనతాతిశయిత♦వైఖరి మెసఁగన్. 10

సీ. చందురులోమైల ♦ జలజంబులో దువ్వ
యూడ్చి పోఁద్రోచి రెం ♦ డొకటిసేసి
అరుణాశ్మకాఠిన్య ♦ మమృతపాండుగుణంబు
నుడిగించి యారెంటి ♦ నొకటిసేసి
అరులజో డెడయించి ♦ గిరులపరితాపంబు
పెకలించి యారెంటి ♦ నొకటిసేసి
యిభతుండచాంచల్య ♦ మిల ననంటులజాడ్య
మొడిచి యారెంటిఁ దా ♦ నొకటిసేసి

తే. గీ. కులుకునెమ్మోము కెమ్మోవి ♦ గుబ్బచన్ను
లరిదియూరులు నిర్మించి ♦ యంగజునకు
వింతకైదువుగా నొక్క ♦ దంతిగమన
నబ్జభవుఁడు సృజించె న♦హల్య యనఁగ. 11

వ. ఇట్లు నిర్మించిన. 12

ఉ. అంబుజగంధి చక్కఁదన ♦ మ్మల్లనఁ గన్గొని విస్మితాత్ముఁడై
యంబుజనేత్రుఁ డప్పుడు త్రి♦యంబకభావముఁ గోరె నాతఁ డ
ష్టాంబకలీలఁ గోరె మది ♦ నాతఁడు గోరె సహస్రలోచన
త్వంబు నతండనంతన య♦నత్వముఁగోరె మఱేమి చెప్పఁగన్. 13

చ. వనితనుగాంచి రంభ తల♦వంచెఁ, దిలోత్తమ మోము నల్లచే
సెను, శశిరేఖ లోఁగమలెఁ,♦జేష్టలుదక్కెను జిత్రరేఖ, కాఁ
కనొగిలె హేమ, మైమఱపు♦గాంచె మదాలస, తగ్గెఁజెందె వా
మన, కరఁగెన్ ఘృతాచి, యవి♦మానత మేనక గాంచె నెంతయున్. 14

సీ. రాజయోగారంభ♦రతులైన యతులైన
వదనంబుఁగని పార♦వశ్య మొంద
వరకుండలీంద్రభా♦వనులైన మునులైనఁ
జికురపాశముఁగాంచి ♦ శిరము లూఁపఁ
బద్మాసనాభ్యాస♦పటులైన వటులైనఁ
బదకాంతిఁగన్గొని ♦ ప్రస్తుతింప
నిర్గుణపరతత్త్వ♦నిధులైన బుధులైన
నవలగ్నలతఁగాంచి ♦ యాసఁ జెంద
తే. గీ. వినుతసకలాగమాంతవా♦సనలుగన్న
ధన్యులైనను నెమ్మని♦తావిఁ గోర
నలినసంభవుకడ నిల్చె ♦ నయనవిజిత
ముగ్ధసారంగి యాజగ♦న్మోహనాంగి. 15

ఉ. బాలకురంగనేత్రి నునుఁ ♦ బల్కులకున్ విరివింటివానిబా
బాలకువాదు పెన్దొడల ♦ బంగరురంగు మెఱుంగు లంటికం
బాలకు రాదు నెమ్మొగము♦బా గలపున్నమచందమామ దం
బాలకుమీఁదు దానిసరి♦బాలిక లేదు జగత్త్రయంబునన్. 16

కం. కుందరమా దంతావళి
మందరమా చన్నుఁదోయి ♦ [1]మైజగ్గుజగా
హొందరమా యాభామిని
ముందర మానినియుఁగలదె ♦ ముజ్జగములలోఁ గా. 17

ఆ. వె. తూపు రూపుమాపుఁ ♦ దొయ్యాలి నునుజూపు
సోముగోము నోము ♦ భామమోము
కెంపుసొంపునింపు ♦ శంపాంగియధరంబు
గారు సౌరు దేరు ♦ కలికినడలు. 18

ఆ. వె. లతల వెతలఁబెట్టు ♦ లలితాంగినునుమేను
కలువఁ గెలువఁజాలుఁ ♦ జెలువచూపు
శుకముమొగముఁ గొట్టు ♦ సుకుమారిమాటలు
దరముఁ దఱుము లీలఁ ♦ దరుణిగళము. 19

సీ. గిండ్లుగా గజనిమ్మ♦పండ్లుగా బంగారు
చెండ్లుగా నింతిపా♦లిండ్లు దనరుఁ
గావిగా నమృతంపు♦బావిగా రుచిఁ దేనె
క్రోవిగా నలివేణి♦మోవి దనరు
రూపుగా మరుచేతి♦తూపుగా సిరులకుఁ
బ్రాపుగాఁ బూఁబోఁణి♦చూపు దనరుఁ
గుల్కుగాఁ గపురంపుఁ♦బల్కుగా రాచిల్క
కళ్కుగా లతకూన♦పల్కు దనరు

తే. గీ. తమ్ములనుకొనుఁ దమ్ములఁ♦గొమ్మ ముఖము
సరులు నీలంపుసరులకుఁ ♦ దరుణికురులు
వింటికొనలకు సమము వా♦ల్గంటి బొమలు
వర్ణితములౌనె శ్రీ లింతి♦కర్ణములకు. 20

పా. 1. నిగ్గు

సీ. పల్లవమ్ములకాంతి నెల్ల వమ్ముగఁ జేయు
కామినీపాదపంకజము నిజము
తామేలుసొగసు న న్నేమేలు ననిమించు
బింబాధరీప్రవ దంబుడంబు
వరిపొట్టకట్ట లా వరిపొట్టని తలంచు
కలికిపిక్కలరంగు కలహారంగు
రంభ మైపట్ట లా రంభమంద విదుల్చు
తొయ్యలిబంగారు తొడలుకడలు
తే. గీ. చిలువబాగారు నయ్యారె, చెలువయూరు!
తొలుకనాకాశతులకొను చెలియకొను
లలితపున్నాగముసనాభి లలననాభి
కనకలికుచంబు వరబాలి కాకుచంబు. 21

కం. వరమా కరతల, మిందీ
వరమా కనుదోయి, హంస వరమా నడ, ని
ల్వర మాచెలిఁగన మరుదే
వరమాయగఁ దనరె లోక వరమా యనఁగన్. 22

కం. కరమా నునుదొడ, దర్వీ
కరమాజడ, జంఘు మే ల్కరమా, చపలా
కరమా తనులత, కమలా
కరమా చెయి, చెలిని ధర సు కరమా పొగడన్. 23

చ. కినిసి కుచాననాంగరుచి గిన్నెలతో నెలతో లతోన్నతిన్
ఘనకచ కంఠ రూపములు కందరమై దరమై రమైక్యమై
గొనబగు వాక్కటీక్షులటు కోయిలకో యిలకో లకోరికో
వనితనొసల్ వళుల్ నడుము బాలహరిన్ లహరిన్ హరి న్నగున్.24

కం. గోరస మాపల్కులరుచి
సారస మామఖవిలాస సంపద మరుచే

నారస మావీక్షణ మళి
కౌరస మాకేశపాశ ♦ మబ్జాననకున్. 25

శా. బంతే చన్గవ నిగ్గు మేనురుచిపో♦ల్పన్ జాళువామేలుడాల్
దొంతే కన్నులధాళధళ్యరుచు లెం♦త్రో కల్వకున్ జూడ మేల్
బంతే కంతునిచంతికేలునడలున్ ♦ బాగైన యాభామకున్
ఎంతేలేదు సమాన మెంచుటకుఁగా ♦ నీ కేడులోకంబులన్. 26

సీ. తనుసృజించినబ్రహ్మ ♦ తనయందమీక్షించి
తిన్మయత్వము నొంది♦ తత్తరింప
నైష్ఠికులైన స♦నత్సుజాతాదులు
మది ఝల్లుమన హరి♦స్మరణసేయ
నధ్యాత్మవిజ్ఞాను♦లైన సన్యాసులు
పరవశులై గగు♦ర్పాటుఁజెంద
వాణియు నప్సరో♦వనితాజనంబులు
'మగవారు కామైతి'♦మని తలంప
తే. గీ. ముద్దుముంగురు కొనగోట ♦ దిద్దుకొనుచుఁ
దెలివిచూపు లకాలచం♦ద్రికల నీన
నడలుగని ధాత తేజీలు ♦ జడనుపడఁగ
బాల్యయావనకల్య య♦హల్య యొప్పె. 27

సీ. 'అమృతాశనాధిప♦త్యము చెల్లునా దీని
యధర మానక' యంచు ♦ నసురవిభుఁడు
'దక్షిణనాయక♦త్వముపోలునా దీని
రతులఁ దేల్పక' యంచు ♦ రవిసుతుండు
'నవరసరసికత ♦ హవణించునా దీని
సారెఁ గూడక' యంచు ♦ శరధివిభుఁడు
'సార్వభౌమస్థితి ♦ సమకూరునా దీని
వెంట నంటక' యంచు ♦ విత్తవిభుఁడు

తే. గీ. నలఘుశతకోటికాంక్షలు నతనుదండ
భృతులు నంజనతృష లల కేహితములు
నిన్మడింపఁగ ననిమిష దృష్టులెరి
అంబుజభవోపలాల్య నహల్యఁజూచి. 28

సీ. కల్కికటాక్షంబు కల్గితేగద తాను
కుసుమాస్త్రుఁడ నటంచుఁ కుసుమశరుఁడు
కొమ్మవాతెఱతేనెఁ గ్రోలితేగద తాను
మధువు నాదునటంచు మాధవుండు
నెలఁతముద్దుమొగంబు నిమిరితేగద తాను
ఘనకళానిధి నంచుఁ గమలవైరి
సుదతియూరుపుతావి సోఁకితేగద తాను
గంధవాహుఁ డటంచు గాలివేల్పుఁ

తే. గీ. దలఁచి రచ్చట సిద్ధగం ధర్వయక్ష
చారణాదులు దత్కాంతి పూరవార్ధి
మగ్నులై చిత్రరూపుల మాడ్కినుండి
రంత శచికాంతుఁ డెంతయు నాత్మలోన. 29

మ. ఎలమించుక్ దులమించు హేమలతయో యీ రేడులోకంబులన్
వలపించందగు కామదివ్యకళయో వాంఛన్ ద్రిలోకీవృగు
త్పలనీహారమయూఖరేఖయొ జగ ద్భాగ్యంబె యీరూపమై
లలిఁ [1]గన్పట్టెనొకాక యింతులకు నీ లావణ్యముల్ గల్గునే?. 30

ఉ. డంబులు శైలశేఖరవి డంబులు దీనికుచంబు లెన్న నో
చ్చెంబులువల్కుఁ గుందనపుఁ జెంబుల, నిద్దపుటద్దముల్ గపో
లంబులు, నీలమేఘపట లంబులు పెన్నెరు లౌర, యౌర యా
యంబుజగంధి రత్న మిల యందలి సుందరులందు నెంచఁగన్. 31

---

పా. 1. గన్పట్టును

శా. తేరాజున్ నగుమోముతో వనరుహ • శ్రీఁగేరుకందోయితో
బారన్ గొల్వఁగవచ్చు పెన్నురముతో • బాగైన నెమ్మేనితో
'నీ రాజన్యుఁడు సానురాగమున న•న్నే చూచుచున్నాఁడు మే
లౌరా సోయగ'మంచు జిష్ణువు నహ•ల్యాభామయున్ గన్గొనెన్. 32

కం. అప్పుడు పూర్వకకుప్పతి
తప్పక యత్తరుణిఁజూచెఁ • దరుణీమణియున్
ఱెప్పల నార్పక చూచెన్
గుప్పెన్ మరుఁ డిద్దఱన్ ల•కోరులచేతన్. 33

కం. జగముల నన్నిటి నేలుచు
నగణితసౌందర్యవిక్ర•మైశ్వర్యములన్
బొగడొందెడు తనకంటెను
మగువకుఁ దగినట్టి వేఱె • మగఁడుం గలఁడే. 34

చ. అని తనుఁజూచి తోడనె య•హల్యను గాంచి సభాసదావళిన్
గనుఁగొని తాను వేఁడునెడఁ • గాదనఁడంచు సురేంద్రుఁ డిట్లనున్
"వనరుహగర్భ మీమహిమ • వర్ణనసేయఁ దరంబె యద్భుతం
బనుపమ మత్కిభాగ్యఫల•మై తగు సృష్టి యొనర్చి 1ఱింతలోన్. 35

ఉ. చక్కఁదనాలకుప్పయగు • చక్కెరబొమ్మను సృష్టిచేయుటే
యెక్కువగాదు దీని మది • కింపగు నాథుని నిర్ణయించినన్
జక్కనితారతమ్యములు • సర్వ మెఱుఁగుదు వైనఁ జెప్పెదన్
దక్కొరు లెవ్వరుం2గలరు • తన్వికి నేనొకరుండు దక్కఁగన్. 36

కం. నరులన్ గిన్నరులన్ గిం
పురుషులఁ జారణుల సిద్ధ•పురుషుల ఋషులన్
బరికింపుము వీరలలో
విరిబోఁడికిఁ దగినవాఁడు • వీఁడని చెపుమా! 37

పా. 1. రింతలోన్. పా. 2. దగరు

ఉ. ముందుగ నేను వేఁడితిని ♦ మున్నుగ నే నినుఁ బ్రశ్న సేయఁగా
నిందుముఖిన్ సృజించితివి ♦ యెవ్వరికిన్ బనియేమి దేవరా
జ్యేందిరవోలె బాల ననుఁ ♦ జెందుటయుక్తము జాతిరత్నమున్
కుందనమున్ ఘటించినఁ ద♦గున్ మఱియొక్కటి యొప్పియుండునే.'' 38

కం. అనుటయుఁ బకపకనగి య
వ్వనజజుఁ డను ''నీకు నీవె ♦ వడ్డించుకొనన్
జనునే యిప్పుడు నీ కి
వ్వనిత పొసఁగ దరుగు మగుడ♦వచ్చినత్రోవన్.'' 39

కం. అనిపల్కి యచటనుండెడి
మునులం గని వీరలెల్ల ♦ ము న్నొక తొకతెన్
గొనియుందురు గౌతముఁ డొకఁ
డనఘుఁడు నైష్ఠికుఁడు వాని ♦ కర్హ మటంచున్. 40

కం. అక్షపదున్ భావితకమ
లాక్షపదున్ బిలిచి ధాత ♦ ''యబ్జదళాక్షిన్
రక్షింపు మిది భవద్వ్రత
దీక్షకు శుశ్రూషఁ జేయు ♦ ధృతమతి''ననుచున్. 41

ఉ. తేఁటిమెఱుంగుముంగురులుఁ ♦ దేటకనుంగవ లేఁతకౌనులున్
వాటపుముద్దుమేనులును ♦ వట్రువచన్గవ గల్గువారిఁగా
నాటకుఁ బాటకున్ గవిత♦లల్లుటకున్ దిటమైనవారిఁగాఁ
బాటలగంధులన్ సఖుల ♦ బల్వుర నిచ్చి యహల్యకిట్లనున్. 42

కం. ''మునికిన్ దినకరసమధా
మునికిన్ బరిచర్యసేయు ♦ ముదితాశయవై
ముని కింశుకవనికిం జను
మునికిన్ నీ కగుశుభంబు ♦ లుత్పలగంధీ!'' 43

చ. అని వనివంచ మంచిదని ♦ యంచితభక్తి విరించికిన్ వచో
వనితకు మ్రొక్కి యక్కలికి ♦ వల్గువిభూషణభూషితాంగియై

మునిపతివెంట నేఁగె సురముఖ్యుని వీడ్కొని; యింద్రుఁ డయ్యహా
ల్యను మది నెంచియెంచి మరునమ్ము లురమ్మున దూసి పాఱఁగన్.

కం. అమరావతికిన్ వెసఁ జని
యమరావలిఁ బనిచి కుసుమితారామములో
నమరారిన పువ్వులశ
య్యా మరాళీగమనఁ దలఁచి యాత్మగతమునన్. 45

ఉ. ఎన్నికలేల నీలమణు లెన్ని సరోజములెన్ని దొండపం
డ్లెన్ని దరంబులెన్ని గిరు లెన్ని మృణాళములెన్ని పొన్నపూ
లెన్ని యనంటులెన్ని దొన లెన్ని ప్రవాళములెన్ని రత్నముల్
చెన్నుగఁ గూర్చి యేర్పఱిచి చేసెను ధాత తదంగమాలికన్. 46

చ. మదనునిపొందుఁ గోరి రతిమానిని నోమిననోములెల్ల నీ
యదన ఫలించెనో యనఁగ నంగనగుల్ఫము లుల్లసిల్లుఁ ద
త్పదము లొనర్చి పద్మజుఁడు పాణితలంబు విదుర్పఁ జిందుత
త్పదమలకాంతిబిందులు రసాలకిసాలబిసప్రసూనముల్. 47

చ. మదవతిపాదముల్ దనకు మాతృసమానములంచు ధాత న
మ్మదమునఁ బూజచేసినసుమంబులనన్ నఖపంక్తి యొప్పగున్
మృదుగమనాగమంబు తెలమిన్ బఠియించి యుపన్యసించు చా
యఁ దనరు మంద్రనాదకల హంసకముల్ విలసిల్లు నింతికిన్. 48

చ. నవముగ మోహుచంద్రుఁడు గనంబడి కప్పరతావిగుప్పెడిన్
రవికెనె పిక్కటిల్లెను ఘనస్తనచక్రము లొప్పెఁదారకల్
నవిసెను బాల్యపుంజడదినంబు లటంచని చైత్రయాత్రకై
కవదొన లుంచె నిర్గముగఁ గంతుఁడనన్ జెలిజంఘ లొప్పగున్. 49

కం. ఊరుయుగం బనుపేరన్
బొరెడుబంగారునీటివాఁకను రతియున్
మారుఁడును జిన్నిగరిగలు
పోరుగ ముంచిగనఁ జెలికి జానువు లమరున్. 50

కం. కదలికలఁ మలినంబై
కదలికలఁ బొరలువిచ్చు ♦ కర్పూరంబుఁ
కదలికల నవ్వు శశిపా
కదలిక యూరుజిగి తెలిజ♦గాచల్వ రుచిఁ. 51

కం. కుందనపువు గెంటెనపూ
వందంబున ముద్దు గుల్కు ♦ నంగన వలరా
మందిరము చంద మెన్నఁగ
సౌందర్యపు మూలబొక్క♦సం బన నమరున్. 52

కం. కుందనపుతగడొ బంగరు
కెందమ్మిదళంబొ మిసిమి ♦ కేతకిరేకో
చందురుమెకముపదంబో య
నం దగు కందర్పునగరు ♦ నారీమణికిన్. 53

కం. కలదని కొందఱు లేదని
యిలఁ గొందఱుఁ బలుక రెంటి ♦ కీరట్టుగ న
చ్చెలికౌను మధ్యమస్థితి
మలయుచునుం డట్లుగాన ♦ మధ్యంబయ్యెఁ. 54

చ. నలువగురోమరాజి యమున♦నానదివారి తదీయవీచికా
వళి వళులయ్యె నందు సుడి ♦ వర్తులనాభి తదంతరీప మ
చ్చెలియనితంబబింబ మటు ♦ చేరువ గన్పడునట్టి రాజనం
బుల పొటకట్టులుఁ మఱియుఁ ♦ బోనఁగ నాగెటిచాలు నొప్పగుఁ. 55

సీ. తమ్మిమొగ్గలు గావు ♦ తారావళీహృద్య
శృంగారభంగి నె♦సంగుకతన
గజకుంభములు గావు ♦ కంఠీరవేంద్రావ
లగ్నభంగై కఖే♦లనమువలన
జక్కవకవ గాదు ♦ సరసల నెలవంక
లుంచంగ యోగ్యమై ♦ యుండుకతన

శైలేంద్రములుగావు ♦ శైలేంద్రగర్వంబు
డుంచునె మున్ను భ్ర♦మించుకతన,

తే. గీ. మున్ను శంకరుఫాలాగ్నిఁ ♦ బొనఁగఁబడిన
యతను బ్రతికించునట్టి ది♦వ్యామృతంబు
లనుచు బంగరుకలశంబు ♦ లనఁగవలయు
వనితకుచములు పొగడ నె♦వ్వరితరంబు? 56

కం. తరుణి కరద్వయసామ్యముఁ
బొరయన్ బ్రాయోపవేశ ♦ మొనరించెఁ గుశా
స్తరణమునన్ గమలంబులు
ధరణిఁ గుశేశయపదంబు ♦ దానం బూనెన్. 57

చ. ధరణిని గంధశాహ్వయముఁ ♦ దాల్చి కుచాద్రితటోపరిస్థితిన్
చిరముగ నుండి క్రొమ్మెఱుఁగుఁ ♦ దీగెచెలంగఁగ మౌక్తికచ్ఛటా
భరణ మెసంగఁ గంబురుచి ♦ పాటిల మోహతమంబు నించి య
మ్మరునపుబంతి యింతికి సు♦మంగళమౌ గళమొప్పు మెప్పుగన్. 58

మ. సకలాభీష్టము లిచ్చునంచు సుమన♦స్స్తోమముల్ నన్ను నా
యకరత్నంబని యెన్నునట్టి నను నా♦హా కొమ్మకెమ్మోవి యెం
చకయుండన్ గఠినంబటంచు ననుచిం♦తాభారమున్ మీఁదఁ దా
ల్చికదా వేలుపు మానికంబుగనియెన్ ♦ జింతామణీ నామమున్. 59

కం. పగడంబుడంబు వలదను
జిగురాకున్ రాకుమనునుఁ ♦ జెలివాతెఱ యీ
వగలాడినాస యౌ సం
పగిమొగ్గన్ బగుల ద్రొక్కుఁ ♦ బగ[1]మగలీలన్. 60

ఉ. క్రొన్నెలవంక శంక లిడు ♦ కుల్కుబొమల్ గని యచ్చకోరముల్
పన్నుగ నొప్పు ఱెప్పల నె♦పంబునఁ జొక్కపుఁజెక్కు లార్చుచున్

---

పా. 1. మొగ్గతిలన్

కన్నులుగల్గి కన్నులయి ♦ కన్పడె నా జిగిడాలుఁ జూచి యా
కన్నులవింటిరాయఁడు జ♦గంబులు గెల్వఁగ డాలుఁగైకొనెన్. 61

కం. నాసా కాంచనకోశచ
కాసాదృగ్విభ్రమంబు ♦ కర్ణాటశ్రీ
భాసురమై చెలిమోము వి
భాసిల్లెన్ రాజరాజ ♦ పట్టాంచితమై. 62

చ. అలికచమోముఁ బోలను సు♦ధాంశుసరోజము లొక్కపుష్కర
స్థలమునఁ బ్రార్థనల్ సలుపఁ ♦ జంద్రుఁడు పొందెఁ బ్రసాద మంతలో
పల బహురాజపాన మధు♦పస్మరిశంబున యోగభంగమై
జలజమటుండెఁ గానియెడఁ ♦ జందురునిం గని సైఁచియుండునే? 63

ఉ. భామినియారు సూదిమొన♦పైని జనుంగవపోక లుంచి యా
పై మఱినిల్చి కంఠము త♦పస్థితి నబ్జత నొందె మోవియున్
దా మదిఁజూచి యబ్జతను ♦ దప్పక పొందె మొగంబు నట్లనే
యేమఱకబ్జతం బడసె ♦ నింపుగఁ గన్గవ చెందె నబ్జతన్. 64

చ. తొలి నవపత్రమై పటిమ ♦ దోఁపమిచే శతపత్రమై చలం
బెలయ సహస్రపత్రమయి ♦ యింతిపదంబులు దాఁకి తోడనే
దళములఁ బాసి రోసి బిస♦దండముఁ జెందెఁ గముండ లుత్తగన్
నలినము హంస సంగతి ది♦నంబునుగాంచు నభీష్టయోగమున్. 65

ఉ. మారుఁడు లోకముల్ గెలిచి ♦ మాతృగృహంబున నుంచె జైత్రతూ
ణీరము లన్నయట్లు తరు♦ణీమణిపాదయుగంబుమీఁద జం
ఘారమఁ జూడ నొప్పె నటు♦గాకయ హేమమయోరుకాండముల్
మీఱునె తత్సమీపమున ♦ మించి సమంచితశైత్యసంపదన్. 66

ఉ. అంబుజగంధి యూరువుల ♦ యందముతో సరిబోరవచ్చి హే
రంబు గజేంద్రహస్తము తి♦రంబుగఁ జెందెను దంతభంగ మ
య్యంబరదంతిరాట్కరము ♦ నభ్రిముఁ బట్టుక ప్రాఁకు దాని చే
తంబును నంటికంబములుఁ ♦ దార్కొనినం దలవంపు లొందఁగా! 67

తే. గీ. చిన్ని పదముల హాలరేఖ♦చేత సీత
దీలుపడు కౌనుచేత వి♦దేహజాత
గోముమీాటినకటిచేత ♦ భూమిపుత్రి
యనఁగ విలసిల్లు నయ్యింతి ♦ యతనుదంతి. 68

కం. కురులో యొమ్మగు తుమ్మెద
గఱులో చకచకితకాంతిఁ♦గనునీలపురా
సరులో యిందీవరపున్
విరులో యిరులో యనంగ ♦ వెలఁదికి నమరున్. 69

తే. గీ. తూండ్లు భుజములు జాళువా♦గిండ్లు గుబ్బ
లేండ్లపదియాఱు నెన్నఁటి♦కెన్నటికిని
విండ్లు కనుబొమ లౌర, యీా♦వెలఁది వేడ్కఁ
బెండ్లియాడినఁగద నేను ♦ బెంపుగాంతు. 70

మాయురె! తత్ప్రమాన యగు ♦ మానినిఁ గాన జగంబులోన నా
హా! యిటువంటి చక్కఁదన ♦ మవ్విధి యెవ్విధిఁ జేయనేర్చెనో
హాయిరే! బాలచూపు తుద ♦ లక్కఁట జక్కఁడపున్ మెఱుంగులై
నామెద మున్సిపారె రతి♦నాథుని యాధునికాస్త్రమై ఖరిన్. 71

సీ. మెలఁత మైజిగిఁ బోలు ♦ మెఱుపుఁ జూచెదనన్న
నింపొందఁ గందోయి ♦ యెదుట నిలదు
సఖమోము సొబగొందు ♦ చంద్రుఁ జూచెదనన్న
మబ్బు నిబ్బరముగా ♦ మరుగువడెను
చెలిగుబ్బసరి జక్కఁ♦వలను జూచెద నన్నఁ
బక్షపాతము గల్గి ♦ బైటఁ దిరుగు
మగువ యాా రీమపన్నగముఁ జూచెదనన్న
బిలములోపల నుండి ♦ వెడలు టరుదు

తే. గీ. వనిత యవయవసాదృశ్య♦వస్తువులను
జూచియేనియు నొకపాటి ♦ సుఖముఁ బడసి

చింత మదిలోన నుపశమిం♦యింతునవిన
దానికినిసైత మాబ్రహ్మ♦తాళఁడాయె. 72

ఉ. తన కది కూఁతురాయె పుర♦దానవవైరికిఁ జెల్లెలాయె న
వ్వనధిసుతామనోహరుఁ డ♦వాప్తసమస్తమనోరథుండు గా
న నది యలక్ష్మమే నొకఁడ ♦ నాతికి నర్హుఁడ నన్నటుంచి బా
పనిపరిచర్యకంపె నల♦బంగరుబొమ్మను బొమ్మ నేమనన్. 73

కం. కామునిచర్యల కగు చెలి
కా మునిచర్యలకునగునె ♦ యకటా మాధు
ర్యామలసాహితి రసికశి
ఖా1మణికినిగాని మడ్డి♦గానికిఁ దగునే? 74

తే. గీ. కమ్మవిల్కా-నియమ్ముల ♦ కుమ్మలించి
నెమ్మి నే వేఁడ నెమ్మది ♦ నమ్మతిలక
పొమ్మనియె ముద్దుపుత్తడి♦బొమ్మ నియక
బమ్మయే వాఁడు పెనుజాతి♦బొమ్మగాని. 75

చ. మునుకొని సిగ్గుతో నళికి ♦ మోమటు ద్రిప్పి కరాంగుళిద్వయం
బునఁ జుబుకంబు నెత్తి నను♦మోవిని గోలినఁ నొచ్చె నొచ్చె నం
చని తనలోనఁ బల్కుచు ర♦వంతయుఁ గంతునిఁ దోపనీయకే
కనుఁగవ కెంపుసేయు నల ♦ కన్యను, గూడ చెలంగు టెన్నఁడో. 76

చ. మిసమిసలీను మొల్క చను♦మిట్టల కట్టిటు కేలుసాచఁగా
దుసికిల నట్టె మిట్టిపడి ♦ తొయ్యలి చెయ్యటుద్రోయ నెయ్యపున్
గొసరులఁ గుస్తరించి కొన♦గోటను బొక్కిలిఁ జిటి మెల్లనే
యొసపరి నీవి గొగ్గుచు న♦యో కడువేడుక లందు టెన్నఁడో! 77

చ. చనుఁగవ క్రేవఁ జూచినను ♦ స్వస్తికహస్తము చేతఁ గప్పుచున్
గొనబుగ ముద్దుపెట్టుకొనఁ ♦ గొంకుచు మోమటులిట్టుఁ ద్రిప్పుచున్
గనుఁగవ మూసి నాదు రతి♦కౌశలిఁ జూడక సిగ్గువెల్లిలో
మునుఁగుచు నుండు ముగ్ధయగు ♦ ముద్దులగుమ్మను జూచు టెన్నడో! 78

పా. 1. మణికే

సీ. సిబ్బెంపుగుబ్బలఁ ♦ జెనకనీయని సిగ్గు
చెనకినఁ బులక లెం♦చించు తమియు
కొమరైన వాతెరఁ ♦ గోరలనీయని లజ్జఁ
గోరినచో మరుల్ ♦ గొలుపు వలపు
నెఱికొప్పు కెంగేల ♦ నిమురనీయనినాన
నిమిరిన వలపున ♦ నిలుచు ప్రేమ
బిగిపోకముడి నంట ♦ విడువనీయని వ్రీడ
యెనసిన [1]విడువక ♦ మనెడు తమక

తే. గీ. మొదను సమముగఁ బెనఁగొన ♦ హృద్యమైన
మధ్యమవయస్సుముద్దుగు♦మ్మయును నేను
నందనోద్యానవనసీమ♦లందుఁ గూడి
పొందికలచేత నానంద ♦ మొందు టెపుడొ? 79

చ. పలుకులలోనఁ బిక్కులొక ♦ పానుపునన్ బొలయల్కచిక్కులున్
కలఁకలు దీఱ మ్రొక్కులును గాటపుఁ♦గౌఁగిటిలోన సొక్కుల
గ్గలమగు మోవినొక్కులును ♦ గామునిసాములనేర్పుటెక్కులున్
గల యల నిండుజవ్వనపుఁ గన్నియ♦మిన్నను బొందు టెన్నఁడో? 80

చ. కలఁగి చలించు ముంగురులు ♦ కర్ణములన్ నటియించు కమ్మలున్
చిలికెడు చిన్నిక్రొంజెమట ♦ చెక్కుల నించుక జారు కొంచెపున్
తిలకము నొప్పఁ జొరుమర♦తిశ్రమతాంతవిలోలనేత్ర యా
కలికిమొగంబు నెన్నఁటికిఁ ♦ గన్నులపండువుగాఁగఁజూతునో? 81

ఉ. ఇంకొకసారి పోయి హరి♦ణేక్షణ నిమ్మని వేఁడుకొందునో
పంకజగర్భు నాతఁడు కృ♦పారహితాత్మత నీయకుండెనా
కొంకు దొఱంగి జంగ యిడి ♦ క్రూరుఁడు మారుఁడు లీల బాలచూ
తాంకురసాయకానల శి♦ఖావళికిన్ శలభంబుఁ జేయఁడే? 82

ఉ. ఆసరసీరుహాక్షిపయి ♦ నాసల నాసరివారు నవ్వ ను
ద్వాసితధైర్యతన్ విసివి ♦ వాసనవింటివజీరు నమ్ములన్

పా. 1. 'విడువకు మనెడు'

గాసిలుచున్నవాఁడ ననుఁ ♦ గన్నడసేసె విధాత యయ్యయో!
దోసముకాదొకో తపసుఁ ♦ దొయ్యలి నీయక యిట్టు లేచుటల్. 83

సీ. [1]చాన కమ్మనిమోవి ♦ చవిఁ గ్రోలఁగల్గితే
మధులక్ష్మి కీ పుష్ప ♦ మంటపంబు
కలికిమోమున మోముఁ ♦ గదియింపఁగల్గితే
యబ్జునకును గమ ♦ లార్పణంబు
అరవిందముఖికొప్పు ♦ నఱుమంగఁ గల్గితే
నీలకంధరునకు ♦ నెమలిపించె
కలకంఠిపలుకు ♦ లాకర్ణింపఁగల్గితే
హృద్యవాగ్విజుల క ♦ భీష్టఫలము
తే. గీ. అలికచకుచంబు లంటంగఁ ♦ గలిగెనేని
యేడుకొండలరాయని ♦ కేనుభక్తిఁ
గనకశిఖరము లెత్తింతుఁ ♦ గంతుకాఁక
తీరఁగాక, వయారి నన్ ♦ జేరఁగాక! 84

కం. అని యనిశముఁ జింతించుచు
ననురాగమునన్ దరంగి ♦ తాశాశయుఁడై
వనితను మనమునఁ దలఁచుచు
ననిమిషపతి వెండియున్ మ ♦ హామోహమునన్. 85

సీ. మగువపాదములని ♦ చిగురుటాకుల నెత్తు
సఖియూరులని కద ♦ ళికల హత్తు
సతినితంబంబని ♦ సైకతస్థలి వ్రాలు
చెలువవళులని వీచి ♦ కలను దేలు
మెలఁతయారనుచుఁ దు ♦ మ్మెదచాలుఁ గనిసొక్కు
కలికిచన్నులని జ ♦ క్కవల నొక్కు
పొలఁతి గళంబని ♦ పోకబోదియ నూను
వెలఁదిమోవి యటంచు ♦ బింబ మూను

పా. 1. చాన! రమ్మని,

తే. గీ. రమణినేత్రంబులని చకో♦రములఁ జూచు
చెలువకొప్పని నెమ్మిక♦ చేయిఁ జాచు
తెలిసి తోడనె విరహార్తి ♦ దిగులుఁజెందు
కుందు నందనమందు సం♦క్రందనుండు. 86

సీ. ప్రతిలేని చిత్తరు♦ప్రతిమ నీడ్వఁగఁ బోయి
ముదిత కాదని యెంచి ♦ బెదరి చూచు,
తననీడఁ గని కౌఁగి♦టను జేర్పఁగాఁ బోయి
మగువ కాదని యెంచి ♦ వగచి నిలుచు
మొనసి యింద్రాణితో ♦ ముచ్చటాడఁగఁ బోయి
మునిరాణి కాదని ♦ [1]మనసు నొచ్చు
కనుమూయఁ దోఁచురూ♦పును బట్టఁగాఁ బోయి
తరుణి దబ్బరటంచుఁ ♦ దత్తరించు

తే. గీ. రమ్మనుచుఁ జీరుఁ జెంతల ♦ క్రిమ్మచేరు
మోహ మెదఁగూఱుఁ గళఁదేరు ♦ ముద్దుఁగోరు
గోరికలమీఱుఁ బలుమాఱు ♦ మారుదూఱు
నమరవిభుఁ డెట్లు దనరారు ♦ నట్టితారు. 87

ఉ. జాదులు సూదులంచుఁ దెలి ♦ చల్వలు చిల్వలటంచుఁ గప్రపున్
వేదులు నేదులంచు నెల♦నిగ్గులు నగ్గులటంచు రాజకీ
రాదులు వాదులంచు మణి♦హారము భార మటంచు నెంచుచున్
పైదలిపైఁ దలిర్చు తమి♦పర్వ సువర్వవరేణ్యుఁ డుండఁగన్. 88

ఉ. అచ్చట నాయహల్యయు వి♦యచ్చరవల్లభురూపసంపదల్
మెచ్చుచుఁ బచ్చవింటిమొకి♦మీని లకోరికి నిచ్చ నొచ్చుచున్
నెచ్చెలిచాలు గొల్వ నవ♦నీయహుతాశనధూమమండలా
భ్యచ్చయవేష్టితాగము త♦పోవనభాగముఁ గాంచె నంతటన్. 89

పా. 1, ముగుద నెంచు

సీ. ఉంఛధాన్యసమర్పి • తోర్వారాధీశార్హ
షష్ఠభాగాంకిత • సైకతంబు
త్రిషవణాప్లుతమౌని • ధృతవల్కలాంచల
పృషతచంద్రకవజ్ఝ • రీతటంబు
మునిబాలకానీత • పునరంకురత్కుశ
శ్యామికాకోమల • శ్మాతలంబు
పృషదాజ్యహోమస • మేధమానహుతాశ
ధూమగంధావృత • వ్యోమభాగ

తే. గీ. మతిథి[1]పూజార్హ వస్తుస • మార్జనైక
సంగ్రహవ్యగ్రగృహమేధి • సంకులంబు
శాంతము నగణ్యపుణ్యాని • శాంత మగుచు
శ్రమముల నణంచు గౌతమా • శ్రమముఁ జేరె. 90

కం. జలజాతాసనునాజ్ఞ
కలకంఠీతిలక మపుడు • గౌతమమునికిన్
చెలఁగి పరిచర్య సేయుచు
ఫలకిసలయకుసుమసమిదు • పాస యొనర్పన్. 91

కం. తాళీహింతాళీకం
కేళీవకుళామ్రనారి • కేళీకుహళీ
పాళీఘనకేళీవన
మాళీతతి గొలువఁ జేరె • నాళీకముగాన్. 92

చ. అళికచ ముంగురుల్ గనిన • యబ్జములందలి తేంట్లు దూఱెఁ దో
య్యలిపలుకుల్ వినంగఁ బొద • లంతట గోయిలదండు చేరె నె
చ్చెలికుచకుంభముల్ గనుచుఁ • జెట్లకుఁ జక్రములెల్లఁ బాఱె గో
మలినడయందముల్ దెలిసి • మానసముల్ వడిఁ జేరె హంసముల్. 93

పా. 1. పూజార్థ

సీ. అందముల్ త్రిభువనా♦నందముల్ స్మరమూల
కందముల్ సరసమా♦కందము లివె
తుంగముల్ పుష్పితసా♦రంగముల్ వాసనా
రంగముల్ లలితనా♦రంగము లివె
చారువుల్ నవకేస♦రోరువుల్ [1]భా జిత
మేరువుల్ వికసన్న♦మేరువు లివె
సైకముల్ మధురసా♦నేకముల్ కృతజనా
శోకముల్ పుష్పితా♦శోకము లివె

తే. గీ. పొగడనెగడిన మొగడల ♦ పొగడలివియె
తుంటవిలుదంట నంటుల ♦ నంటులివియె
కొమ్మచనుగుమ్మ యొమ్మల ♦ నిమ్మలివియె
కలికి! యీతోఁట చిగురువి♦ల్కానికోట. 94

ఉ. బాల నిజంబు నీపలుకు ♦ భాసిలుకొమ్మలు కొత్తడంబులున్
రాలు రజంబు మందు బలు ♦ నారికెడంబులపాళెలున్ ఫిరం
గీ లలపండ్లు గుండ్లు నళి ♦ కీరచకోరమయూరపాళి యు
త్కాలబలంబు నైన మరు♦కోటయె యీయెలదోఁట చూడఁగన్.

చ. తెలివిరిపొన్నగిన్నియల ♦ తేనియమద్యము లాని సొక్కులన్
గులుకుచు మొగ్గచంటిలత ♦ కూనలమోవుల నొక్కి ముద్దుకో
యిలపలుకుల్ చెలంగ నల ♦ యింతులపయ్యెద లొయ్యఁ దీయుచున్
దిలకపుఁ దావు లంటుచును ♦ దిమ్మరి తెమ్మెర గ్రమ్మఁ గొమ్మరో!

చ. కుసుమసమూహవాసనలఁ ♦ గుల్కెడు నీ లతకూన యొక్కతా
పసతరుఁ జేరవచ్చె నదె ♦ పద్మదళాయతనేత్రి, కంటివా
కుసుమసమూహవాసనలఁ ♦ గుల్కెడు నీలతకూన యొక్కతా
పసతరుఁ జేరి యుండుటిది ♦ పద్మజు నానతిఁ గాదె కోమలీ! 97

పా. 1. భాసిత

చ. అమితమరందతోయముల ♦ నర్ఘ్యము పాద్య మొసంగియుం బద
భ్రమరరవంబులం గుశల♦భాషణముల్ సవరించి వేడ్కతో
గమలజముద్దుకూఁతురని ♦ కైకొని నిన్ను వసంతలక్ష్మి ప
క్షముదగఁ బూజ సల్పెను ల♦సద్విసతంతుసహోదరోదరీ! 98

కం. దాడింబపండ్లకై వెస
వేడెంబులు వెట్టెఁ జిలుక ♦ విరిబోఁడీ, నీ
కోడెచనుఁగుబ్బగవకై
వేడుకఁ బడి తిరుగు సమర♦విభుమదిఁ బోలెం. 99

ఉ. అన్నులమిన్న శోకహర♦మాట యశోకసమాఖ్యఁ గాంచు నీ
సన్నుతశాఖిరాజమును ♦ సారెకుఁ దన్నెదవేమి న్యాయమే
కన్నులవింటిబోయకును ♦ గైదువు లిచ్చి సమస్తపాంథులం
మన్నిగొనుం బలాశి యిది ♦ మన్నన కర్హమటే విలాసినీ! 100

కం. నుసువుచు నీగతిఁ జడలం
నడుముల్ బిగియంగఁ జుట్టి ♦ నారీనివహం
బెడనంతఁ దన్నుఁ బొగడఁగ
నొడిగట్టెను మారుఁ డఖిల♦యువధృతిహృతికిం. 101

సీ. మైనిగ్గుసొంపు సం♦పగివసంతములచే
బ్రమ్మతుమ్మెదబారుఁ ♦ బాఱఁ దరిమి
సంకుమదామోద♦సహజవాసనలచేఁ
జిలుకల నెల్ల ది♦క్కులకుఁ దోలి
లోలమానాపాంగ ♦ జాలకశ్రేణిచేఁ
బికజాలములఁ బికా♦పికలు చేసి
నెఱికొప్పు నెఱకప్పు♦నీలాభ్రపంక్తిచే
మదమరాళంబుల ♦ నదరఁ ద్రోలి
తే. గీ. తావియుడివోని విరులు క్ష♦తంబులేని
ఫలములు నచుంబితములైన ♦ పల్లవములు

నంచ లంచలఁగలఁచని ♦ మంచినీళ్లఁ
దరుణి యొసఁగంగ మునిపతి ♦ తపము సేసె. 102

ఉ. ఆతరళాక్షియందము మ♦హత్తరమా కటిమందముల్ వచో
జాతగళన్మరందము ని♦జంబగు నెమ్మొయిగంధముల్ బెడం
గా తరితీపుచందము మ♦హామునిడెందము నొంపదాయె నం
త్తే తరుణీవిలాసముల ♦ ధీరులచిత్తము దత్తరిల్లునే. 103

కం. అనిష్ఠానిధినిష్ఠయు
భూనుతమగు బ్రహ్మచర్య♦మును గాంచి యుజాం
డానాతిఁ బెండ్లిసేసెన్
గానేతరధైర్యఖనికి ♦ గౌతమమునికిన్. 104

చ. సతతము నగ్నిహోత్రపరి♦చర్యయు దేవపితృప్రతోషణం
బతిథిసమర్చనంబు మొద♦లైన గృహస్థవిధానమెల్లఁ బ్ర
స్తుతమతిఁజేయు గౌతముని♦తోడ నహల్య కృతానుకూల్యయై
స్థితి విలసిల్లఁ గాపురము♦సేయుఁ బురంధ్రులు సన్నుతింపఁగన్. 105

కం. వనజాక్షి యిట్టులుండియుఁ
బనిదీరినవేళ నొంటి♦పాటున బలసూ
దను చక్కఁదనమె తలఁచున్
వనితల నమ్మఁదురె శివశి♦వా యెంతైనన్. 106

ఉ. జన్మములందు నిందుర్గుణ♦శంసనముల్ విను సాదరంబుగాఁ
బన్నిహవిర్విశేషములు ♦ పాకవిరోధికి నిచ్చమెచ్చుగాఁ
గ్రన్నన సన్నుతింపు శచి♦కాపురమే కద కాపురం బటం
చన్నలినాయతాక్షి తన♦యందముఁ జూచి శిరంబు నూఁచుచున్. 107

ఉ. "వేళమెఱింగి కూడి రతి♦భేదములన్ దనియించి యల్గినన్
బాళిని బుజ్జగించి రస♦భావములన్ గరఁగించునాయకుం
డేల యదృష్టహీనలగు ♦ నింతులకున్ లభియించు"నంచు నా
లోలవిశాలనేత్ర తన♦లోపలఁ గుందును వెచ్చనూర్చుచున్. 108

మ. ప్రమదారత్న మహల్య యింద్రుని మదిన్ ♦ భావించుఁ దోడ్తోన ధ
ర్మము గాదంచుఁ దలంచు నెంచినగతిన్ ♦ రానిచ్చునా దైవమం
చు మదిన్ వేసరు నిచ్చవచ్చువిభుతోన్ ♦ సొంపొందు టిల్లాండ్ర కే
లమరుంబొమ్మను నాఁడుపుట్టువున నా♦హా, పుట్టనౌనా యనున్. 109

తే. గీ. కోరఁదగినట్టి కోరికల్ ♦ గోరవలయుఁ
గాని రాయలుగను కలల్ ♦ గాననగునె?
పంగుఁడైనట్టి జనుఁడేడ, ♦ గంగయేడ?
యొల్ల నీవట్టివెతలని ♦ యూరకుండు. 110

మ. అది యట్లుండె సురేంద్రుఁ డంతట నహ♦ల్యాయత్తచిత్తంబుతో
హృదయాంతర్గతచింతతో ననుదినో♦ద్రిక్తానురాగంబుతోఁ
గదియంగూడని కాఁకతో నవిజహ♦ద్గంభీరభావంబుతో
మదనోన్మత్తనవాతిముక్తశరసం♦పాతంబు సైరించుచున్. 101

చ. మదనుఁ డనల్పశిల్పకళ ♦ మాటికి నేర్పుఁగ రాగసంపదల్
కుదురుగ సంఘటించి యవి♦కుంఠితభావనపేరితూలికన్
హృదయపుఁ బల్కయందు నవ♦నీరజలోచనరూపవైఖరుల్
విదితముగా లిఖించుచును ♦ లేఖవిభుం డనిశంబుఁ గన్గొనున్. 112

సీ. అంగతాపముడింద ♦ హరిచందన మలంద
నది మేనికాఁకచే ♦ నగ్నియయ్యె
శ్వాసవేగ మణంప ♦ జలజ మాఘ్రాణింప
నది కంతుసమ్మోహ♦నాస్త్రమయ్యె
తనువుచెమ్మట దీర్పఁ ♦ దొషారజలమార్ప
నది మారభోగివి♦షాంబు వయ్యె
డెంద మారటదీఱ ♦ నందనవనిఁజేర
నది యసిపత్రవ♦న్యాభ మయ్యె
తే. గీ. ముల్లుదీసినయెడఁ గొఱ్ఱు♦మొత్తినట్లు
లొకటి సేయంగఁబోయిన ♦ నొక్కటయ్యె

నెంత గ్రహచారమో నిర్జ ♦ రేంద్రునకును
మకర కేతుమహాదశ ♦ వికటమయ్యె. 113

సీ. మందారవని కేఁగు ♦ మందారవనిలోన
డెంద మానందంబు ♦ నొందకున్న
మందాకినికి నేఁగు ♦ మందాకినీతటి
మారజ్వరనిదాఘు ♦ మారకున్న
మందరగిరి కేఁగు ♦ మందరగిరియందుఁ
బొందికగాఁ బ్రొద్దు ♦ వోవకున్న
బిందుసరసి కేఁగు ♦ బిందుసరస్సులో
నారాటమింతేనిఁ ♦ దీఱకున్నఁ

తే. గీ. బుడమి కేతెంచి గౌతమ ♦ మునివరేణ్యు
నాశ్రమంబున కేఁగి య ♦ హల్యమేని
కమ్మనెత్తమ్మినెత్తావి ♦ గాడ్పు సోఁకఁ
గొంతవిశ్రాంతిఁ గనికోరి ♦ కుధరవైరి. 114

ఉ. ఒక్కొకవేళ వచ్చి పురు ♦ హూతుఁడు జాఁగిలిమ్రొక్కి జాళువా
చక్కని కమ్మతమ్మి కవ ♦ చానపదంబుల నంటునట్లుగా
మక్కువ మానికిచ్చుముని ♦ మానిని కిచ్చు వధూటి నవ్వు లేఁ
జెక్కులఁ దోఁపఁ గన్నుఁగవఁ ♦ జేరును నాతని కేలు మాఱుగన్. 115

చ. ఎవ్వరది యింటిలోపల?
న ♦ దెవ్వరు?
శకున్రుఁడ;
చెల్ల! మీరలా,
యివలికి రండు;
నీదుమగఁ ♦ డెక్కడ?
మూలఫలార్థమేఁగె;
గా

నువిదరో, తామసంబగునో?
♦ ఉండుఁడు, పూజలు గాంచిపోండు;
సే
యవలయు పూజ నీవెఱుఁగ♦వా?
—యన సిగ్గున నేఁగు నవ్వుచున్. 116

మ. మునితో నింద్రుఁడు మాటలాడునపు డం♦భోజాక్షి కిలందె గ
ల్లన మైజల్లన మాట తోఁపక వితా♦కై యుండఁ దద్భావమున్
గని యాజవ్వని సిగ్గు ప్రౌఢిమయు శృం♦గారంబు లేనవ్వులున్
మొనయంజూచు నతండు చూచిన మర♦ల్చున్ జూపు వేఱొక్కెడన్.

ఉ. ఈనళినప్రవాళములు ♦ నీకదళీతరు లీమహీస్థలం
బీనడబావి యీఖగము ♦ లీ లత లీక్రముకాభిరూప్యమీ
భూనుతసోమలక్ష్మియు న♦పూర్వములంచు నుతించు వాసవుం
డానలినాక్షిచక్కఁదన ♦ మాశ్రమవర్ణనగా మునీంద్రుతోన్. 118

ఉ. రంగదభంగవైభవము ♦ రాజిల యజ్ఞములందు నభ్రమా
తంగము నెక్కి యింద్రుఁడు త♦దాశ్రమవీథిని వచ్చుచోఁ జెలిన్
ముంగటఁ జూచి కన్నులను ♦ మ్రొక్కి మనస్సున గౌఁగలించు న
య్యంగన రెండునుంగని య♦నంగుఁడు పువ్వులువైచు కత్తికిన్. 119

కం. ఈగతి నింద్రుఁ డహల్యా
రాగతిరస్కృతశచీపు♦రంధ్రీరతియై
ద్రాగతివేలకృతస్వ
ర్భాగతియై తిరిగె నాసు♦పోసిన రీతిన్. 120

ఉ. కౌస్తుభచారువక్ష సిత♦కంజదళాక్ష కళిందకన్యకా
నిస్తులనీలవర్ణ కమ♦నీయ చరాచరమాననీయ ప
ద్మాస్తనకుంకుమాంక నవ♦మండన దానవదర్పఖండనా
కస్తురిరంగ రంగపుర♦కైరవపూర్ణకురంగలాంఛనా! 121

కం. కుందారవిందసుందర
మందారసుకీర్తిసార ♦ మహితవిహారా
వందారుజనాభీప్సిత
బృందారకరత్న సమర♦భిన్నసపత్నా! 122

మత్తకోకిల.

చంద్రపుష్కరిణీతటాంచల ♦ చార చారణసన్నుతా!
మంద్రనీరదమాలికాసుకు♦మార మారశతోపమా!
సాంద్ర సత్కరుణానవామృత♦సార సారసలోచనా!
ఇంద్రచంద్రదినేంద్రముఖ్య సు♦రేశ యీశవిభావితా! 123

—♦ గద్య ♦—

ఇది శ్రీ పాండ్యమండలాధీశ్వర శ్రీ విజయరంగ చొక్కనాథ మహీ
నాథకరుణాకటాక్ష సంపాదిత గజతురంగ మాందోళికా ఛత్ర చామర
విజయనోహళ కాహళ భూరిభేరీబిరుదధ్వజ ప్రముఖాఖిల
సంపత్పారంపరీసమేధమాన సముఖ మీనాక్షీనాయక
తనూభవ శ్రీమీనాక్షీదేవీ కటాక్ష
లబ్ధకవితాసాంప్రదాయక వేంకట
కృష్ణప్పనాయక ప్రణీతంబైన
యహల్యాసంక్రందనంబను
మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.



# అహల్యాసంక్రందనము.



## తృతీయాశ్వాసము.



శ్రీతరుణీనయనోత్పల
శీతమయూఖాభిరామ ♦ శ్రితజనవాంఛా
జాతప్రతిపాదన చణ
చేతోవ్యాపారనిరతి ♦ శ్రీరంగపతీ!

వ. అవధరింపుము. 2

కం. శ్రీయుతుఁడగు జనమేజయుఁ
డాయతమతి నవలికథల ♦ నడిగిన మదికిన్
హాయి దలిర్పఁగ వైశం
పాయనుఁ డిట్లనియె లోక♦పావనచరిత్రన్. 3

కం. ఇటులుండ నొక్కనాఁ డా
కుటిలాలక కడకు వచ్చెఁ ♦ గొంకక ఘటనా
ఘటనాకోవిదమతి యగు
జటినీమణి యోర్తు లలిత♦సత్వరగతిమై. 4

చ. పదముల యోగవాగెలును ♦ బాణితలంబున నాగబెత్తముం
నుదుట విభూతిరేఖయు మ♦నోజ్ఞకటీతటిఁ గావిచీర పొం
బొదివినయట్టి యొక్కముగ♦పుం రుదురాకలదండ సందిటం
వదనమునం మృదుస్మితము ♦వర్తిలు యోగినిఁ గాంచి భక్తితోం. 5

కం. వందనమొనర్చి పూజల్
పొందికగాఁ జేసి పీఠ♦మున నునిచియు బా
లేందుముఖి! యెందుఁ బోయెదు
వెం దుండుదు విందు వచ్చు ♦ టేమి యటన్నం. 6

ఉ. ఉందును సత్యలోకమున ♦ యోగబలంబున నెల్లదిక్కులం
గ్రిందుగ సంచరింతు శశి♦ఖండకిరీటికిఁ దద్వధూటికిం
మందరధారికిం రమకు ♦ మాటలబోటికి నవ్విరించికిం
పొందికలం దెడాటములు ♦ పుట్టిన మాన్పుదు వారు మెచ్చఁగం. 7

కం. నందనవని నిన్నం సం
క్రందనుఁ గనుఁగొంటి నతనిఁ ♦ గనినంతనె నా
డెందము భగీలుమనియెం
దండడిఁబడు వానిదీన♦దశ యేమందుం? 8

సీ. నిబిడోష్ణనిశ్వాస♦నికరంబుచేఁ గల్ప
వనవాటి కాపించ♦వన్నె గాఁగ
కల్పానలాకల్ప♦కందర్పవహ్నిచే
నెసఁగు విం వాక యి♦ట్లింకులింక
ధారాళనేత్రాంబు ♦ ధారాతివృష్టికి
జలదసందోహ మా♦శ్చర్యమొంద
నత్యంతకఠినదీ♦నాలాపములచేత
వజ్రిమేనియు గుండె♦పగిలి యెడల

తే. గీ. కరుణయెల్లఁ బుమాకృతిఁ ♦ గాంచినట్లు
విరహతాపంబు మూర్తిభ♦వించినట్లు

తలఁచి పలుకంగరాని దు♦ర్దశలఁబొందు
మఘవు నే నందుఁగనుఁగొంటి ♦ మచ్చెకంటి. 9

ఉ. ఎవ్వతెమీఁదనో హృదయ ♦ మీభువనత్రయనాథునింతగా
రవ్వలఁబెట్టినట్టి యల ♦ రక్కసి యెవ్వతొ చూతమంచు నే
నవ్వల మధ్యకుంజకుహ♦రాంతరసీమ నణంగియున్న-చో
నవ్వలశాసనుం డనియె ♦ నవ్వల నవ్వలమానవేదనన్. 10

ఉ. 'ఏలసృజించె దాని నను ♦ నేలసృజించెను బ్రహ్మ దానికిన్
లాలితరూపయౌవన క♦ళాలలితాంగవిలాసవిభ్రమం
బేల నొసంగె? బేలతన♦మేటికి నిచ్చె, మదీయబుద్ధికిన్?
బాలికతోడ నామనవిఁ ♦ బల్కెడువారి జగానఁ గానఁగా. 11

మ. 'కలలోఁ జూతునటన్న నిద్ర యెఱుఁగన్ ♦ గన్నారఁ జిత్తర్వునన్
దెలియం జూచెదనన్న బాష్పములచే ♦ నేత్రాబ్జముల్ క్రమ్మెడిన్
కలయన్ ధ్యానముఁ జేతునన్న మది ను♦న్మాదంబు నందిల్లెడిన్
ఇలలోఁ దాళఁగరానితాప మహహా ♦ యెట్లోర్చెదన్ దైవమా! 12

చ. 'కలుకుటొయారపున్నడలు ♦ గుబ్బచనుంగవ గొప్పకన్నులున్
తొలుకరిక్రొమ్మెఱుంగుగమి♦తో గవితోపమమైన మేనితో
నలయలివేణి లోవెలి న♦హర్నిశమున్ గనుపట్టుచుండియున్
జలగత చంద్రమండలము ♦ చాడ్పునఁ జేతికి నబ్బ దక్కటా! 13

మ. 'ధనికున్ జేయును లోభివాని నెఱదా♦తన్ బేదఁగాఁ జేయు ర
త్యనభిజ్ఞుండగు నెడ్డెకున్ మదనతం♦త్రప్రౌఢయౌదాని భా
ర్యనుగాఁజేయు నటన్నకోపమునఁ గాఁ♦దా బ్రహ్మశీర్షంబు ద్రుం
చెను శంభుం డటువంటి వానికి ననౌ♦చిత్యం బనన్ జెల్లునే?' 14

కం. అని పలికి చిత్రఫలకం
బునఁ దనభావమున నున్న♦ముద్దులగుమ్మన్
దనువునఁ బులకలమొలకలు
పెనఁగొనఁగా వ్రాసి చూచి ♦ పేరెద నునిచెన్. 15

కం. 'ఆరూపము నీరూపము
సారూప్యముఁ జెంది యుండె ♦ జలజదళాక్షీ!
మారుఁడు స్వైరవిహారుఁడు
వీరనివారని మదిన్ వి♦వేకములణఁచున్. 16

ఉ. 'మోవిని మోవిఁ జేర్చు, నది ♦ ముద్దిడకున్నను మ్రొక్కుఁగేల, ని
చ్ఛావిధిఁ గౌఁగిలించు, నది ♦ చన్నులనొత్తమి వెచ్చనూర్చుఁ జే
నీవిక నంటు హత్తమికి ♦ నెవ్వగఁ బొర్లును బూవుఁబాన్పుపై,
దైవముఁదిట్టుఁ దిట్టుకొనుఁ ♦ దన్నినుఁ దిట్టును బెట్టుమూర్ఛిలున్. 17

చ. 'యమవరుణాదు లెవ్వనిక♦టాక్ష మపేక్ష యొనర్తు రాగమా
గ్రములు యదీయరూపగుణ♦కర్మము లెన్నను వందివైఖరిన్
హిమకరసోదరీరమణుఁ ♦ డెవ్వని వాకిటికార్యకర్త యా
యమరవరుండె కోరె నిను ♦ నంగన, నీదగుభాగ్య మెట్టిదో! 18

చ. 'కొసరులొ చెక్కునొక్కులొ ♦ కూకిరవల్ పలికించి పల్కులో
యొసపరియల్కలో నయము♦లో రతిసుద్దులొ వింతముద్దులో
పసఁ దొడసందుపొందికలొ ♦ వాతెరకూర్పులొ ప్రక్కమార్పులో
రసికతలేనిగేస్తురతి ♦ రామకు నేమిసుఖంబు దెల్పుమా! 19

చ. 'వ్రతములఁ గృచ్ఛ్రకోటి నుప♦వాసములన్ దనువుల్ కృశింపఁగా
మతి నరతిన్ శిరోవ్రతిని ♦ మౌనముతో మొగమోరగా వడిన్
క్షితరులయువ్వ దీరె[1]నని ♦ పింతురు యౌవనమత్తకాశినీ
తతిహృదయంబు నేచుబలు ♦ తాపసులన్ బసులంచు నెంచుమా! 20

సీ. 'నేఁటి కమవాస్య ♦ నేఁటికిఁ బున్నమ
నేఁటికి సంక్రాంతి ♦ నేఁడువిషువు
నేఁడు వ్యతీపాత ♦ నేఁటికి వైధృతి
నేఁటికి మన్వాది ♦ నేఁటికిఁ దిథి

పా. 1. ననిపించిన

నేఁటి కేకాదశి ♦ నేఁటికి ద్వాదశి
నేఁటికి శివరాత్రి ♦ నేఁడు వ్రతము
నేఁటికి ఋతుకాల♦నియమంబుదప్పెను
నేఁటికిఁ బోనిమ్ము ♦ నేఁటి కోప
తే. గీ. మనుచు దినములు గడపుచు ♦ నలసులైన
పాపజాతులు పెండ్లాడి ♦ పాలవంటి
వయసు వమ్మొనరింతురు ♦ వనితలకును
బుడమి నిల్లాలిపుట్టుక పుట్టనగునె?' 21

చ. అనుటయు నర్మకోపదర♦హాసవిలాసలసన్ముఖాబ్జయై
యనియె నహల్య యిట్లనుచు ♦ "నమ్మకచెల్ల! యిటాడఁ జెల్లునే?
నను నటువంటిదానిఁగ మ♦నంబునఁ నెంచెదొ యెంచకున్న నీ
యనువున నందువా యెఱుఁగ♦వా మగువా, నను నాదుచిత్తముల్. 22

ఉ. 'ఎవ్వరి నేను మున్ను మొగ♦మెత్తి కనుంగొనఁ జూచినావు! నే
నెవ్వరి చెంగటల్ నిలిచి, ♦ తెవ్వరితో నగి, తేమిచేసితే
నెవ్వతె నిందుఁ జెప్పఁడు బ♦ళీ! ననుఁ బోఁటికి నిట్టిసుద్దులా
యివ్వనిమూలనున్న నను ♦ నేటికి ముంగిటి కీడ్చెదే చెలీ! 23

ఉ. 'వేది యలంకరించుటయొ ♦ వేల్మి కమర్చుటయో హవిస్సులన్
బోదిగఁ జేయుటో కుసుమ♦ముల్ గొనితెచ్చుటొ దేవపూజ క
గోదకమాహరించుటయొ ♦ యుగ్మలి, మా కిటువంటి సుద్దులీ
బోదలదానఁ గాను ననుఁ ♦ జుల్కనఁగా నెదలోఁ దలంపకే." 24

తే. గీ. అనిన యోగిని యెల నగ♦వంకురింప
"ఘనకచవు శైలకుచవు సై ♦కతనితంబ
వేను నినుఁ జుల్కఁగానెంతు♦నే మృగాక్షి!
పంచకన్యలలో నెన్నఁ ♦ బ్రిముఖవీవు. 25

ఉ. ఎంతతపంబు నేసిన మ♦హాంతపతివ్రతనిష్ఠ నున్నఁదా
నెంతకృశించినన్ వ్రతము♦లెన్ని యొనర్చిన నెన్నిపుణ్యతీ

ర్ధాంతరముల్ చరించిన నొ♦యారికి రూపవిలాసవంతుఁడౌ
కాంతునిఁ గౌఁగిలించినసు♦ఖంబు లభించునటే విలాసినీ! 26

ఉ. ఎందును సంచరింప కఖి♦లేంద్రియముల్ సుఖమొంద డెందమున్
బొందుగఁ దన్ముఁదామఱవ ♦ బుద్ధి కగోచరమైనయట్టి యా
నందము బ్రహ్మ మందు రది ♦ నవ్యవయోనవమోహనాంగియౌ
చందనగంధికిన్ దొరకుఁ ♦ జక్కనిమక్కువకాఁడు చిక్కినన్. 27

ఉ. చేతన మాటయే యరిది ♦ చేతనమైన మనుష్యజన్మ మ
త్యాతతపుణ్యలభ్య మటు♦లైనను స్త్రీజననం బలభ్య మా
జాతికిఁ గామమున్ సురత♦సౌఖ్యము హెచ్చది పోవఁద్రోచినన్
పాతక మాత్మహత్యకు స♦మం బగుపాతక మొక్కటున్నదే? 28

ఉ. వారక నత్తగారి కను♦బ్రామి, నిజేశ్వరు మోసపుచ్చి యా
యారునుమూరు నైనఁబడి ♦ యందరికన్నిఘటించి యాత్మఁదాఁ
గోరిననాథునిం గలసి ♦ కొల్లలుగా సుఖమందకున్న నా
సారసపత్రనేత్రి యెల♦జవ్వనమేటికి జన్మమేటికిన్. 29

సీ. కాంతుదంతక్షతిఁ ♦ గాంచనిమోవియు
మోవియే చల్లమ్మ♦గోవిగాక
సరసుండు బట్టని ♦ చన్నులు చన్నులా
యల మేకమెడచన్ను ♦ లంతేగాక
ప్రాణేశుఁ డనుభవిం♦పని యౌవనమ్ము యౌ
వనమటే నిజము య♦వ్వనము గాక
పతిమేన మకరికల్ ♦ వ్రాయనివ్రేళ్లును
వ్రేళ్లటే కలజువ్వి ♦ వేళ్లుగాక
తే. గీ. చంద్రకిరణమ్ము సోఁకిన ♦ చంద్రకాంత
మనఁగఁ బదియాఱుకళల జి♦మ్మనికరంగ
కరఁగి కరఁగించి కాంతునిఁ ♦ గవయకున్న
నారి నారియటే వింటి♦నారి గాక. 30

ఉ. ఏలనె జాలి సర్వజగ♦దీశ్వరుఁడైన సురేశ్వరుండు ని
న్నేలఁదలంచె మేలు గన♦వే వినవే యరచేతికబ్బు లి
బ్బేలను బేలనుం బలె బ♦లే పలుకందొరకొంటి వైన నీ
వేళకు కీలు నొకింం తెఱుంగుదు వ♦కీలొనరింతు విక్కి లనేటికే? 31

చ. చిలుకలకొల్కి, నీసొగసు ♦చిత్రరువందునఁ జూచి కన్నులన్
1బలపల నీరునించి తల♦వంచి తలంచి భ్రమించి మించి హా
వలపుల కేమిసేతు నని ♦ ప్రార్థనచేయు నుమహామహేశులన్
బలరిపుఁ డమ్మహామహుని ♦ భావ మదేమి యెఱుంగఁబల్కవే." 32

కం. అనిన నహల్య యొకించుక
నునుజెక్కుల నవ్వదోఁప ♦ నూల్కొన నీకన్
అనుఁ దా ననుతాపనతా
ననతావనతాంగి యగుచు♦నవమధురోక్తిన్. 33

సీ. 'స్వర్ణచిత్రవిచిత్ర♦వర్ణమందిరములా
యాపర్ణసదనంబు ♦ లింద్రునకును
సురసిద్ధసాధ్యభా♦సురదివ్యవీథులా
యాయాశ్రమంబు దే♦వేంద్రునకును
వరకల్పనాకల్ప♦కరకల్పతరువులా
యావృక్షములు నంద♦నేశునకును
పటుదాన సందాన♦బహుమానగజములా
యామృగావళులు మ♦హేంద్రునకును

తే. గీ. రమ్యసౌందర్యవరకళా♦2ప్రౌఢిమలఁను
గలిగి చెలఁగినయిందాణిఁ ♦ గాను నేను
ప్రేమ నాపైని శక్రుఁ డే♦రీతిఁ బూనుఁ
గొత్త వలపులు వలవరే ♦ కుతలపతులు. 34

పా. 1. వలవల పా. 2. ప్రౌఢిమములు

సీ. రంభకై వడిఁ గంబు♦రాగుల్కు పల్కులో
 తమిఁగూర్చువలపులో ♦ తారరీతి
నూర్వశిచందాన ♦ నొరపొందుచిన్నెలో
 రక్తిఁగుల్కుటొ మదా♦లసవితాన
శశిరేఖయందాన ♦ సకలకళాప్రౌఢా
 ఎదురొత్తులిచ్చుటో ♦ హేమలీల
మంజుఘోషనిరూఢి ♦ మణితానుకూల్యంబొ
 మానలీలలొ ధాన్య♦మాలినివలె
తే. గీ. నెఱిఁ దిలోత్తమగతి నతి♦స్నేహగరిమ
 నెనయుటో నాగరికరీతి ♦ యింతలేని
తపసియిల్లాండ్రపై బాళిఁ ♦ దగిలి మిగుల
 వగలఁ జెందుదురే తమ♦వంటిదొరలు.

కం. సతికిఁ మును జేపట్టిన
 పతి నొక్కరుఁ దక్క నితరుఁ ♦ బాటించుట సం
గతియటవే నీ కెంతటి
 మతిదిటవే యిట్లు నుడువ ♦ మర్యాదటవే!" 36

ఉ. నావుడు యోగినీరమణి ♦ నవ్వుచు 1నెచ్చెలి కొప్పు దువ్వుచుఁ
"నావచనంబు వేదవచ♦నంబని యెన్నుము బొంకెఱుంగనే
నీవు జనించినప్పుడె సు♦రేంద్రుఁడు నీదగుచెట్టఁబట్టి నాఁ
డీవీథి యానుగాదనిన ♦ నీవె మునీంద్రునిచే నెఱుంగుమా! 37

కం. అది సూక్ష్మరూపమంటే
 నిది యాతనిస్థూలరూప ♦ మిదియదివేఱా!
మదనాశుగసదనాయిత
 హృదనాగతధైర్యవయ్యె ♦ దేలా బాలా! 38

పా. 1. నచ్చెలి

సీ. పతులఁ గాదనుచు గో♦పాలుతోఁ బోయిన
గొల్లయిల్లాండ్రకే ♦ కొదువ వచ్చె
ధవు లేవు రుండ నా♦రవవానిఁ గోరిన
నాళాయనికి నేమి ♦ నయము తగ్గె
ఘటికాద్వయికి నొక్క ♦ కాంతుం జెంతకుఁ జేరు
పౌలోమి కే పాటి ♦ పదవి దప్పె
మగని న టుంచి మా ♦ ర్మగని వెంబడిఁ జన్న
తార కే యిల్లాలి♦తనము తగ్గె

తే. గీ. వారి కెవ్వారికిని లేని ♦ యారు దూరు
నీ తలనె వ్రాసెనే ధాత ♦ నిక్కృతిచేత
నిశ్చలానంద మొందుము ♦ నెమ్మి నేఁడు
నలినలోచన! దేవుఁ డు♦న్నాఁడు నాఁడు. 39

ఉ. ఇంతులపాపముల్ పతుల ♦ కింతయె గాని ప్రసక్తి లేదు కా
సంతయు వారి కంచు స్మృతు ♦ లన్నియుఁ బల్కు ను కాద టంచు నిం
తింతయుఁ గల్గె నేని ఋతు ♦ వైన జనున్ మఱి చింత యేలనే
కాంతకు సమ్మతం బయిన ♦ కాంతునిఁ బొందుటె యొక్క నేరమా? 40

కం. రాజీవాక్షి, 'యహల్యా
వై జార' యటంచు నాగ♦మాగ్రస్తుతుఁడౌ
నాజిష్ణునెనయవే 'యో
హాజారమిదంప్రియ' మను ♦ చదు వెఱుఁగవటే!". 41

కం. జటినీమణి యిటులాడిన
కుటిలాలక యిందు నెనయు♦కోరిక వొడమన్
దటుకునఁ బతిభయ మెనఁగఁగ
నటునిటు ననలేక శబలి♦తాశయ యగుచున్. 42

ఉ. కూరలు కందమూలములు ♦ కూళ్లు తలంటులు గారనూనె మా
చీరలు నారపట్ట కయి♦సేయుట మాకులమందె లేదు కాం

తారమునన్ జరించుట తృ♦ణంబులమీఁదఁ బరుండుటల్ మముం
గోరెడువారలుం గలరె ♦ కోమలి, నీదువివేక మేమనన్. 43

చ. మదనుని గుమ్మతీమొనలు ♦ మాటికి మర్మములంటఁబాఱినన్
వదలనికోరికల్ మొలిచి ♦ వర్ధిలి జెండమునందె డిందినన్
హృదయము ఱాయి చేసికొని ♦ యింపుఁ దలంపక యుండఁగాఁ దగున్
గదలఁ దరంబె యొక్కనికిఁ ♦ గంఠము జాపిన కంబుకంఠికిన్. 44

ఉ. అద్దములోనఁ దోఁచు ముదు ♦ పందనిమ్రానిఫలంబు కోవపున్
గద్దరిచిల్వచేఁబడిన ♦ గందపుఁదీవె మహావిషంబులో
నద్దినపళ్లెరంబు మగ♦నాలది కొంచెమునన్ లభించునే
సుద్దులు వేయునేల బల♦సూదనుతోఁ దెలియంగఁబల్కవే. 45

సీ. చక్కనివాఁ డింటి♦చాయకు వచ్చిన
మామగా రూరక ♦ మండిపడును
పుట్టింటిలో నొక్క♦పూట యుండఁగ రాదు
కత్తి గోఁతఁగఁబోరు ♦ నత్తగారు
నిమిషంబు పొరుగింట ♦ నిలిచియుండఁగరాదు
పటుకార్లఁ బట్టును♦వదినగారు
కడకుఁబోయిన నొక్క♦కడ నుండఁగారాదు
మఱఁదలు కొండేల♦మారిబసివి

తే. గీ. తోడికోడండ్రు చూపోప ♦ కాదుకొండ్రు
[1]పట్టపగ బట్టి పోరాడు ♦ బావగారు
జారసంగతిఁ గాంక్షించు ♦ చంద్రముఖికి
నత్తగారిల్లె కారాగృ♦హంబు దలఁప. 46

కం. భావమున నేమికిటుకో
నావంకనె చూచుచుండు ♦ నామగఁడెపుడున్
[2]రావశమో పోవశమో
[3]యీవని కెవ్వానికైన ♦ నిందునిభాస్యా! 47

---

పా. 1. పంటపగ   పా. 2. రావశమా పోవశమా   పా. 3. యీపని



కం. కాదని నీమొగమోటకు
నేడయినఁ మంచి దంటి♦నేనియు రతికే
ళీదక్షు నతని నెవ్వతె
మేదిని మెప్పింపనేర్చు ♦ మేలిమితోడఁ. 48

కం. తారావధూటి యొక్కతె
తారాపతి యొక్కరుండు ♦ ధన్యులు జగతిఁ
వారివలె సాహసింపఁగ
నేరికి శక్యంబు మగల ♦ కింతులకైనఁ. 49

కం. నామనవిగఁ దనపై నిఁక
నీమమతలు మానుమనవె ♦ యెవ్వరి కెవరే
కాముచెతల్ నావలె సు
త్రాముని సైరింపుమనుము ♦ తామరసాక్షీ! 50

ఉ. చుక్కలరేనిఁ గంతుని ను♦చుక్కను చక్కదనంబుగల్గు మా
చక్కనిసామి పాదజల♦జాతము లొదలఁ జేర్చి మ్రొక్కితిఁ
చిక్కఁగఁ గౌఁగిలించితిని ♦ సేమము వేఁడితి నేఁడనున్న నీ
ప్రక్కనె యున్నదాన నని ♦ భావమునఁ నెనరూనఁబల్కవే. 51

సీ. తనగుణంబులు విని ♦ ఘనమైన పులకలఁ
గడిమిపూవులగు త్రి♦కరణినుండు
తనరూపు భావించి ♦ తనరిన చెమటచే
మధుసిక్తపద్మిని♦మాడ్కినుండు
తన విలాసముఁ నెంచి ♦ దర్పకజ్వాలచేఁ
గనకశలాకసఁ ♦ గరఁగుచుండు
తనపొందికఁ దలంచి ♦ తనువెల్ల జల్లనఁ
జిత్రార్పితాభని♦శ్చేష్టనుండుఁ
తే. గీ. జేతనంబయ్యు నేను న♦చేతనముల
సరణి విరహాఖ్యకల్పావ♦సాన జలధిఁ

జేత నీఁదుచుఁ బొరంబుఁ ♦ జేరఁగాన
ధరణి మగనాలికంటెఁ బా♦తకియుఁ గలదె? 52

మ. విరులెల్లన్ బ్రదరంబులయ్యె విధురు♦గ్వీచుల్ దలంపంగ బం
ధురహేతిప్రకరంబులయ్యె నళిసం♦దోహంబులెల్లన్ భయం
కరదుర్వారశిలీముఖప్రతతులై ♦ కన్పట్టె నేదిక్కులన్
మరుఁడయ్యెన్ సుఖ మెప్పుడో కలుగుటల్ ♦ నాతాపముల్ దీఱఁగన్.

సీ. ఎన్నఁటికోకదా ♦ యెమ్మెకాని కరంబు
లెత్తి నాకన్నుల ♦ నొత్తుకొందు
నెన్నఁటికోకదా ♦ హృదయేశుసందిట
నివ్వటిల్లెడు ప్రేమఁ ♦ బవ్వళింతు
నెన్నఁటికోకదా ♦ వన్నెకానియురంబు
గబ్బిగుబ్బలఁ గ్రుమ్మి ♦ కౌఁగిలింతు
నెన్నఁటికోకదా ♦ యేలినసామికి
నందంపువాతెఱ ♦ విందొనర్తు

తే. గీ. నెన్నఁడోకద వగకాని ♦ కింపుమెఱయఁ
కంతుకయ్యంపువింతలు♦గానుపించి
హావుసు చెల్లింతుఁ జెలులలో ♦ నతిశయింతు
ననుచు నేనుందు నీయాన ♦ హంసయాన! 54

తే. గీ. ఏఁబరాధీనఁ గావున ♦ నింతవంతఁ
గ్రాఁగుచుండంగవలసెను ♦ గాక యున్న
నెఱకలను గట్టికొనియైన ♦ నెగసివచ్చి
తనయెదను వ్రాలినా చిల్క♦తాళివలెను. 55

ఉ. భారములాయెనమ్మ కుచ♦పాళికి హారము లేమిసేతు ని
స్సారము లాయెనమ్మ ఘన♦సారము మన్మథభూతభీమహుం
కారము లాయెనమ్మ కల♦కంఠనినాదములమ్మచెల్ల, నా
ధారము లాయెనమ్మ పరి♦తాపభరంబులకెల్లఁ బ్రాణముల్. 56

ఉ. పట్టఁగరాని మోహమునఁ ♦ బైకొని తోఁచినవెల్లఁ బల్కుటే
మట్టునఁ గట్టిపెట్టు మిది ♦ మానసమందె ధరిత్రిలోపలన్
పుట్టని యట్టిబిడ్డలకుఁ ♦ బూసలు గట్టుదు రమ్మలక్కలే
గుట్టున నుండుదాన నతి ♦ కోపనుఁ డింటిగృహస్థు యోగినీ! 57

కం. నాతల్లి వీవు నీతో
నాతలఁపేమిటికి దాఁచ ♦ నాతీ, మాయిం
టాతఁ డెప్పుడైనఁ గలసిన
నాతనిఁగాఁదలఁతు ముకుళి♦తాక్షిద్వయనై. 58

తే. గీ. అగ్నిహోత్రాల వేళాయె♦నమ్మ! నీవు
పోయిరమ్మని పంపి యా♦పొలఁతియుండ
సంభవించును దోషా[1]ధి♦కార మింక
గనుఁగొన ననర్హమని సూరి♦కన్ను మొగిచె. 59

సీ. కరిఘటాహాలిపటా♦శరభటాయసకటా
హములనైల్యము పొంత ♦ నణఁగఁద్రొక్కి
హారిశిలాభరజలా♦కరపికార్భకకులా
మితకాంతిసంతతి ♦ మితము చేసి
ఉరగరాడ్గరదురా♦ధరధరామితశరా
సితరుచిప్రాచుల♦చేరి చేరి
అళివిభాసురవిభా♦హరివిభాతులితభా
సంతతాభ్యుదయముల్ ♦ సంతరించి

తే. గీ. యినసుతాపింఛతాపింఛ♦వనదనికర
ఖంజనాంజనగిరి నీల♦కంజపుంజ
జంబుకాదంబసైరిభా♦డంబరములఁ
దాండవించెను దమము భూ♦మండలమున. 60

పా. 1. ఖిసార

చ. తెలుపును నల్పు దిక్కులు వి♦దిక్కులు మేరునగంబు సర్షపం
బిలయు నభంబు దూరము స♦మీపము హ్రస్వము దీర్ఘమున్న సం
జ్ఞలు గల సృష్టినేమిటి కొ♦నర్చితి నంచు విరించి యెంచఁగాఁ
బ్రళయపయోధు లొక్కమొగిఁ ♦ బర్వినటుల్ వెసఁబర్వెఁ జీఁకటుల్.

చ. మదననిదాఘతాపముల ♦ మాన్చు ఘనాఘనసంఘమో యనన్
గదిసె మహాంధకారములు ♦ కాంతగవేషణతత్పరాత్ములై
కొదుకుచు సందులన్ దిరుగు ♦ కొమ్మలు బెళ్కుమెఱుంగు లై రిలన్
వదలనివర్షమయ్యె నిశి ♦ పాంథజనంబులకున్ దురంతమై. 62

తే. గీ. తాపము లణంగె భూతసం♦తతు లెసంగ
నతనుధర్మపరిస్ఫూర్తు ♦ లతిశయించె
నుత్తమస్థితిమించెను ♦ నుత్తమముగ
ఖరకరాభావమే శుభం♦కరము ధరను. 63

చ. ఒకమగనాలు మాఱుమగఁ ♦ డుండునికేత మెఱుంగకే తమో
వికలత నొక్కెడన్ నిలువ ♦ వేఱొకతంచుఁ దదీయభర్త యా
సకియనె కౌఁగిలింప నది ♦ జారుఁ డటంచును జారయంచుఁ దా
రొకరొకరిం దమిం గలసి ♦ రుద్ధతి మన్మథుఁ డుబ్బి యార్వఁగన్ 64

చ. వెడవిలుకాని వేదనల ♦ వేఁగుచు దుర్విటు లేఁగఁ జీఁకటిన్
గుడిసెలు పంచలున్ వెడలి ♦ కుంటియు గ్రుడ్డియు భుగ్న రుగ్ణము
ట్లుడిఁగినయింతి మున్ను వల♦యోత్కరశబ్దనివేదితాత్ములై
బడిబడిఁ బైఁడిఁదీసిరి త♦మం బఖిలోత్తమమంచు నెంచుచున్. 65

ఉ. కప్పలకప్పడంబులును ♦ గస్తురిపూఁతలు చాలు నిప్పుడే
చొప్పననేఁగినన్ మనలఁ ♦ జూఁడగలండె త్రిణేత్రుఁడేనియున్
ముప్పదినాళ్లు నీదృశత♦మోవృతి సేయఁగరాదె బ్రహ్మయం
చప్పెనుచీఁకటిన్ వెడలి ♦ రారటమై కులటల్ తటాలునన్. 66

కం. ఆయామవర్తి మునివరుఁ
డాయామము నిగమసంహి♦తాభ్యాసకృత

వ్యాయామశ్రాంతమతిన్
సాయామతరుచ్ఛదాస్తృ • తాజినశయ్యన్. 67

మ. పవళింపన్ రమణీశిరోమణి రతి • ప్రారంభసంరంభతన్
ధవుపాదంబులు పట్టి యొత్తెడువితా • నన్ గోరు సోఁకించినన్
'నవలా, నీదుచెఱంగుమాసి పదియార్ • నాళ్లాయెఁ గాలంబు ద
ప్పె వృథాదోషమిదేల మాను' మన న • వ్వేళన్ విలోలాత్మయై. 68

కం. 'త్రిదశాధిపుఁడై తేఁ గద
యద నెఱుఁగుచు గోర్కెఁదీర్చు' • నని తనలోనన్
మదనాశుగ మదనాశుగ
మదనాశుగధాటి కదిరి • మానిని మునితోన్. 69

శా. "ఔలెం డంతకుమున్నె మాకుఁ బనిలే • దావోదనే; నిద్రపై
బాళిన్ మీపదమూలమందు శయనిం • పన్ వచ్చితిన్ జోలి చాల్
చాలుం బో" మ్మని యల్క మాఱుమొగమై • చంద్రాస్య నిద్రింప న
వ్వేళన్ శాంతమహార్ణవం బనఁగ సం • వేశించె నమ్మౌనియున్.

వ. తదనంతరంబ.

ఉ. యోగిగతిన్ సురేంద్రుఁడును • యోగ మొనర్చి తదీయసూక్తిపై
యోగజరాజగామిని వి • యోగదశన్ విని దాని చాతురీ
యోగము మెచ్చి కంతుని ని • యోగము నొదలఁ దాల్చియంత సం
యోగము సాహసక్రియఁ బ్ర • యోగముసేయఁగఁగూడదన్ మతిన్. 72

తే. గీ. కోడిగపుఁ గంతుయాతన • కోడి వజ్రి
కోడియై కూసెఁ "గొక్కొరో • కో" యటంచు
మౌని మేల్కని వామన • స్మరణ దనరఁ
గాల మరయక మునుగంగ • గంగకరిగె. 73

కం. గౌతమవేషమున బెడం
గౌతమకము మీఱ నిర్జ • రాధీశుఁడు బా

గా తమమునఁ జేరం జని
గౌతమసతికరముఁ బట్టె ♦ కౌతుకమెసఁగన్. 74

తే. గీ. "కొమ్మ యొకపుంజు తన పెంటి♦కోడిఁదలఁచి
కూసెఁగా కది వేకువ♦కోడిగాదు
ప్రొద్దు వొడువంగఁ దద్దయుఁ ♦ బ్రొద్దుగలదు
ముద్దుగా శయ్యఁ గరుదెమ్ము ♦ ముద్దుగుమ్మ!" 75

చ. అనిన నహల్య శంక మది ♦ నంకురమందఁగ మందహాసయై
యనియె 'మునీంద్రవేషమున ♦ నాశతమన్యుఁడొ కాక యన్యుఁడో
ననుఁ జెనకంగవచ్చె ముని♦నాథుఁడు గాఁ'డని ప్రేమయున్ భయం
బెనయఁ గరంబుఁ దీసికొని ♦ యిట్లనియెన్ గిలికించితంబుగన్. 76

చ. 'రతిపతి యంపఱంపముల ♦ రంపునఁ గంపమునొంది నేను మున్
రతికయి వచ్చి మచ్చిక లో♦నర్చినఁ బేర్చినచర్చ 'నొప్పనే
ఋతుదివసంబు దప్పెఁగడ♦ కేఁగు మటంటి విదేమి యిప్పుడీ
గతి బతిమాలె దెవ్వఁడవొ ♦ కల్లలుచెల్లవు పల్కు'నావుడున్. 77

తే. గీ. 'అలశతానంద[1]గురుఁడ గో♦త్రాధికారి
పరుల శతకోటియుక్తుల ♦ భంగపఱతు
నాత్మభూసన్నిధిని నీక♦రాంబుజంబుఁ
గాంక్షఁ బట్టితి నన్నేలుం♦గవె మృగాక్షి! 78

చ. అతివల జాతిచేష్టితక♦ళాస్పదమర్మవిభేద భేదియై
జతనగు జవ్వనంబు డిగ♦జాఱకమున్నె యభీష్టభోగముల్
ప్రతిదివసంబుఁ జెందకయె ♦ బాలిశుఁడైన జనుండు పిమ్మటన్
గతజలసేతు బంధనము ♦ గాఁ దలఁచున్ విషయోపభోగముల్. 79

కం. ఋతుకాలదినములైనన్
ఇతరదినములైన మఱియు ♦ నేదినమైనన్
వితసేయక రతికేళీ
ప్రతియగుకృతికఘమురాదు♦వనితా'యనుడున్. 80

పా. 1. గురుఁడు

కం. శ్లేషార్థముఁ దెలిసి నిజా
శ్లేషార్థము వచ్చె నలశ♦చీపతి యనుచున్
యోషారత్నంబు తదా
భాషణకౌతూహలాను ♦ భావాన్వితయై. 81

ఉ. 'నాపయి నింత ప్రేమ ముని♦నాథున కెన్నఁడుఁగానఁ గావునన్
నాపతి వీవుగావు కుహ♦నాకృతి వెవ్వఁడవో యెఱుంగ నీ
రూపముఁ జూప కూఱక మ♦రుల్గొని బల్మి యొనర్చితేని నే
సైఁప నిజంబు పల్కు మిఁకఁ ♦ జల్లకు వచ్చియు ముంత దాఁతురే?'' 82

చ. అనుటయు జాళువామినుకు♦టంచులదుప్పటి వల్లెవాటుతో
ననుపమ తారహారకట♦కాంగదముఖ్యవిభూషణాళితో
ఘన ఘనసారసంకుమద ♦ కల్పకమాల్యకదంబకంబుతోఁ
గనఁదగియెన్ శచీవిభుఁడు ♦ కంతువసంతగతిన్ నిజాకృతిన్. 83

ఉ. ఆలలితాంగి యాసురుచి♦రాంగునిఁ గన్గొనినంతఁ జెమ్మటల్
గీలుకొనంగ మేనుబుల♦కించ నకించనధైర్యయై మదిన్
జాలియు బాళిఁ దత్తరము ♦ నానఁగ నానఁగ నా నగారి ను
న్నీలదపాంగనీల నలి♦నీదళరాజినిఁ బూజ చేయుచున్. 84

ఉ. దేవ, శచీమనోరమణ, ♦ దేవర వచ్చినదేమి?
నీదు శ్రో
భావిభవంబుఁజూడ;
వన♦వాసిని కేమిటి చెల్వు?
రశ్న మే
తావున నున్ననేమి?
వని♦తానవమన్మథ, నాపయిన్ గృపో
ద్భావసనానతిచ్చెదవు!
♦భావజునాన నిజంబుపల్కితిన్. 85

కం. “నామగనివేషభాషల
నేమిటికి ధరించివచ్చి ♦ తెలుఁగంజెపుమా”

"నీమగనిరూప మాటకు
పై మాటలు నడపవలదె ♦ వారిజగంధీ!" 86

కం. "తగవా యిటుపలెఁ బల్కఁగ
మగనాలను నేను భువన♦మాన్యుఁడ వీవున్
నగరాజదమన, నిన్నున్
నగరా యిట్లయిన సురలు ♦ నగరావళులన్. 87

కం. అని పలికి యళుకుఁ గులుకున్
నునుసిగ్గును రాగరసము♦నూల్కొనుచూడ్కిన్
గనుఁగొనుచు నవలఁ బోవఁగఁ
జని యడ్డముసొచ్చి పాక♦శాసనుఁ డనియెన్. 88

చ. "నిలు నిలు మోలతాంగి, కరు♦ణించవె చంపకగంధి, సిగ్గటే
చిలుకలకొల్కి, యంజకవె ♦ చిత్తజుపూవులమొల్కి, నీపయిన్
వలచితినే మృగాక్షి, పెర♦వాఁడనటే శుకవాణి, యేనికన్
నిలువఁగలేనె చాన, నను ♦ నీదగుబంటుగ నేలవే చెలీ! 89

శా. నామీఁదన్ దయసేయవే పలుకుపం♦తంబేల వే యేలవే
మోమోటంబొకయింతలేక సకి, నీ ♦ మోమైననుం జూపవే
నీమోవించుక నొక్క నీయఁగదవే ♦ నీపక్కకున్ జేర్పవే
యేమై నాపలుకాదరించు వెత నే ♦ నెందాఁక సైరింపుదున్." 90

కం. అనుచున్ బలరిపుఁడంతటఁ
జనవును బలిమియును నెనరు♦సైఁగలఁ దోఁపన్
దనకరముల వనితామణి
చనుమొనలకు వేగఁ జాచఁ ♦ జాన యిటాడెన్. 91

చ. "సరసము చేయరాకు నను ♦జన్నులపైఁ జెయి వేయఁబోకు ని
ల్వారమని నల్వురున్ వినుకు♦లన్ గడునిందలు గట్టి యెందుకున్
వెఱవక యాడుకొందు రవి♦వేకమునన్ వల దేల వాదు ని
ర్జరపతి! చాలుఁజాలు ముని♦రాజు విన్న మఱి మోసమయ్యెడున్." 92

చ. "మునిపతి కోపగించినను ♦ మోసమటంటివి మోసమేలనో
వనిత, యతండు నిష్కపటి ♦ వాహిని కేఁగెను దానమాడ నీ
మనసు కరంగఁగావలెను ♦ మక్కువతో ననుఁ గౌఁగిలించి నీ
ఘనగళశబ్దమంత్రములఁ ♦ గాయజభూతముఁ దోలఁగావలెన్. 93

ఉ. దూరపుఁగొండలున్ నునుపు ♦ దోఁచునటన్నది నిక్కమాయె నో
వారిజగంధి, నీమనసు ♦ వచ్చునటంచని వచ్చినాఁడ ని
స్సారము చేయఁగాఁ దగదు ♦ చక్కన గా దిది లేనిపోని యీ
బీరములేల నాదుమన ♦ విన్నవినవే ఘనవేణికామణీ! 94

ఉ. చేర్పుము కౌఁగిటన్ వడిని ♦ జిక్కులు బెట్టకు కంతుకాక చ
ల్లార్పఁగ మోవిపానకము ♦ లానఁగ ని మ్మిదివేళ శయ్యకుం
దార్పుము జాగు సేయకవె ♦ తామరసాక్షి మరుండుసాక్షి కం
దర్పుని మందిరంబునకు ♦ దండము దండము మాటి మాటికిన్. 95

చ. సతతము నీగుణంబులను ♦ జక్కఁదనంబును విందుఁగందు సం
గతిగ ననంగ సంగర ము ♦ ఖంబునఁ గోరిక దీర్తువంచు నే
మతిని దలంచి నీకడకు ♦ మానిని, వచ్చితి కాదటంటివా
యతనుని యాన నీమగని ♦ యాన మఱిన్మఱి యాన నాపయిన్. 96

సీ. కొమ్మ, నీ కమ్మని ♦ కెమ్మోవి యీయవే
యమృతంబుఁ గ్రోలిన ♦ యరుచి దీఱ
కలికి, నీచను గుబ్బ ♦ కవఁ జేరనీయవే
కనకాద్రిపై నున్న ♦ కసటుదీఱ
సుదతి, నీకౌఁగిటఁ ♦ గదియింపవే కల్ప
సుమతల్పమున నున్న ♦ సొలపు దీఱ
వనిత, నీతోడజగ్గుఁ ♦ గనుఁగొన నీయవే
రంభతో నెనసిన ♦ రట్టుదీర

తే. గీ. మస్తుమీఱిన సురహస్తి ♦ మస్తకంబుఁ
గుస్తరించిన మామక ♦ హస్తములకు

హాయిగా నీ నితంబంబు ♦ లంటనియవె
కంటు నామీఁద నేల వా♦ల్గంటి,నీకు.' 97

ఉ. కురులకు వందనంబు నెలి♦గోముముఖంబునకున్ జోహారు నీ
యరుదగు కంబుకంఠమున ♦ కంజలి నీ కుచకుంభపాళికిన్
కరములు మోడ్చెదన్ బెళుకు ♦ కౌనుకు మ్రొక్కెద పంచబాణ మం
దిరమునకున్ సతీమణి! ప♦డింబడిగా పదివేల దండముల్. 98

కం. అని చెలిపాదంబులపై
ఘనచింతామణిసురత్న ♦ కనక కిరీటం
బును మోపి లేవకుండిన
వనజానన సిగ్గువలపు ♦ వడ్డికెఁబొలెన్. 99

కం. "దేవుఁడ వేలినసామివి
పోవయ్యా! నీవు నాకు♦ మ్రొక్కఁగఁ దగునా
లేవు"మని గుబ్బచనుమొన
లా విభు నెదసోఁక నెత్తె ♦ నంగన ప్రేమన్. 100

ఉ. ఎత్తిన పట్టుపీడక సు♦రేంద్రుఁడు తత్కుచకుంభపాళిపై
నత్తమిలన్ దురంత విర♦హార్ణవపూరము నీదుకై వడిన్
హత్తి రసాలసాలమున ♦ నల్లెడు మల్లియతీవకై వడిన్
గుత్తపుగుబ్బలాడి చను♦గుత్తులఁ దత్తను వొత్తె సొక్కుచున్. 101

ఉ. అంతటఁ గొంతసేపటికి ♦ నంగన సిబ్బెపుఁ గుబ్బఁ గ్రుమ్మినన్
స్వాంతము జల్లనంగ బల♦శాసనుఁ డాసను మోవియాన నొ
క్కింత మొగంబు ద్రిప్పి "వడ♦కింటికి రమ్మట కొన్ని నమ్మతుల్
కాంతుఁడ, నీ వొసంగినను ♦ గాని యొడంబడ" నంచుఁ బల్కుచున్.

తే. గీ. చెట్టపట్టుక తనదు పూ♦సెజ్జకడకు
వల్లభునిఁ దోడుకొని పోయి ♦ వలపు మెఱయఁ
దొడను దొడఁజేర్చి కూర్చుండి ♦ తోయజాక్షి
తోయజాక్షీణ రసధార ♦ దొలుకఁ బలికె. 103

సీ. 'మెఱుఁగువాతెఱ నొక్క ♦ కుర యెంగిలయ్యాని'
'యమృతాని కెంగిలి ♦ యనఁగనేమొ!'
'సుద్దిగ నున్నాను ♦ వద్దుర మైవ్రాలు'
'నతివ, బంగారాని ♦ కంటుగలదె?'
'గుబ్బచన్నుల నంట ♦ కుర యొక్క ప్రొద్దురా'
'చెయ్యంటకయగోటఁ ♦ జెనకరాదె'
'కొఱికిన మడుపువ ♦ ద్దుర నేఁడు నోమురా'
'తరుణి, మైనను నీవె ♦ కొఱికియీవె'

తే. గీ. 'వ్రతము కలయిక కారాదు ♦ వాదులేల'
'కలయకయె కళలయిక్కువల్ ♦ తెలిసి నొక్కి
దక్కి దక్కింతు నే నిన్నుఁ ♦ దరుణి! యనఁగ'
నిగ్గుమొగమునఁ గళదేర ♦ నెలఁతయనియె. 104

సీ. 'నేను నీచెక్కుల ♦ నెలవంక లుంతును
నీవు నాచన్నుల ♦ నిలుపరాదు
నేను నీ కెమ్మోవి ♦ నెఱిగంటుసేయుదు
నీవు నామోవి కం ♦ దించరాదు
నేను నీకురు లెల్ల ♦ నెఱిఁ జిక్కువఱుపుదు
నీవు నాకొప్పుఁబ ♦ ట్టీడ్వరాదు
నేను నీగళమున ♦ మృగనాభి నలఁదుదు
నీవు నానెమ్మెన ♦ నించరాదు

తే. గీ. గుటగుటల మీఱిగడిదేఱి ♦ కూకిపల్కు
లీవు నేనునుఁ బల్కరా ♦ దిట్లు నమ్మ
తైన వచ్చెద నీవు ర ♦ మ్మనినకడకు
వివిధశృంగారరసలోల ♦ విబుధపాల!' 105

చ. అనుటయు నల్లనవ్వి విబు ♦ ధాధిపుఁ 'డట్లనె నానుగాక యం
చన గురికట్టునిల్చునటె ♦ యంగజుకేళి' నటంచుఁజేర్చె న

కన్న ననబోఁడి చన్మొనలఁ ♦ గ్రుమ్మె సురేంద్రుఁడు మోవియానెఁ గం
జనయన చెక్కుఁ గీటెను గ♦చాకచిఁ బోరిరి వార లిర్వురున్. 106

వ. ఇట్లు మదనకద నారంభ సముజ్జృంభమాణమనోభిలాషల నయ్యహల్యాసుందరీ పురందరు లమందా నందకర చందనాది కస్తూరికా పరిమళ ద్రవ్యంబులకు సొమ్మసిల్లియుండి రప్పు డమ్మందయాన బృందారక బృందవందిత పదారవిందుఁడగు నా సంక్రందనునింగలయు మోహావేశంబునం బట్టరానిగుబ్బునం జిట్టాడుచు మట్టుమీఱి యతండు కౌఁగిటం జేర్చినం జేర్పనీయక యబ్బురఁపు గబ్బి సిబ్బెంపుగుబ్బల నిబ్బరంబునన్ జెయిసోఁకిన సోఁకనీయక కటికిచీఁకటికప్పులన్ గుప్పునన్ గప్పుకొప్పు నిమిరినన్ నిమురనీయఁక మిక్కిలి యెక్కువయైన చక్కని చెక్కు గీటినం గీటనీయక మధురసుధారసధారాధురంధరంబైన బింబాధరంబు గ్రోలినం గ్రోలనీయక కుందనపుటందంపుగెంటెనపూవునుం గుంటువఱుచు తుంటవింటి పాదుసాహి దివాణంబు నంటిన నంటనీయక మెండొడ్డుకొని యేమఱించి యొయ్యనొయ్యన విరులశయ్యకుఁ జేర్చి లాలించి కౌఁగిలించి యదలించి బాహాబాహిఁ గచాకచిం బెనంగి యుల్లందులకుం గమకించి నీవి వదలించి చివురు సవురు జవురు మోవితేనెలఁ గ్రోలి పైకొని కోకిలచందంబున శ్రవణానందంబుగా గుట గుటం బలుకుచు "మేలు,బళీ, హాసు, శాబాస"ని మెచ్చి యొకరొకరిమేను లప్పళించి వింతవింత పిలుపులం బిలుచుచుఁ గెందామరలం బోలు కందామరల నకమోడ్పులు గావించుచు మన్మథబ్రహ్మానందంబునుం బొంది మఱియును, 107

శా. 'ఔనే ముద్దులగుమ్మ, చూచి తవునే♦యందంపుఁబూరెమ్మ, మే
లౌనే చక్కఁదనాలయిక్క, యదె మే♦లజ్జాస్త్రిచేథక్క, యా
డౌనే యింతులమేలుబంతి, భళి శి♦స్త్రానే కళల్ దొంతి, మి
న్నానే' యంచు మఱిన్ బురందరుఁ డహ♦ల్యాభామ నీక్షించుచున్.

సీ. 'ఎన్నఁడు నేర్చితే ♦ యింతులమేల్బంతి,
పారావతారావ♦పాటవంబు

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

యెపు డభ్యసించితే ♦ యిందుబింబానన,
వివిధచుంబనకళా♦విభ్రమంబు
యెచ్చోట నేర్చితే ♦ యేణీవిలోచన,
నఖరాంక విన్యాస♦నైపుణంబు
యేనాఁ డెఱింగితే ♦ చీనిచక్కెరబొమ్మ,
పంచబాణాహవ♦ప్రౌఢిమంబు

తే. గీ. మూలనున్నట్టి జడదారి♦ముద్దరాల
వెన్నిచిన్నెలు నేర్చితే ♦ యెమ్మెలాడి,
మేలు మేలని కాంతుఁడు ♦ మెచ్చి పొగడ
వింతవింతఁగ మఱియును ♦ సంతసమున. 109

సీ. వెనుదీయకుమటంచు ♦ వెడవిల్తుఁ డాడించు
జాటిపోలికఁ గీలు♦జడ చలింప
స్మరసంగరంబునఁ ♦ గురియు పూవులవాన
తెఱఁగున సరులము♦త్తెములు రాల
మరుఁడను జగజెట్టి ♦ బిరుదువీణెలమ్రొడ్కి
గళరవంబున జమ♦త్కార మెసఁగఁ
జిత్తజరాజ్యాభి♦షేకాంబువుల మ్రొడ్కి
జల్లుగాఁ జెమట చి♦త్తళ్లు గురియ

తే. గీ. మదన పరదేవతాధ్యాన♦మహితనిష్ఠఁ
బోలి యుఱమోడ్పుఁగనుదోయి ♦ పొలుపు మీఱ
నంబుజేక్షణ పురుషాయి♦తంబు సలిపె
నెలమి నమరావతీంద్రుఁ దే♦వేంద్రుఁగూడి. 110

వ. అప్పుడు, 111

ఉ. భావము లొక్కటయ్యెను బ్ర♦పంచ మొకింతయు తోఁచదాయె నే
నీ వనుభేదముల్ జనె య♦నిర్వచనీయ సుఖంబ మాత్మసా

ప్ట్యావిదితంబు నద్వయ మనంతమునౌ సుఖ ముప్పతిల్లె నిం
దీవరగంధికిన్ బతికి నిర్భర సాత్త్విక మొంది పొందుచోన్. 112

సీ. చంద్రమండల సుధాసారమూరినయట్లు
చెమటచే నెమ్మోము చెలువుమీఱ
అంకుశక్షత మదహస్తికుంభములన
గోటిపోటులఁ జిన్నిగుబ్బ లెసఁగ
మగతేఁటి వ్రాలిన మంకెన విరిలీలఁ
గావిమోవినిఁబంటికాటు తనర
గాలికిఁ గదలెడు కదళిక రీతిగా
గడగడమని తొడల్ వడఁకుచుండ

తే. గీ. జాళువాగట్టుమీఁదను వ్రాలినట్టి
నీలమేఘంబు చొప్పన నెరులు కటిని
వ్రాల సురతాంతమున లేచి లీల నిలిచె
నింపున నహల్య యవ్వేళ నింద్రుఁ డెసను. 113

ఉ. వేకువజాము దోఁచె నళిబృందగరుద్భవవాతసంహతి
స్తోకదళద్దళత్ స్ఫురితతోయరుహప్రసరన్మరందధా
రాకలితోదకద్విగుణితాంచదభంగతరంగభంగి ప
ద్మాకరశీకరాంతరవిహార ముదారసమీర మంతటన్. 114

సీ. మరుసాముకండెముల్ గిరికొన్న తొడలతోఁ
దడబాటు చెందిన నడలతోడ
గుబ్బచన్నులను జిక్కులు వడ్డ సరులతో
నెరికొప్పునను జాఱు విరులతోడ
గజిబిజి పలుగంటిగమి కావిమోవితో
నెఱిఁ దప్పి వదలిన నీవితోడఁ
గెంపారు నెలవంకగుంపులచెక్కుతో
సొగకన్నుల నిద్రసొక్కుతోడ

తే. గీ. మిగులఁ జెదరినయలకల ♦ మెయిపులకల
కెలఁకు లరయుచుఁ జిలుకల♦కొలికి యపుడు
దురుసునడలను గేళిమం♦దిరము వెడలె
నలరువిలుకాని మదహస్తి ♦ యనఁగ. 115

చ. వెలువడి యింతటంతటను ♦ వేగిరపాటున నొంటిపాటునన్
గలయఁగఁ జూచి చూచి శచి♦కాంతుని మెల్ల నహల్యపిల్చి బల్
మెలఁకువతోడుతన్ బనుప ♦ 'మీఁదటి బుద్ధి యిఁకేమి పల్కితే
వెలఁదిరొ, పోయివత్తునట♦వే దిటవే' యని యింద్రుఁ డిట్లనెన్. 116

మ. 'తరుణీ, యేమని పల్కుదున్ గమనవా♦ర్తల్ పల్కనోరాడదే
మఱి కాదంచని యెంచి పోదునన రా♦మా, నేఁడు కాళ్ళాడదే
సరసన్ నిల్చిన వచ్చు నీపతి యహో♦చ్ఛన్ నిల్వఁగాఁ గూడదే
కటవారోయన్ గదె ముచ్చటల్ మనకు రా♦కల్ పోక లింకేడవే. 117

ఉ. నీవును నేను నొక్కయెడ ♦ నెమ్మది నెమ్మదిగూడి యుండుటల్
భావమునందు సైఁపకను ♦ పాపపుదైవత మిట్లుచేసె నే
నేవిధిఁదాళఁజాలు దిఁక ♦ నెన్నఁడు మర్వకుమీ ననుం దయా
భావనచేత' నంచు సుర♦వర్యుఁడు పల్కిన కల్కి ప్రీతిగన్. 118

సీ. 'మోహనాకార, నీ ♦ మోముఁ జూచినఁజాలు
సొబగైన చందురుఁ ♦ జూడనేల?
మదనావతార, నీ♦పెదవియానినఁ జాలుఁ
గండచక్కెరపాన♦కం బదేల?
సరస, నీనెమ్మేని♦చాయ సోఁకినఁజాలుఁ
గనకాభిషేకంబు ♦ కాంక్షలేల?
శృంగారమూర్తి, నీ♦చెట్టఁబట్టినఁజాలు
నరిదితామరఁ గేల ♦ నంటనేల?

తే. గీ. కళల ననుఁ జాల మెప్పించి ♦ కౌఁగిలించి
నీవి వదలించి కదియించి ♦ నేర్పు మించి

రతులఁ దేలించి మదనసా♦మ్రాజ్యమేలు
నేలికను నిన్ను నెడబాయఁ ♦ జాల' ననుచు. 119

చ. సరసిజపాళిఁ దుమ్మెదలు ♦ చాలుగ నిల్చినరీతి దేవరాట్
కరకమలంబులన్ దనదు ♦ కన్నులఁ గాటుక రేక దాకఁగా
హరు వమరంగ నొత్తుకొని ♦ యంగన కన్నుల నీరునించి 'యీ
విరహము నెట్లు ద్రోతుఁ దగ♦వే యెడబాయుట' లంచుఁ బల్కఁగన్.

చ. 'కలకంఠీమణి, పోయివచ్చెదఁ గటా♦క్షం బుంచు నామీఁద ని
న్నెలమిన్ నమ్మినవాఁడ'నంచు సురరా♦జిట్లాడినన్ మందహా
సలసద్వక్త్రము వాఁడఁ బ్రోడ మదిలో ♦ సంతాపమున్ గూడఁ జం
చలయై ధైర్యము వీడ నింద్రుఁగని వాం♦ఛాలోలితస్వాంతయై. 121

ఉ. 'నమ్మినదాన, నాతనువు♦నమ్మినదానను నీకు; నింక నే
నమ్మకచెల్ల, నన్ను విర♦హాగ్నికిఁ బాల్పఁజేసి పోవుటల్
సమ్మతమాయెనా, విడువఁ ♦ జాలితివా, యెటులైన నిన్ను నేఁ
బొమ్మనఁజాలఁ, జాలినను ♦ బొందినిఁ బ్రాణము లుండనేర్చునే.' 122

చ. అని యిటుపల్కి పల్కి బిగి♦యారఁగఁ గౌఁగిటఁ జేర్చిచేర్చి గ్ర
క్కున మధురాధరంబుచవిఁ ♦ గ్రోలుచుఁ గ్రోలుచుఁ బాకశాసనున్
బనుప నతండు మెల్లఁగను ♦ బ్రక్కలు చూచుచుఁ బోవుచుండఁగా
మునివరుఁడైన గౌతముని ♦ ముందఱ నింద్రుఁడు గానఁగాఁ దగెన్. 123

ఉ. కంటికి నిద్రసొక్కు మయిఁ♦గాడిన గాజులనొక్కు మోవిపై
నంటిన పంటిరక్కు సొగ♦సైనసిగన్ బలుచిక్కు గోటిచే
గెంటినముద్దుచెక్కు రహిఁ ♦ గీల్కొనియుండినవానిఁగా మదిన్
గంటున గౌతముండు తెర♦గంటిదొరం గని యాగ్రహంబునన్. 124

ఉ. చండకరాభుఁడైన ముని♦చంద్రుఁడు కోపముతోడ 'నోరి, యా
ఖండల, కండగర్వమునఁ ♦ గన్గొనలేక మదీయకాంత ను
ద్దండత నాదువేషమునఁ ♦ దద్దయుఁ బొందితి వట్లుగాన నీ
వండవిహీనుఁడై తిరుగు' ♦ మంచని మించి శపించె నెంచకన్. 125

చ. ఇటు శపియించి గౌతమ ము♦నీంద్రుఁడు వేగ నిజాశ్రమస్థలిన్
గిటుకునఁ జేరి కోప మెదఁ ♦ గీల్కొన భార్యను బిల్వ నంతలో
దిటవెడలంగ నంగన మ♦దిన్ దడబాటు చెలంగ మౌనిచెం
గట వినయంబుతో నిలిచెఁ ♦ గాళ్లకు నీళ్లను గొంచు గొబ్బునన్. 126

ఉ. ఆతటి నాలతాంగిని మ♦హాగ్రహదృష్టినిఁ జూచి 'యోసి, నీ
చేతిజలంబు లంటనిఁకఁ ♦ జెల్లునె యెంతటి జంతవే బలా
రాతిని గోరి కూడితివి ♦ రాతిరి జామునఁ గావునన్ బలా
రాతిశరీర మందు'మని ♦ రాజముఖిన్ సునఖిన్ శపింపఁగన్. 127

కం. గడగడ వడఁకుచుఁ దడఁబడి
వడఁతుక జడదారిచరణ ♦ పంకజములపైఁ
బడి 'శాప మెపుడు గడతున్.
నుడువు'మనన్ బలికెఁ గరుణ ♦ నూల్కొన మునియున్.

సీ. 'బలువైన రావణ♦ప్రముఖుల సమయింప
హరి జగద్విఖ్యాతి ♦ నతిశయించి
చెలువుగా దశరథ♦క్షితిభర్తకుదయించి
రామనామఖ్యాతి ♦ రహిని మించి
మునిమాట విని తాట♦కిని గీటణంగించి
యతని యాగము గాచి ♦ యతిశయించి
చతురుఁడై జనకరా♦జతనూజను వరించి
మహితకీర్తులుగాంచి ♦ విహితమెంచి

తే. గీ. మౌనివరుతోడ నివ్వన♦మార్గమునను
వరుస నిఁకమీఁద రాఁగల♦వాఁ డతండు
నిజ పదసరోజరేణుల ♦ నీదుశాప
మోచనము సేయఁగలఁ'డంచు ♦ మునియుఁబలికె. 129

ఉ. అంతట నమ్మహాత్ముఁడు ని♦జాశ్రమవాటిఁ బరిత్యజించి దు
ర్దాంతదురంతకేసరివి♦తాన మహోగ్రవరాహ వాహజి

ద్దంతురదంతిపన్నగముఁ ♦ దాపసబంధితవల్కశాటికా
త్యంతవిలాసభృన్నగము♦నౌ హిమవన్నగ [1]మొందె నయ్యెడన్. 130

వ. అంతఁగొంతకాలంబునకు, నిక్ష్వాకువంశపయఃపారావార రాకా చంద్రుండగు దశరథమహారాజేంద్రునకు, దేదీప్యమాన మార్తాండమండల సమధాముండును, వైరికాంతార ప్రళయకాలదావానల ప్రభాసముద్దాముండును, అనంతకళ్యాణగుణాభిరాముండును నై శ్రీరాముండు విష్ణుమూర్తి పూర్ణావతారంబున జనియించి, దినదిన ప్రవర్ధమానుండై యుండు నవసరంబునఁ దనుప్రభావిజితమిత్రుండగు విశ్వామిత్రుండు చనుదెంచి, దశరథానుమతంబున, విమతఖండనశౌండ భుజదండ సంపాదిత కీర్తిసాంద్రుండైన శ్రీరామచంద్రుని సకలాఘౌఘనివారణసుముఖంబగు మఖంబుఁ గాచుటకై తోడ్కొనిపోవ, నమ్మహావీరుండు, సింహశరభశార్దూల ప్రముఖ నానావిధ మృగయూధశరణ్యంబగు నరణ్యంబుఁ బ్రవేశించి, బహువిధకామరూప నిరాఘాటసంచారితశృంగాటక యగు తాటకన్ వధియించి, నీచులగు సుబాహుమారీచుల నుక్కడంగించి, యమ్మౌనియాగంబుఁ గాచి నిరంతర ప్రబోధధానియగు జనకరాజ రాజధానింగుఱించి వచ్చునప్పుడు, పురోభాగంబున విజ్ఞానసూర్యప్రభానిరస్తతముని గౌతముని యాశ్రమంబుఁ గనుంగొని.

చ. 'మునివర, యేమి యీవనము ♦ ముచ్చటగాఁ దగియుండియున్ వృథా
జనకులహీనమై యిరిణ♦సన్నిభమై కనుపట్టె నేమకో
వినియెద' నంచు వేఁడు రఘు♦వీరునికిన్ గుశికాత్మజుండు ప
ల్కెను మది సంతసం బలర ♦ లిలఁ దదాశ్రమ వర్తమానముల్. 132

ఉ. 'భూతలమందు మౌనికుల♦ముఖ్యుఁడు గౌతముఁ డంచనన్ దపః
ఖ్యాతిని దీటులేదన జ♦గత్త్రియమందుఁ బ్రసిద్ధినందు న
య్యాతనియాశ్రమం బిది మ♦హాశ్రమవారణకారణంబు రా
చూతువుకాని యందు నొక ♦ చోద్యము హృద్య'మటంచుఁ బల్కుచున్.

పా. 1. మొంటెఁ బొందుగన్

కం. ఆరాముని గౌతమముని
యారామస్థానవాటికై పిల్చి చహ
ల్యారామశాపహృతికై
యారామగతిన్ మునీంద్రుఁ డచ్చటి కేఁగెన్. 134

కం. అందందుఁ జూచుకొనుచును
ముందఱ రఘురాముఁ డపుడు పోవుచునుండన్
కెందమ్మిఁ బోలుపాదము
లందలి రేణువులు ఱాతి నందినయంతన్.* 135

మ. మృదువై మెల్లన కొంతసేపటికి నద్వ్యాప్తంబుగా నొచ్చుఁ బెం
పొదవన్ గొంత కరంగి సోఁకయగుచున్ బోల్పొంది యారాయి చ
క్కఁదనం బేర్పడి మోహనాకృతి చెలంగన్ యౌవనశ్రీ తగన్
సుదతీరత్నముగాఁగ నిల్చెను మదిన్ జోద్యంబు వాటిల్లఁగన్. 136

చ. వినయముగాను మౌనియలివేణియుదారపదారవిందముల్
కనుఁగొనుచున్ రఘూద్వహుఁడు గ్రక్కునఁ దాను నమస్కరించె నా
వనిత యొసంగు దీవనల వల్లను నుల్లము పల్లవింపఁగా
మునిమునిమీసముల్ కులుకు మోమున నవ్వు దొలంకుచుండఁగన్.

కం. ఆతఱిఁ గనుఁగొని బిరబిర
గౌతమముని యేఁగుదెంచి గౌరవమొప్పన్
నాతిసమీపముఁ జేరిన
యాతనిఁ గని రామచంద్రుఁ డానందమునన్. 138

*చెన్నపుర ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునఁగల D 386 నెంబరు వ్రాఁత ప్రతిలో గ్రంథ మింకనీద నీమిషమున ముగింపఁ బడినది.

కం. వనరాశిఁ జనించిన శ్రీ
వనజాక్షియొ యెదురుకొనిన వనదేవతయో
వనవసదావళిమించో
యని యెంచఁగ ఱాయిచెలువయై చెలు వగుచున్. 136

చ. ముదము మదిన్ బొసంగ "ముని♦పుంగవ, రాముఁడ నే' నటంచుఁ ద
త్పదయుగపాళికిన్ దనదు ♦ ఫాలము సోఁక నమస్కరించి యిం
పొదవఁగఁ జెంతఁజేరిన ర♦ఘూద్వహునిన్ ముని యాదరించి సం
పద లిగురొత్తఁ గౌశికుని ♦ పట్టు కనుంగొని పల్కెఁ బ్రేమతోన్. 139

సీ. "జంభారిమణి వృత్త♦సంభారదోస్తంభ
భూషణుం డకలంక♦భాషణుండు
భాషాపతి మహోను♦నీషావిశేషార్థ
ధారణుం డాప్తసా♦ధారణుండు
చండభానురుచి ప్ర♦చండకాండనిరస్త
తాటకుం డఖిలలో♦కాటకుండు
అధ్యాత్మవిద్యాని♦దిధ్యాసవిధ్యాత్మ
భావనుం డఖిలైక♦పావనుండు

తే. గీ. భద్రనిర్నిద్రుఁడగు రామ♦భద్రుఁ డస్మ
దీయ భద్రేభయానను ♦ దీనశరణ

---

సీ. మును దలమున్న లో ♦ మోహాంధకారంబు
వెనుక దీసినరీతి ♦ వేణి తనర
శాపరూప దినాంత♦చంద్రోదయము లీల
మొలకనవ్వుల ముద్దు♦మోము మెఱయ
బహుకాల పరిచితో♦పలత యంటిన మాడ్కి
కఠినవక్షోజయు♦గ్మంబు గులుక
తదదృశ్య భావంబు ♦ దవిలి పోవని కీవి
గను సన్నమౌ వలె♦గౌను వడక

తే. గీ. క్షితిని లోహంబులను పైఁడి ♦ చేయు స్పర్శ
వేది నొగి రామపాదార♦విందరజము
పూని శిల పైఁడి చేసిన ♦ నాన మించ
కాంత యై నిల్చె గౌతమ♦కాంత యపుడు. 137

చరణసరసిజ రేణులఁ ♦ బరమకరుణ
శాప మెడలింపఁ గంటివా ♦ తాపసేంద్ర!' 140

కం. అనిపలుకుచు గౌతమముని
తనచెంత మెలంగు రామ♦ధరణీశ్వరుతో
మనమున సంతసమందుచు
ననియెను సమ్మతముగాఁగ ♦ నపు డందఱికిన్. 141

సీ. 'బహుజన్మకర్మసం♦భవపాపజలరాశి
మరుభూమితలముగా ♦ మెఱయఁజేయు

---

కం. తన మునుపటి వృత్తాంతము
మునిపతి వీరలకుఁ దెలుప♦ముప్పో యనుచున్
ఘనలజ్జానతముఖి యా
వనితకు రఘునందనుండు ♦ వందన మిడియెన్. 138

తే. గీ పెండ్లికొడుకవు గమ్మని♦ప్రేమ మాని
రామ దీవించి శ్రీ రఘు♦రామవిభునిఁ
బూజ గావించు చున్న న♦ద్భుతము గాఁగ
గౌతముఁడు వచ్చి యా రాముఁ ♦ గాంచి పొగడె.139

(ఖడ్గబంధము)

కం. సారధరధీర రఘువర
పారదధర నీరజారి ♦ భవకీర్తిరమా
మారీచమదవిరామా
నీరదనిభకాయ రామ ♦ నృపతిలలామా! 140

ఉ. శ్రీరఘురామ నిన్ను నుతి ♦ సేయఁగ నెంతటివాఁడ నేను నీ
పేరు దలంచి నంత నతి ♦ భీకరదుష్కృతముల్ దొలంగు నీ
చారు పదాబ్జసంగతిని ♦ సంభవ యాట పవిత్ర గాదె భా
గీరథిలీల విభ్రమర♦కేళిని నంచు నహల్యఁ గైకొనెన్. 141

నజ్ఞానపటలఘూ ♦ రాగాధకూపంబు
నెడలేక పూడ్చి యే♦ర్పడఁగఁ జేయు
నమితదుర్మోహకృ♦త్రిమరత్నదీధితుల్
మరలనీయక క్రమ్మి ♦ మఱుఁగుచేయు
నప్రాప్తితాపకృ♦త్ర్యసన దిక్కోణంబు ?
తెలియకుండువిధంబుఁ ♦ గలుగఁజేయు

తే. గీ. నబ్జసంభవముఖ నిఖి♦లామరాళి
మస్తకకిరీటవిన్యస్త ♦ మణిగణఘృణి
ఘటితభవదీయచరణ పం♦కజపరాగ
రాజి వర్ణింప నెవరిత♦రంబు రామ! 142

ఉ. ఖ్యాతిని నీదుపాదకమ♦లాంచితరేణురజంబుఁ దాల్ప ని
శ్చేతనమైన ఱాతి కొక ♦ చేతన మబ్బె నటన్న నట్టిచోఁ
జేతనవృత్తినున్నసుర ♦ సిద్ధులు సాధ్యులు మాళిఁ దాల్చి యే
రీతిగ నుందురో తెలియ♦రెవ్వరు రామ,భవత్పదంబులన్.’ 143

కం. ఇటు కొనియాడుచు నుండిన
జటిలుని వీడ్కొనుచు రామ♦చంద్రుఁడు మిథిలా
పుటభేదనమున కేఁగెను
తటకాపడి కౌశికుండు ♦ తనతోఁ రాఁగన్. 144

---

మ. దివి వర్షించె ప్రసూనవర్ష మపు డం♦దెల్ మ్రోయ నాడెన్ సుధా
శివధూబృందము దివ్యదుందుభులు మ్రో♦సెన్.........
.................................................
................................................. 142

తే. గీ. అంత సంతుష్టచిత్తుఁడై ♦ యక్షపాదుఁ
డధిప కూకుదమయ్యె నీ ♦ యంఘ్రిపద్మ
మనుచు పొగడుచు కాంతఁదో♦డ్కొనుచుఁ జనియె
సంతసిల్లుచు మునికుల♦చంద్రుఁడపుడు. 143

ఉ. అంతటఁ బ్రేమ గౌతముఁ డ♦హల్యయు నుల్లము లుల్లసిల్లఁగాఁ
జింతలు దీఱ నొండొరులుఁ ♦ జిత్తజుకేళికళావిలాసముల్
వింతలుగా ఘటించుచును ♦ వేడుకతోడుతఁ గూడియుండి యిం
తంతనరాని సౌఖ్యముల ♦ నందిరి ముచ్చటమీఱ నెప్పుడున్. 145

కం. ఈకథఁ జదివిన వినినన్
ప్రాకటముగ వ్రాయఁగనిన ♦ బహుసంపదలన్
గైకొను మనుచున్ వారికి
శ్రీకరుఁడగు రంగవిభుఁడు ♦ ప్రేమ నొసంగున్. 146

---

కం. అని శ్రీ వైశంపాయన
మునిముఖ్యుఁడు దెలుప విని ప్ర♦మోదాన్వితుఁ డై
జనమేజయమహిపాలుఁడు
అనురాగము పొందు చుండె ♦ ననవరతంబున్. 144

ఉ. కౌస్తుభచారువక్ష సిత♦కంజదళాక్ష కళిందకన్యకా
నిస్తులనీలవర్ణ కమ♦నీయ చరాచరమాననీయ ప
ద్మాస్తనకుంకుమాంక నవ♦ మండన దానవదర్పఖండనా
కస్తురిరంగ రంగపుర♦కైరవపూర్ణకురంగలాంఛనా! 145

కం. కుందారవిందసుందర
మందారసుకీర్తిహార ♦ మహితవిహారా
వందారుజనాభీప్సిత
బృందారకరత్న సమర♦భిన్నసపత్నా! 146

మత్తకోకిల.

చంద్రపుష్కరిణీతటాంచల ♦ చార చారణసన్నుతా!
మంద్రనీరదమాలికాసుకు♦మార మారశతోపమా!
సాంద్ర సత్కరుణానవామృత♦సార సారసలోచనా!
ఇంద్రచంద్రదినేంద్రముఖ్య సు♦రేశ యీశవిభావితా! 147

[ గద్యము—సమానమే. ]

శా. కస్తూరీతిలకోజ్జ్వలస్మితముఖా ♦ కైవల్యలక్ష్మీసఖా
హస్తోదంచిత శంఖచక్రరుచిరా ♦ హస్తీంద్రరక్షాపరా
అస్తోకామృతవర్షి వేణునినదా ♦ యానందలీలాస్పదా
త్రస్తాస్తోకజనాభయప్రదకరా ♦ ధారాధరశ్రీకరా! 147

కం. సారఘనసారనవకా
శ్మీరపటీరాంగరాగ♦శీతలతటరా
ధారమణీకుచదుర్గయు
గారోహవిహారలీల ♦ యదుకులబాలా! 148

మాలిని
దళితవిపులమాయా ♦ ద్రావిడామ్నాయగేయా
జలరుహదళనేత్రా ♦ సవ్యసాచీష్టమిత్రా
బలివిభవవిరామా ♦ భానువంశాబ్ధిసోమా
కలశజలధిశాయీ ♦ కామితార్థప్రదాయీ! 149

* గద్య *

ఇది శ్రీమత్పాండ్యమండలాధీశ్వర శ్రీ విజయరంగ చొక్కనాథ మహీ
నాథకరుణాకటాక్ష సంపాదిత గజతురంగ మాందోళికా ఛత్రి చామర
విజయదోహాళ కాహాళ భూరిభేరీబిరుదధ్వజ ప్రముఖాఖిల
సంపత్పారంపరీసమేధమాన సముఖ మీనాక్షీనాయక
తనూభవ శ్రీమీనాక్షీదేవీ కటాక్ష
లబ్ధకవితాసాంప్రదాయక వేంకట
కృష్ణప్పనాయక ప్రణీతంబైన
యహల్యాసంక్రందనంబను
మహాప్రబంధంబునందుఁ
దృతీయాశ్వాసము.

సర్వంబును
సంపూర్ణము.

అనుబంధము:—౧

# రాధికాసాంత్వనము.

[ ఏకాశ్వాసము ]



సముఖ

వేంకట కృష్ణప్ప నాయకుడు

శ్రీరస్తు

# రాధికా సాంత్వనము





శ్రీ రాధామణిలోలా
ధారాధరనీలనీల ♦ దైత్యవిఫాలా
వారధిశయన సుశీలా
శ్రీ రాజదురోవిశాల ♦ శ్రీగోపాలా.

ఉ. వెలయ నభీష్ట మిమ్మనుచు ♦ వేంకటకృష్ణనృపాల శేఖరుం
డిల రసికావతంసులకు ♦ హృద్యముగా మృదుమాధురీ రసా
కలిత చమత్క్రియాకలనఁ ♦ గల్పనగా రచియింపనొప్పు ని
శ్చలమగు రాధికారమణి ♦ సాంత్వనముం గృతి సల్పుమంచనెన్. 2

తే. గీ. అవధరింపుము స్వామి ది ♦ వ్యగుణభూమి
యని పరీక్షిన్మహారాజుఁ ♦ గని శుకుండు
వినయసంభ్రమ భయభక్తు ♦ లినుమడింప
నవలి వృత్తాంత మిట్లని ♦ యానతిచ్చె. 3

కం. ఇంపై వనరుహజావా
సంబై ద్విజరాజ వైశ్య ♦ జననివహంబై
డంబై తగు బహుబలసే
వ్యంబై ద్వారాపురంబు ♦ హరిధామంబై. 4

తే. గీ. అచట నెప్పుడు కాపుర ♦ మై వసించు
దేవదేవుఁడు శ్రీకృష్ణ ♦ దేవుఁ డగుచు
రాధికా సత్యభామలు ♦ రాజసమునఁ
బ్రేమఁ గొలువంగ జగదభి ♦ రాముఁ డగుచు. 5

తే. గీ. ఇట్టు లుండంగ నత్తవా ♦ రేఁగు దెంచి
దేవకీసుతు సత్యను ♦ భావమలరఁ
దోడుకొనిపోవ వారలఁ ♦ ద్రోవఁ బనిచి
రాధ తన కేళికామంది♦రంబుఁ జేరి. 6

వ. చిలుకం గని. 7

కం. అచ్చట నడిచే వింతలు
ముచ్చట లెల్లయునుఁ దెలిసి ♦ ముద్దులుగులుకన్
అచ్చ్యుతునిఁ దోడితెమ్మని
యచ్చిలుకనుఁ బనిచి రాధ ♦ యటమటపడఁగన్. 8

చ. చిలుకవజీరుఁడంతటను ♦ జిందరవందర సేతఁనంచు నా
చిలుకలకొల్కి పైఁ గదిసి ♦ చివ్వలికవ్వ లిడంగ జాతిపెన్
జిలక లకోరికోల లటు ♦ సెందను తుమ్మెదనారి మ్రోయఁగాఁ
గలికి మెఱుంగుగుబ్బలను ♦ ఖంగు ఘణీలు ఖచిక్కు రింగనన్. 9

కం. ఇట్లేసిన మది ఝల్లని
పల్లెల్లను సడలి రాధ ♦ భయ మందుచుఁ దా
నిట్లని పలుకఁ దొడంగెను
పుల్లంబై చుట్టు నుండు ♦ పొలఁతులతోడన్. 10

ఉ. శౌరినిఁ బిల్వఁగాఁ జనిన ♦ చక్కనికీర మదేల రాదు యే
దారినిఁ జన్నదో నడుమఁ ♦ దారెనొ చేరెనొ లేదొ గోపికా
జారునిఁ గానదో కనెనొ ♦ చక్కఁగ నావెత విన్నవించెనో
సారెకుఁ జేక, శౌరి నుడి ♦ [1]చక్కెర యుక్కెర మెక్కి సొక్కెనో! 11

సీ. తడవుఁ జూచిన దృష్టి♦దాకునో యని వాని
నునుమోముఁ గనులారఁ ♦ గనఁగనైతి
గబ్బిగుబ్బలు సోఁకఁ ♦ గందునో యని వాని
ఱొమ్మునఁ గసిదీరఁ ♦ గ్రుమ్మనైతి

పా. 1. చక్కెరయిచ్చెనొ.

చలిగ నూచిన తేనె ♦ లోలుకునో యని వాని
యమృతంపు కెమ్మోవి ♦ నానసైతి
విడబడి యేలిన ♦ బడలునో యని వాని
గదిసి నా మనసారఁ ♦ గలియనైతి

తే. గీ. నొచ్చునంచును చెక్కిలి ♦ నొక్కనైతి
నలఁగునని మేను కౌఁగిట ♦ నలమనైతి
నందసుతు ప్రేమ సత మని ♦ నమ్మియుంటి
నిప్పు డీరీతి నడచు నం ♦ చెఱుఁగ నైతి. 12

సీ. తాను నామోవాని ♦ తనమోవి బదులిచ్చి
'తెఱవ! నీదు ఋణంబు ♦ తీరె'ననును
నేను పైకొనఁగానె ♦ తాను పైకొని యేలి
'చెలియ! మేలుకు మేలు ♦ జేసి'తనును
నేను జెక్కిలినొక్కఁ ♦ దాను జెక్కిలి నొక్కి
'యింతి! యీడుకునీడు ♦ యిదిగొ'యనును
నేను ముద్దిడఁగానె ♦ తాను ముద్దిడుకొని
'మదిరాక్షి! బదులుకు ♦ బదులు'యనును

తే. గీ. గడియగడియకు నొక వింత ♦ గడన సేయు
వేళవేళకు నొక్కొక్క ♦ లీల నుండు
పారమెఱుఁగని ముద్దుల ♦ శౌరి చిన్న
లెన్ని యెన్నని తలపోతు ♦ నెట్లుసేతు. 13

కం. ఆమాలిమి యాతాలిమి
యామేలిమి యావినోద ♦ మాగళరవముఁ
ఆమాటలు నా నీటులు
యామీటులు నాటపాట ♦ లతనికె చెల్లుఁ. 14

సీ. మదదంతిపై నెక్కి ♦ మావటీల్ బిలువంగ
విచ్చలవిడిఁ జొచ్చి ♦ వచ్చునటుల

సాంబ్రాణితేజీపై ♦ సాహిణీల్ వొగడంగ
బట్టానుఁ జేపట్టి ♦ వచ్చునటుల
వేట లందమ్మున ♦ విచ్చుకత్తులవారు
మెచ్చఁగా దులదుల ♦ వచ్చునటుల
గిలుగుపావలు మెట్టి ♦ చెలికాండ్లు వెంటను
వారణంబునఁ బూని ♦ వచ్చునటుల
తే. గీ. బుడత లిరువంకఁ దెలిజేకు ♦ మడుపు లీయఁ
గొనుచుఁ బెండెముఘల్లుఘ♦ల్లనఁగ నాడు
పడకటిలు సేరఁగా శౌరి ♦ వచ్చు దారి
తోఁచునే గాని మఱి యేమి ♦ తోఁచ లేదు. 15

సీ. కురు లంటగా రాకు ♦ గుట్టువోయెడి నన
చీకాకుగాఁ దీసి ♦ చిక్కువఱచు
కెమ్మోవి నొక్కకు ♦ గేలిసేయుదురన
[1]కసిమీఱఁ బలుమొన ♦ గంటుసేయు
వలుదగుబ్బలు ముట్ట ♦ వలదు నవ్వోరన
క్రొత్తనెత్తురు గ్రమ్మ ♦ గోరు లుంచు
సరగఁ బోవలెనింక ♦ బరులుసూచెదరన
*మంత్రప్రయోగం.* ఝాములతరబళ్లు ♦ జాగుసేయు
తే. గీ. పలుకవద్దన్నఁ బావురా ♦ పలుకు వలుకు
అత్తనేగాని యనఁ బ్రీతి ♦ హత్తె నను
నట్టి నా ప్రాణవిభుఁ బాసి ♦ యకట [2]మేన
జీవమునుఁ బోక [3]యిట్లుండె ♦ సిగ్గులేక. 16

సీ. విభునిఁ బాసితి నంచు ♦ విని సంతసం [4]బుండు
తోయజాక్షుల బొమ్ముఁ ♦ ద్రొక్కునటుల
హామికె స్రుక్కెనా ♦ యంచుఁ దలాడించు
మించుబోణుల తల ♦ మెట్టినటుల

---

పా. 1. కళమీఱి పా. 2. మానజీవములు పా. 3. నల్లాడె పా. 4. బందు

హరి రాధ నేలుట ♦ యది యొక కథయను
గొమ్మల నాలుకల్ ♦ గోసినటుల
పరగ నల్ గనుఁగొని ♦ కనుగీటి నవ్వేడి
మోహనాంగుల కన్నుఁ ♦ బొడిచినటుల

తే. గీ. మాధవునిఁ జేరి సామి ర ♦ మ్మనుచుఁ జీరి
గెలివి యొనగూర్చి నిండు కౌఁ♦గిటను జేర్చి
దయలు దైవార యెడలేని ♦ తాపమార
మేలిమినిఁ గూడఁగలదె యీ ♦ మేని తోడ. 17

వ. అని యిటుల జవరాలు విరాళిం జెందు సమయంబున. 18

తే. గీ. హరు నుదుటి కంటిమంటల ♦ నంటబెదరి
తుళ్లి రాతునుఁ బడవైచి ♦ మళ్లివచ్చు
తియ్యవిలుకాని సాంబ్రాణి♦తేజి యనఁగ
గగనమార్గంబునను దోఁచెఁ ♦ గలికిచిలుక. 19

కం. ఇటు లేతెంచిన చిలుకన్
గుటిలాలక చూచి లేచి ♦ కులుకుచుఁ జిలుకా!
యిటు రమ్మ ర మ్మటంచన
దిటవున ముంజేత వాలె ♦ దీనత దోఁపన్. 20

తే. గీ. అటుల ముంజేతిపై వ్రాలు ♦ నట్టి ముద్దు
చిలుక నటు దువ్వి చిలుకల♦కొలికి పలికె
మోవి కంపింప ముక్కెర♦ముత్య మదర
గప్పురపుతావి గుప్పునఁ ♦ గప్పుకొనఁగ. 21

ఉ. దేవకిచిన్నకుఱ్ఱ వసు♦దేవునికూన యశోదపట్టి నా
దేవుఁడు నందకందు బల♦దేవునితమ్ముఁడు గోపగోపికా
జీవనజీవనంబు యదు♦సింహము శౌరి కిరీటిబావ శ్రీ
దేవియనుంగుజోడు వస♦తిన్[1]వసియింపఁగఁ గంటె కీరమా. 22

పా. 1. వసతింపఁగఁ గంటె కీరమా.



సీ. చురుకుఁ జూచినఁ గందు ♦ సుకుమారు నెమ్మేను
విరహాజ్వరంబునఁ ♦ జొరవకుండ
నిట్టూర్పు లోర్వని ♦ నీలవర్ణుని పైని
సోమరి 1వలిగాలి ♦ సోఁకకుండఁ
జనుములుక్కు 2లారని ♦ శౌరివక్షంబున
విరిశరంబులు చాల ♦ నొరయకుండ
మణితముల్ వినలేని ♦ మాధవు వీనుల
మరు చాపటంకృతుల్ ♦ 3నెరయకుండ
తే. గీ. నెన్నఁ డిటువంటి కడగండ్ల ♦ నెఱుఁగనట్టి
విభుఁడు వెన్నెలచిచ్చులో ♦ వేఁగకుండ
4మనల కెప్పుడు నాస్వామి ♦ మన సెఱింగి
సరసు నెనయునె కీరమా ♦ సత్యభామ. 23

తే. గీ. ఎంతవేఁడిన బదు లాడ ♦ వేమి చిలుక
కాలగతు లెట్లు లున్నవో ♦ గడచినామె
కాఁగలవి కాకమానవు ♦ గాక తెలుపు
చల్లఁ గొనవచ్చి ముంత దాఁచంగ నేల? 24

వ. అనిన విని చిలుక యిట్లనియె. 25

తే.గీ. అనినవిని చిల్క యుల్క పేరల్క చిల్క
పలికె నిట్లని చిలుకల♦కొలికి తోడ
నన్నుతలమిన్న విను మొన్న ♦ నన్ను నీవు
వనజనాభుని దోడి తె ♦ మ్మనఁగఁబోయి.* 26

కం. తెలివా!యే మని చెప్పుదు
హరి యున్నగృహంబు చేరి ♦ యటఁ జూతుఁ గదా
సురతోద్యుక్తుల సత్యా
మురహారులఁ జూచి ఖేద♦మోదము లయ్యెన్. 27

పా. 1. వలిగాడ్పు పా. 2. లానని పా. 3. పరయకుండ
పా. 4. కనులఁగప్పక * ఈపద్యము పరిషత్ప్రతిలో లేదు

వ. అది యెట్లంటేని. 28

సీ. పన్నీరుమేరువల్ ♦ బాగాలతట్టలు
కలపంబుగిన్నెలు ♦ గందవాళ్లు
ముడిపూలపొట్లముల్ ♦ పునుఁగుకరాటముల్
జవ్వాదిగిండ్లు లా♦క్షారసంబు
అందంపుసొమ్ములు ♦ యత్తరుచెంబులు
కుంకుమపింగాళ్లు ♦ కుసుమతతులు
కపురంపుకోపులు ♦ కస్తూరివీణియల్
కట్టువర్గంబులు ♦ చుట్టుఁదనరు
తే. గీ. చలువచప్పర కోళ్ల మం♦చంబు లోనఁ
జెంపబిళ్లల తలగడల్ ♦ జెలఁగ దిండ్లు
బటువు [1]మెఱుఁగులుఁ గలపూల♦పాన్పుమీఁదఁ
దమకమున సత్యా హరియునుఁ ♦ దగ పెనంగి. 29

సీ. కొసరుపల్కులఁ గమ్మి ♦ గోటికత్తులఁ జిమ్మి
కాశలోఁచై వేసి ♦ కదియఁదీసి
కర్ణాత లాగించి ♦ కౌఁగిట బిగియించి
సరిబిత్తరుల నొత్తి ♦ సొగనెత్తి
కల్లంబునకు వచ్చి ♦ కలికి యానని మెచ్చి
మెఱుఁగుఁజెక్కులఁ గొట్టి ♦ కురులుబట్టి
తొడకంబములనాని ♦ తోపునాకులఁబూని
సందుఁజేసుకనొక్కి ♦ చాలదక్కి
తే. గీ. యదలుపులుఁ బొగడికలు నెయ్యంపుతిట్లు
గళరవంబులు దుడుకులు ♦ చెలఁగ సత్య
మాధవుండును గడిదేరి ♦ మరునిసాముఁ
జేసి చెలరేగి నెఱహాయిఁ ♦ జెంది మఱియు. 30

పా. 1. టరుగులు

సీ. కిలకిలనవ్వులు ♦ గిలిగింతలును బంధ
భేదపురవములు ♦ వింతవగలు
పావురాపలుకులు ♦ వాతెఱనొక్కులు
చిరుఘుమూకారముల్ ♦ జిలుఁగుతిట్లు
దురుసు పైసరసముల్ ♦ దొంతరముద్దులు
బిగికౌఁగిలింతలు ♦ బేరజములు
కొనగోటిమీటులు ♦ కోరింపుఁబలుకులు
కొనరుకనొబ్బమమ్ముల్లు ♦ కురుచసన్న
తే. గీ. తార సేబాసు మేలు భ♦ల్లారె ఖూబు
అహహా తడబడ కెడమీక ♦ యాయెనాయె
విడక విడువక నడుమని ♦ నుడువు లపుడు
చెల్లఁబో యేమి సెప్పుదుఁ ♦ గొల్లకొల్ల. 31

కం. నానావిధభావాకర
మానసజాతంబు జాత ♦ మహిమార్ణవమై
కానికతరమై యాసుఖ
మానందబ్రహ్మమైన ♦ హరి మైమఱచెన్. 32

చ. పరవశుఁడైన శౌరిఁ గని ♦ పంకజలోచన రాధికామణిన్
దొరఁగు మటంచు [1]వేఁడుకొనెఁ ♦ ద్రోయక యాతఁ డొసంగె నమ్మికల్
పురుషుల కెట్టి సత్యములు ♦ పూనిక లేదవి పుణ్యమెద్ది నీ
మరు లిటు కొండలై పెరుగు ♦ మాత్రమె కాని కురంగలోచనా! 33

వ. అని యిట్లాడు చిలుకనుం జూచి. 34

శా. ఏమేమే వెర పింత లేకయె భళా ♦ హేమాంగి యి ట్లాడెనా
యీమాటల్ విని మంచి దంచనియెనా ♦ యీధూర్తుఁడున్ మించె హా
రామా! యట్లనె కాని మంచిపని మే ♦ లాయెన్ మరేమాయె నా
భామారత్నము దానుఁ గూడి సుఖమై ♦ వర్ధిల్లినన్ జాలదే. 35

---

పా. 1. వేడుకొనఁ ద్రోయక

సీ. మఱచెనో నాచేత ♦ మణితోక్తు లన్నియు
బలుక నేర్చిన నాఁటి ♦ పల్కరింపు
ఎంచఁడో నాచేత ♦ నెల జంత్రిగాత్రింబు
లభ్యసించిననాఁటి ♦ యనుసరింపు
తలఁచఁడో నాచేత ♦ తగుదేశ్యగుజరాతి
వితమెఱింగిననాఁటి ♦ వేఁడికోళ్లు
వీడెనో నాచేత ♦ వెడవిల్తుశాస్త్రింబు
తెలియఁబూనిననాఁటి ♦ తెరవుమరపు

తే. గీ. గణన సేయఁడొ మరుసాము ♦ [1]గవనములకుఁ
దాను నాచేతఁ బడిన బె♦త్తంపు పెట్లు
పరులు గని కేరి నవ్వ ద♦బ్బర మురారి.
మాయలకె పొంగె సత్యభా♦మా లతాంగి. 36

తే. గీ. నిన్నఁ గుప్పయు నేఁడాళ్లు ♦ నెలఁత తాను
కోరి మామిాఁదనే చేసె ♦ కారుబారు
ముక్కుమచ్చలు మానక ♦ మునుపె బిరుదు
పిచ్చుకలతోడ కొట్లాడ ♦ వచ్చినట్లు. 37

తే. గీ. మంచి పామును పాలోసి ♦ పెంచినట్లు
ఇంత తెలియని దాని నే ♦ నంతరించ
తాను పెంచిన పోట్టేలు ♦ తఱిమితఱిమి
నన్నఁబడు సామ్యమాయెనే ♦ చిన్నిచిలుక. 38

కం. అటుకులఁ దిన్నట్టేనా
కడుపునఁ గుట్టెత్తి నపుడు ♦ కానీ తానే
కడఁ జనునో వంటయింటను
నుడిఁ బడు కుందేలు జేసె ♦ చూడుము చిలుకా. 39

పా. 1. గదనములను

తే. గీ. పాల మెఱుంగని నిన్నటి ♦ పుళికెపడుచు
ఇంత సేసిన నే జేయ ♦ నెంతగాదు
వేలు వాచిన ఱోలంత ♦ వెలిగె ననిన
ఱోలు వాచిన నది యెంతఁ ♦ బోలుజెపుమ. 40

వ. అని మఱియుఁ జిలుకతో నిట్లనియె. 41

తే. గీ. నీవు చెప్పినమాట యొ♦క్కింత యైనఁ
జెవినిఁ బెట్టక దానినే ♦ చేరదీసి
మానిసిని జేసినందుకు ♦ మగుడ నిపుడె
ఫలము తోడ్తోడఁ గైవశం ♦ బాయెఁ గదవె. 42

తే. గీ. తన్నుఁ గట్టను దారంబు ♦ తానె గొనిన
జాడ నిటు దెచ్చి గోపాలు♦తోడఁ గూర్చి
బాల దీనికిఁ జేసిన ♦ మేలి మెల్ల
బూడిదలో చేయు హోమమై ♦ పోయెఁ గదవె. 43

ఆ. వె. చెలఁగి కాలి మెట్లు ♦ తల కెక్క చందాన
నాదు క్రింది బుడుత ♦ నన్ను మించె
వెలయ గ్రుడ్డువచ్చి ♦ పిల్లను బెదరించె
నెంత త్రుళ్లనెద్దు ♦ గంతమోసు! 44

తే. గీ. కాని పదరకు మిఁకమీద ♦ దాని మోముఁ
గానవద్దని శౌరిని ♦ పట్టికట్టి
బింకములుకూల నరకాలఁ ♦ బెట్టి నేల
రాయకున్నను నాపేరు ♦ రాధకాదు. 45

తే. గీ. ఒదుఁగుచును నంగనాచియై ♦ యున్న దీనిఁ
దొలుత రుద్రాక్షపిల్లిగాఁ ♦ దెలియనైతిఁ
దేలు నిప్పులఁ బడకుండఁ ♦ గేల నెత్త
మీటకుండునె విసమెక్కి ♦ మిట్టిపడగ. 46

ఆ. వె. నక్క యురుల లోనఁ ♦ జిక్కుకొన్న విధానఁ
గోరి మనము జేసి♦కొన్న కథలు
పేగులోని తీఁట ♦ విధమాయె ననరాదు
అత్తకోక తొలఁగి ♦ నటులఁ జిలుక. 47

తే. గీ. అత్తవారింటి కప్పుడె ♦ హరిని బంపఁ
దనకు గోరంత యైనను ♦ మనసులేదు
నందుఁ డనుపఁగఁ గని మన♦మందుకెల్ల
[1]నులికి తడసేయరాదని ♦ యుంటి గాని. 48

వ. అని మఱియు. 49

సీ. ఆశుకవిత్వంబు ♦ లల్లితేనే సరా
చిత్రప్రబంధంబు ♦ చెప్ప వలదె
పదచాళిరాగముల్ ♦ పాడితేనే సరా
హితవొప్పవర్ణంబు ♦ లెత్త వలదె
గోటిచేతను వీణె ♦ మీటితేనే సరా
కొంచక రాల్ గరఁ♦గించ వలదె
అభినయ దేశ్యంబు ♦ లాడితేనే సరా
యెత్తిన బిరుదు చె♦ల్లింప వలదె

తే. గీ. వింతవింతగఁ గలసిన ♦ నంత సరియ
యెమ్మెకాని మనోభావ ♦ మెఱుఁగవలదె
యేమినేరని మున్నటి ♦ యింత మొటికె
నన్ను విడనాడఁ గోరెఁగా ♦ చిన్నిచిలుక! 50

కం. అన విని శుక మిట్లనియె
వనితా యేమందుందాని ♦ [2]పగలో తెవులో
మినుకో గెలివో తెలివో
విను వెన్నకుఁ బండ్లు వచ్చు ♦ వితమాయెఁ గదే. 51

పా. 1. నుదికి. పా. 2. త్రుళ్లో.

తే. గీ. చూపులోపల నొకవింత ♦ చూపుతళుకు
నడుపులందుల నొకవింత ♦ నడుపు బెళుకు
యుండుయునికిని నొకవింత ♦ నుండుకులుకు
వచ్చెఁ గదవమ్మ [1]సత్యభామకును నేఁడు. 52

తే. గీ. లేని పట్టింపు లెల్లను ♦ బూని చాన
నేను యెదురైన నింతైనఁ ♦ గాని చూడ
దల్పునకుఁ గల్మి వచ్చిన ♦ నర్ధరాత్రి
గొడుగుఁ బెమ్మన్న కతగాను ♦ కోమలాంగి! 53

వ. అను కీరవాణి కడ్డంబువచ్చి మధురవాణి యగు నొక్కవిరిబోణి మధుపవాణి యగు దొరసానినిం జూచి నెఱజాణతనంబునం దలయూచి చే సాచి సమయోచితంబుగా నిట్లనియె. 54

కం. నిన్నెఱుఁగు నెదురు నెఱుఁగును
దన్నుం దనమట్టు నెఱుఁగు ♦ దామోదరుఁడా
కన్నియకై నిను వీడెన
టన్నఁ గ మఱి శౌరినగరె ♦ యహాహా జనముల్. 55

ఆ. వె. తగరు కొండమీఁదఁ ♦ దాఁకఁ గోరినదారి
నెదురుఁ దన్నుఁ దెలియ ♦ కింతవలికె
నింతమీను వచ్చి ♦ యంతమీనును మ్రింగె
[2]నటులు సేయకున్న ♦ నళుకరమ్మ. 56

ఆ. వె. కుట్టఁదేలు కుట్టకున్నఁ [3]గుమ్మరపుర్వు
తోసి రా జటంచుఁ ♦ జేసె చెలియ
దాని వేలుదీసి ♦ దాని కన్ బొడచిన
నటులు సేయకున్న ♦ నళుకరమ్మ. 57

పా. 1. మనయిళావనిత కిపుడు. పా. 2 నవిద బుద్ధి వెనుక నుండుఁగాదె.
3. పా. గుమ్మరబూచి

కం. మును నీ విచ్చిన చనువున
నిను నిట్టులు తూలనాడె♦నేనిఁక వినుమా
తన యింటి దీప మంచని
కని ముద్దులుపెట్ట మూతి ♦ కాలకపోనే? 58

కం. నిన్నుండి మానిసై తా
నిన్నే వెలిసేయఁబూనె ♦ నెలఁత భళారే
కొన్నంగడిలోనే విను
మన్నాడే మారుబేర ♦ మానే చెలియా! 59

ఆ. వె మాయదారి మాట ♦ మది నిజంబని యెంచి
పోలఁతి నమ్మి నాన ♦ వోసుకొనియెఁ
దగిలినాను తగులుఁ ♦ దప్పినఁ దప్పును
నాతి వెఱ్ఱివాని ♦ చేతి రాయి. 60

తే. గీ. పడఁతి మును దెల్పెగా పదిం ♦ బదియుగాను
దాని వినయంబు పోకిళ్లుఁ ♦ దగ నెఱింగి
మానిసిని జేయ వలువదు ♦ దీనిఁ జేర్చి
తెలియ నిది మేఁకవన్నియ ♦ పులి యటంచు. 61

వ. అనిన విని రాధ యిట్లనియె. 62

తే. గీ. దాని నింతయు నననేల ♦ తగవుమాలి
తప్పు తంటల కోడఁబడు ♦ దానవారి
ననవలయుఁ గాని 1తిననిండు ♦ దోనకుఁ దీసి
యేయువాఁ డేయ నంబేమి ♦ సేయునమ్మ. 63

కం. కలలో నైనను బాయక
కలకాలం బున్న విభుఁడు ♦ కసుగాయకునై
పలుచనఁ జేసె నటన్నను
జెలియా! మగవారి నమ్మఁ ♦ జెడ్డదిసుమ్మా! 64

---

పా. 1. తెగనిండ



కం. నెరతనముడిఁ గింటింటను
దిరుగుచు బతిమాలు వారికిఁ ♦ దెలివలు గరవా
తిరిపెం బెత్తెడు వానికిఁ
బెరుగుం గూ డేమిబోఁతి ♦ పృథుబింబాస్యా! 65

తే. గీ. నందసుతుఁడు మున్ను ♦ నామీఁది ప్రేమచే
నొకటిసేయఁ[1]బూని ♦ యొకటి సేయు
నత్తమీఁద కన్ను ♦ లంగడిలో చేతు
లాయె ననుచుఁ దెలియ ♦ లరసి నవ్వ. 66

సీ. కీరవాణులచేతఁ ♦ గీల్లాకు పంపితే
శిరసావహించునో ♦ సరసిజాక్షి!
నాతి యెవ్వతెయైన ♦ నా మేలువేఁడిన
గను లెఱ్ఱసేయునో ♦ కంబుకంఠి!
యిల నాదుకోసమై ♦ యెట్టివారలనైనఁ
[2]దెగజూడఁ దలఁచునో ♦ చిగురుఁబోణి!
యేఁజూచిచూడక ♦ యే మాట లాడిన
మాటాడ నెంచునో ♦ మందగమన!

తే. గీ. తడవు పైకొని [3]వీరర♦తంబు సలుపఁ
జూచి సైరింపజాలఁడో ♦ సుందరాంగి
యట్టి శౌరిట్లు కడగండ్లు ♦ బెట్టె ననినఁ
దిరుగ బ్రతుకంగవలెనఁటే ♦ తెలుపు [4]మగువ!! 67

సీ. ఇటులుండువారల ♦ కెడయికల్ వచ్చినఁ
దనువులు నిలుచునా ♦ యనినమాట
నినుఁ బాసి [5]యడివార♦లను విలోకించినా
కనుతాళియుండలే ♦ దనినమాట

పా. 1. బోయి 2. పా. దెగనాడ 3. పా. వీరాయితంబు పా. 4. మకట.
పా. 5. యెట్టివారిని విలోకించినా.

నీ పొత్తు మాని నే ♦ నెట భుజియించిన
యాహార మింపుగా ♦ దనినమాట
యలుకచే నీవు యా♦వలిమోముఁ జేయ నా
కనులకు నిదుర రా♦దనినమాట

తే. గీ. కరుణ దైవార బిగియారఁ ♦ గౌఁగిలించి
మానినీమణి వేయిజ♦న్మాల కైన
వినుము నీమేలు మరువలే ♦ ననినమాట
మఱచెనో శౌరి తగ సత్య ♦ మాయ మీఱి. 68

కం. అను వనితామణి పలుకులు
విని కీరం బిట్లులనియె ♦ విమలాంగి! వినే
వనజాక్షుని విధ మెఱుఁగవె
కని తెల్పిన భారతంబు ♦ కథలై పరఁగుః. 69

తే. గీ. దొరక నటువంటి రత్నంబు ♦ దొరకినటుల
బొమ్మనని కాని దించఁడే ♦ యెమ్మెనైనఁ
గౌఁగిలెడలిన బ్రాణముల్ ♦ గదలుననుచు
కట్టి కాచుక యున్నాఁడు ♦ కదలనీఁడు. 70

తే. గీ. మగువ యిదిగాక యిఁకనొక ♦ మాటగలదు
వినుము వలపుల దొరసాని ♦ యనెడుపేరు
దాని కిచ్చెను నినుఁబిల్వఁ ♦ బో ననంగ
నెటుల నో రాడెనో శౌరి ♦ కెఱుఁగనమ్మ. 71

వ. అనవిని చిలుకం జూచి రాధ యిట్లనియె. 72

తే. గీ. ఎల్ల వారికి శకునంబు♦నెఱుఁగఁబల్కి
బల్లి తాఁ బోయి తొట్టిలోఁ ♦ బడినరీతి
నొకరి నననేల మోసపో ♦ తిఁక నదేల
వెనకఁ జింతించు టెల్లను ♦ వెఱ్ఱితనము. 73



తే. గీ. నీవు పోయినపనికి రా ♦ నీవు కొడవ
పట్టిపల్లార్చి దేవకి ♦ పట్టి నిటకుఁ
దోడుకొనివత్తు వనుచు నీ ♦ తోడె చిలుక
నమ్మికను నెమ్మనంబున ♦ నమ్మియుంటి. 74

వ. అనవిని శుకం బిట్లనియె. 75

కం. తలకెక్కిన వలపున హరి
యళికచ దాసానుదాసుఁ ♦ డై మెలఁగంగాఁ
గలవే యిఁక నడియాసలు
కలబోసిన వెనుక నుట్టి ♦ కనుఁగొనురీతిన్. 76

వ. అనవిని దురంతచింతాభరంబున విరహవేదనా దోదూయమాన మానసురాలై దిగ్గునం బెగ్గడిల్లి. 77

సీ. జడ వేగ వదలించి ♦ ముడి పూలు విదలించి
యలజడిఁ గిల్లంటు ♦ నందగించి
జిగివల్వ సడలించి ♦ బిగిరైకఁ గదలించి
సగము మాసిన చీరె ♦ సంఘటించి
తిలకంబు పెకలించి ♦ కలపముల్ తెఱలించి
పచ్చికస్తురి తలఁ ♦ బట్టువెట్టి
కలసొమ్ము లెడలించి ♦ కాటుక నిరసించి
సొంపు వాసెనకట్టు ♦ సంపుటించి
తే. గీ. యాసల నడంచి చెలులపై ♦ యాస డించి
చెఱఁగు మైనిండ ముసుఁగిడి ♦ చీఁకటింట
మేని వెతలార్చి కంకటి ♦ మీఁదఁ జేర్చి
పొరలె మరులూరి చిలువరా ♦ పొలఁతిదారి. 78.

ఉ. ఉలుకును వెచ్చనూర్పు వడి ♦ యుస్సురనుల్ దలయూఁచు లేచు లో
గలఁగఁబడుల్ దిగుల్పడును ♦ గానిపనుల్ తలపోయు వేసరుల్

గళవళమందుఁ గన్గొనుఁ బ♦కాపకనవ్వు భయంబుఁ జెందుఁ గ
న్గొలఁకుల నీరునించు మది ♦ గొంకఁదొలంగు వణంకు నెంతయున్.

ఉ. రా యను వింతపుట్టినది♦రా యను నింతకుఁ దట్టిగట్టినా
రా యను తాళియుంటి గద♦రా యనుఁ జూతువుగాని వేడ్కలే
రా యను మేలువార్త విన♦రా యను నా వలపింతఁజేసె నౌ
రా యను నిన్నుదూఱ నగ♦రా యను హా యదుశేఖరా! యనున్. 80

ఉ. అనుచునుఁ బ్రజ్వరిల్లు విర♦హానలకీలల మేను గంద నా
వనరుహనేత్రి యోర్వకను ♦ వావిడిచేడ్చెఁ బికస్వరంబునన్
గనుగవనిండ వెల్లురికి♦కాటుకరెప్పలచిల్కి చెక్కులన్
మినమినబారి గుబ్బచను♦మిట్టల నశ్రులు జాలువారఁగాన్. 81

శా. ఆవేళన్ జెలులెల్ల గొల్లుమని హా♦హాకారముల్ సేయుచున్
నీవే యిట్టుల ధైర్యమున్ విడచినన్ ♦ మేమెల్ల నెట్లౌదుమో
మీవారెల్లను సిగ్గునం బొగులదో ♦ వేమారు యీవంత నీ
కావంతం బనిలేదు వచ్చె నిదిగో ♦ కంసారి, కంజాననా! 82

సీ. అల జక్కవల పెక్కు ♦ వలదొ్రిక్కు చెలమెక్కు
నిక్కు చన్గుబ్బలు ♦ స్రుక్కునబల (ప్రు)
అనయమ్ము నునుదమ్మ♦లను తమ్ములనయమ్ముఁ
గను కనుంగవతెల్వి ♦ కలఁగు నతివ
తొగవిందు జిగిముందు ♦ తగుపొందు సొగసొందు
వదనారవిందంబు ♦ వాడుభామ
తులకించు బలుమించు ♦ నలయించు కళనించు
నందంబు మైఁదీఁగె కందునమ్మ

తే. గీ. మెఱుఁగువాతెర మేలిమి ♦ తఱుఁగునమ్మ
చిన్నిచిన్నారిముంగురుల్ ♦ చెదరునమ్మ
మెల్లిమెల్లంట నీయుల్లుఁ ♦ డిందువచ్చు
నడలవలవదు మాయాన ♦ యంచయాన. 83

వ. అనివిని 84

కం. తనువెల్ల ఝల్లుమనఁగా
నునుమోవి చలింప లేచి ♦ నుదురు చెమర్పన్
ఘనకేశబంధ మూడఁగఁ
గనుదమ్ములు మోడ్చి వ్రాలెఁ ♦ గదిసినమూర్ఛన్. 85

వ. అంతట నిందువదనలందఱుం గూడుకొని. 86

కం. ఏమంద మేమిసేయుద
మేమందునఁదీరు తీరు ♦ నెట్టులొ ర్త మయో
యే మందయాన నడుగుద
మీ మందరకుచ తెఱంగు ♦ యిట్టిదియనుచున్. 87

కం. అని పలుకుచు వెస నులుకుచుఁ
గని తలుకుచుఁ గనులనశ్రు♦కణములుచిలుకన్
ఘనశోకమగ్న లగుచును
గనకాంగిని చుట్టుముట్టి ♦ కాంతలు వేగన్. 88

ఉ. కోమలి సిబ్బెపున్ మెఱుఁగు♦గుబ్బల జొబ్బిలు కప్పుకప్పురం
బా మరునగ్ని సోఁకి యది ♦ యంతట భగ్గునమండ మన్మథ
స్వామికి భామలున్ చమురు ♦ వత్తియు లేని నివాళిజోతు లో
సామజయానలారా, యని ♦ సారెకుఁ జేతులుదట్టి యార్వఁగన్. 89

తే. గీ. సారవంతంబగు పటీర♦పూరములను
సేదఁ దెల్పిన నొక్కింత ♦ సేదఁదేరి
చెలులఁ గని రాధ వింటిరే ♦ చెలియలార
కలను గనుఁగొంటి శౌరిరా♦కల ననంగ. 90

సీ. తప్ప దీమాట నా ♦ తనువు ఝుమ్మని ముంచె
చూడు చూడుమటంచుఁ ♦ జూపె నొకతె
రమణి యీదిక్కు లో♦రణిగాలి బలికేని
యదెయదె వినుమంచు ♦ నాడె నొకతె

వెన్నుఁ డీడకు వచ్చి ♦ యున్నట్టి కన్పించెఁ
గల నిక్కమౌనంచుఁ ♦ బలికె నొకతె
నెమ్మది నిపుడెంతో ♦ నమ్మితె యున్నది
అమ్మమ్మ! యిది నిజం ♦ బనియె నొకతె

తే. గీ. పడఁతి నీ వామనేత్రంబు ♦ పదిరె నిదిగో
కలికి నీ వామభుజము దా ♦ గదిలె నిదిగో
యతివ నీ వామభాగాంక ♦ మదరె నిదిగో
దిగులు మానుమటంచు నా ♦ తెరవ లనఁగ. 91

తే. గీ. అంత నచ్చట నర్జునా ♦ హ్వాయసఖుండు
చేరి రాధిక పంచిన ♦ చిలుక యలుకఁ
జెప్పకయె పోయెనని పల్కుఁ ♦ జిత్తగించి
కమలనేత్రుఁడు మనము ది ♦ గ్గనఁగ లేచి. 92

సీ. రాజాస్య గిలించు ♦ రవలపావలు మాని
ధవళాక్షి యిచ్చు కై ♦ దండ మాని
తెరవ చుట్టిమొసంగు ♦ తెల్లటాకులు మాని
సకియ తెల్పెడు హెచ్చ ♦ రికలు మాని
కాంచనాంగులు పట్టు ♦ కరదీపికలు మాని
పడఁతులు విసరు పా ♦ వడలు మాని
భామలు గొనివచ్చు ♦ భారిపల్లకి మాని
మగువలు వీచు చా ♦ మరలు మాని

తే. గీ. మరుఁడు వేటాడ రాధపై ♦ మరులుఁ గూడ
దిట్టతనమూడ హృదయంబు ♦ గొట్టుకాడ
మేను వసివాడ సరిజోడు ♦ లేని ప్రోడ
తన సఖునితోడ శృంగార ♦ వనముఁ జూడ. 93

సీ. తప్పకఁ దనుఁ జూచి ♦ తెప్పవేయక వచ్చు
జలజాక్షిపై దృష్టి ♦ సైతమిడక

మోహోపదేశత ♦ మోముసాచుక వచ్చు
సఖియమోవిని ముద్దు ♦ సైత మిడక
బహుదూరముననుండి ♦ పైఁటవిప్పక వచ్చు
చాన గుబ్బల గోరు♦సైత మిడక
భ్రమఁ బోకముడిస్రగ్గ ♦ బారవేసుక వచ్చు
నాతికౌఁగిట మేను ♦ సైత మిడక

తే. గీ. జారుసిక పీడఁ దెలిముత్తె♦సరములాడ
పదట మెడమీఱు బంగారు♦పటము జాఱ
అందెరవబల్కు మొలుచు ఘ♦ర్మంబు లొలుక
వచ్చె నీదారి యా మురవైరి శౌరి. 94

సీ. ఆసతో నన్నుఁబిల్వ♦మని యింతి యేమేమి
బలికె కీరంబునుఁ ♦ బనిచెనొక్కొ
వచ్చి యిచ్చట నాడు ♦ వర్తనూనము చూచి
వే పోయి శుకమేమి ♦ చెప్పెనొక్కొ
యెలనాగ విని యంత ♦ యీనినపులివోలె
బెదరి భగ్గున మండి♦పడియెనొక్కొ
అదియొక నెపముగా ♦ నతివలు పగ చాటి
మించి యేమంచు బో♦ధించినొక్కొ

తే. గీ. తోయజానన మది కేమి ♦ దోఁచె నొక్కొ
దైవ మేమేమిసేయంగఁ ♦ దలఁచెనొక్కొ
గ్రహగతుల క్రూరమెట్టిదో ♦ రాధ నెడసి
యేల వచ్చితి చెలికాండ్ర ♦ నెడసి యీడ. 95

సీ. నినుఁబాసి నిముసంబు ♦ నిలువఁజాల నటంచుఁ
గౌఁగిటఁ జేర్చుక ♦ ఘడియసేపు
నీవెంటనే వత్తు ♦ నేఁ దాళలేనంచుఁ
గరములువట్టుక ♦ ఘడియసేపు

ననుఁ బిల్వఁ బంపుమీ ♦ నాయాన నీ కంచుఁ
గన్నీరు నించుక ♦ ఘడియసేపు
దానిమాయలఁ జెంది ♦ దయ వీడకుమటంచుఁ
గలసి మోవిగదించి ♦ ఘడియసేపు
తే. గీ. గాను వగచుచు గద్గద♦కంఠ యగుచుఁ
బ్రేమమీఱఁగ దీవన♦వీడె మిచ్చి
పనుపఁ జాలక పయనంబుఁ ♦ బంపినట్టి
యుపిద నెడబాసి యుండఁగా ♦ నుచితమగునె. 96
వ. అని మఱియును. 97
సీ. మోము మోమునఁజేర్చి ♦ మొనగుబ్బ లెదఁగూర్చి
చక్కెరమో వాను♦చక్కఁ దనము
తొడసందు బొంచెంచి ♦ తోపునూకులమించి
మొనపంటి మడుపిచ్చు ♦ ననువుదనము
పక్కవాటుగ వచ్చి ♦ బొళిని పడకిచ్చి
తమిరేచి పురికొల్పు ♦ కొమిరెతనము
బకదారివగఁ బల్కి ♦ లకుముకిగతిఁ గుల్కి
పురుషాయితము సల్పు ♦ నెఱతనంబు
తే. గీ. మ్రొక్కి మ్రొక్కించుకొనునట్టి ♦ చక్కఁదనము
పొగడి పొగడించుకొనునట్టి ♦ ప్రోడతనము
దక్కి దక్కించుకొనునట్టి ♦ దంటతనము
రాధకే కాక కలదె యే ♦ రమణికైన? 98
సీ. కనులతళ్కులఁ జూచి ♦ భ్రమఁజెంద నేకాని
మోము మోమునఁజేర్చఁ ♦ బ్రొద్దులేక
బటువుగుబ్బలు జూచి ♦ భ్రమఁజెందనేకాని
పూని కౌఁగిటఁజేర్పఁ ♦ బ్రొద్దులేక
వదనపద్మముఁ జూచి ♦ ముదముఁ జెంద నేకాని
మోవిపానక మానఁ ♦ బ్రొద్దులేక

మరుదివాణముఁ జూచి ♦ మరులుజెందనెకాని
మొనఁజేసి పైకొనఁ ♦ బ్రొద్దులేక

తే. గీ. దినము లెల్లను వ్యర్థమె ♦ చనియెగాని
యొక్కనాఁడైనఁ గవఁ గూడి ♦ సౌఖ్యనొంది
యక్కజెల్లను దీరంగ ♦ ననుభవించి
భామినీమణితోఁ గూడి♦మాడనైతి. 99

తే. గీ. మునుపు నిద్దుర లే దయ్యె ♦ ముదిత నెనసి
వెనక నిద్దుర లే దయ్యె ♦ వెలఁది నెడసి
యేమిచెప్పుదు మనసిజ♦స్వామి మాయ
యెంచకనె యెంచి ముంచక ♦ ముంచె నౌర 100

తే. గీ. రామ గా దది సౌందర్య♦సీమ గాని
నారి గా దది మరువింటి ♦ నారి గాని
కొమ్మ గా దది సంపంగి♦కొమ్మ గాని
కలికి గా దది మరునిపూ♦ములికి గాని. 101

సీ. మగతేఁటిగములకు ♦ మగువముంగురులకు
నేనాఁటి నేస్తమో ♦ యెఱుఁగరాదు
మరుకమాన్ కొమలకుఁ ♦ దెరవకన్బొమలకు
నేమిచుట్టరికమో ♦ యెఱుఁగరాదు
పూర్ణసోమునకును ♦ బొలఁతిమోమునకును
నెచ్చటిమచ్చికో ♦ యెఱుఁగరాదు
కపురంపుఁతావికిఁ ♦ గలికి కెమ్మోవికి
నేయనుబంధమో ♦ యెఱుఁగరాదు

తే. గీ. చెలియ నునుజూపుజిగి నల్ల♦కలువదూపు
కొమ్మపాలిండ్లు బంగారు♦నిమ్మపండ్లు
చెలువనూగారు నల్లని♦చీమబారు
లొక్కచోటను బుట్టని ♦ డొకటి కాదువ. 102

తే. గీ. ఇందుబింబాస్య నవ్వుల ♦ కెంచిచూడఁ
జంద్రికిరణవిలాసంబు ♦ సహజమయ్యె
ఇంతి నునుగప్పు కొప్పున ♦ కెంచిచూడఁ
జంద్రికిరణవిలాసంబు ♦ సహజమయ్యె. 103

సీ. శృంగారజవ్వన♦క్షీరాబ్ధి నడుమను
దనరారు బంగారు ♦ తమ్మియనఁగఁ
దళుకుమించున మించు♦తనుచంద్రరేఖలో
బరిఢవిల్లు కురంగ♦పదమనంగ
గలదులేదనునట్టి ♦ కౌనుదీవియయందుఁ
బూచిన గంటెన♦పూ వనంగ
నలువొందు నాభిపు♦న్నాగంబునను బుట్టి
ప్రవహించు జిగితేనె♦వాఁకయనఁగఁ

తే. గీ. జొక్కి మరులెక్కి నేతలఁ ♦ జుట్టియాడ
నజుఁడొనర్చిన మోహన♦యంత్రమనఁగ
మరులుగొల్పెడు దొరసాని♦మరునియిల్లు
కళలు గరుఁగంగ ముద్దాడి ♦ కలయుటెపుడొ?

సీ. పంచబాణునిచేతఁ ♦ బ్రాణములొవ్వనీక
పరగెడునమృతంపు♦బావియనఁగ
మారునిఘోరజ్వ♦రారుచుల్ దీర్పంగఁ
బరిఢవిల్లెడు తేనె♦వాఁకయనఁగ
దర్పకు కోపాగ్ని♦దాహంబు మాన్పంగ
నలరారు మెళనీటి♦కొలననంగఁ
దలిరాకు విలుకాని ♦ తాపంబులణగింపఁ
జెలువొందు పన్నీటి♦చెలమనంగ

తే. గీ. నాడు మనమను రాయంచ ♦ నటమటింపఁ
జెలికువిల్ బోయ త్రవ్విన♦చెలమయనఁగ
మరులుగొల్పెడు దొరసాని♦మరునియిల్లు
కళలుగరుగంగ ముద్దాడి ♦కలయుటెపుడొ? 105

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

వ. అంతట ననంతశయనుండగు మురాంతకుండు మంతనిడి సత్రాజిత్తుపీడ్కొని, సత్యభామం దోడితేరఁ దగువారల నియమించి, మంచి లగ్నంబున రథం బారోహణముసేసి, వెంబడించివచ్చు బంధుజాలముల నిలువ కరమమర్చి, కదలి మనోవేగంబునఁ గోకులంబున కరుదెంచి రథంబుడిగ్గి, భృత్యామాత్యాది బంధువర్గంబుల వారివారివిడుదులకుఁ బోవంబనిచి, నిజగృహంబునం బ్రవేశించి, నందయశోదాదులకు నమస్కరించి దీవెనల్గాంచి యచ్చటి వృత్తాంతం బంతయు నెఱింగించి కొంచొకతడ వందు వసియించి, యచ్చటి యాప్తసఖులచే రాధికావృత్తాంతంబంతయు నాకర్ణించి 'యిందుల కేమిసేయువాడ' నని చింతించి తానెపోక తీరదని నిశ్చయించి బెట్టునిట్టూర్పులు నిగుడించి మించినదిగులునం బెగులుచు పగలు వగలాయె నంచు వేగించి యారాత్రి జననయనచకోరంబులకు బండువై యుండు పండువెన్నెలలోన బయలుదేరి మందగమనంబున రాధామందిరంబుఁ జేరంబోవు సమయంబున. 106

తే. గీ. అపుడు నచ్చట రాధ కం ♦ సారిరాక
చిలుకచే విని తనవద్ది ♦ చెలులఁ బిలచి
వెన్నుఁడిట కేగుదెంచిన ♦ విడువవలదు
వాకిటనె నిల్పుఁడని చెప్పి ♦ పనిచెనంత 107

ద్వ,బద్వ, వద్వ.

వ. వారలా దేవదేవుండైన గోపాలదేవునిం గనుంగొని. 108

చ. 'పాలతిరో?' 'యేమి?' 'త్రోవవిడు ♦ పోవలె' 'నెచ్చటి?' 'కింతిచెంతకే'
'తొలిరుచిపీడవో?' 'విడను' ♦ 'తోతుము' 'ద్రొబ్బుదుపొమ్ము' 'పోను' 'మా
టలకెడమాను' 'కాని' 'విక ♦ టానికిఁజొచ్చితి' 'వౌను' 'యెవ్వరో
బలిమి మిటారి' 'రమ్మిదిగో' ♦ 'వచ్చితి' 'రాకల మానవోహరీ'. 109

తే. గీ. ఇటుల నాడిన మాటల ♦ కిముడఁ బల్కి
రాజసము మీఱఁగా యదు ♦ రాజమౌళి
బలిమిజులుములు సందడుల్ ♦ దొలఁగఁద్రోసి
చొరవఁజేసుక లోపల ♦ చొచ్చువేళ. 110

సీ. విడువిడు మని డాసి ♦ కడకన్ను లెఱ్ఱఁజేసి
కమ్మనెత్తమ్ముల ♦ గమ్మెనొకతె
లేచి ముందర జంగ♦జాచి కోపమెసంగ
సన్నజాజులచేతఁ♦జవిరెనొకతె
యడ్డంబుగా నిల్చి ♦ యటకేగ నదలిచి
విప్పచెంగలువల ♦ విసరెనొకతె
నిలునిలుమని పల్కి ♦ నీలుమీఱఁగఁగుల్కి
విరజాజివిరులచే ♦ విసరెనొకతె

తే. గీ. గుప్పమని తావిపుప్పొడిఁ ♦ గుప్పెనొకతె
చలువపన్నీరు మైనిండఁ ♦ జల్లెనొకతె
దానవారిని జేరనీక ♦ తలుపుమూసి
యానుఁడనె రాధ పైబలం♦బనుపఁ జెలఁగి. 111

తే. గీ. కాంత లిట్టుల రానీక ♦ రంతుసేయ
నీటిచిమ్ముల కళుకక ♦ నిల్చు గంధ
సింధురం బన నిలిచెడు ♦ శ్రీధరుండు
పలికె వారలఁ గని నయ♦భయము లమర. 112

తే. గీ. 'సుదతి యిసుమంత కడగంటఁ ♦ జూచినంత
రంతు ఘటియింతురో యిట్టు♦లింతులార
మీరు నామారు పదముల ♦ మీఁదవ్రాలి
గలయగలపించి సుకృతంబుఁ ♦ గట్టుకొనరె'. 113

వ. అను శౌరితోడ నా చెలు లిట్లనిరి. 114

సీ. 'ఈవైన మానాఁటి ♦ కెటువోయెనో' యని
చెప్పి కరమ్ములు ♦ విప్పవారు
'కలయికే కఱవాయె ♦ గానార నీ గుణాఁ
ధ్యుని' కంచు నొడల♦లూఁచువారు

'నీ యతివినయంబు ♦ నీసత్యకే కొంచు
బొమ్మ'ని బహుధిక్క ♦ రించువారు
'పాలుమా లిటువలె ♦ బ్రతుకవచ్చునె' యంచు
మెఱుఁగుఁగెమ్మోవులు ♦ విఱుచువారు
తే. గీ. 'మామగారింటిలో నున్న ♦ మందెమేల
మెందుడాగెనొ యిపు'డంచు ♦ నెదుటనిలిచి
బెళుకుఁగొనలు బెళుకంగఁ ♦ గులుకువారు
నగుచు నగుచున్న చెలులకి ♦ ట్లనియె శౌరి. 115

తే. గీ. ఇంత కోపంబు మదినున్న ♦ జెంతఁ బిల్వ
బంచి రాధిక నన్ను దం ♦ డించరాదె
వాకిట నలాకుసేయఁగ ♦ వశమె వలదు
దాన గురులాఘవము లెందుఁ ♦ గాచు' ననిన. 116

కం. అనవిని రాధిక భావం
బున నించుక కోపమూని ♦ ముసుఁగిడి తిరుగన్
గని కీరము చని వేగం
బున రమ్మనిపిలువ శౌరి ♦ ముదమొదవంగన్ 117

ఉ. లోపలికేగి గారుడవి ♦ లోల శిలాగ్రహాళీమ శయ్యపైఁ
గోప మెసంగఁగా జిలున ♦ కోమలి చాపున నున్న యింతినం
తాపముఁ జూచి పుష్ప శర ♦ తాపము మీర మురారి చేరి బె
ట్టూపిరితోడఁ బాదమ్ముల ♦ యోరకు రా గని లేచి దిగ్గునన్. . 118

ఉ. 'ఎవ్వరు పిల్చి రిచ్చటకు ♦ నెందుకు వచ్చితి నేమికార్య మే
నెవ్వతె నీవుదానెవడ ♦ వెవ్వరి కెవ్వరు కంటి కంటి మీ
జవ్వని విన్న రవ్వ లిడు ♦ జాల్ తడవాయెను వచ్చి లేచి పో
నవ్వెద రెల్లవారుగని ♦ నన్నును నిన్నును గోపశేఖరా!' 119

కం. అనఁ జెలిపాదంబుల పై
ఘన చిత్రసురత్న ఘటిత ♦ కనకకిరీటం

బును మోపి లేవకుండిన
వనజానన సిగ్గువలపు ♦ వడ్డికిఁబొంటన్. 120

కం. 'దేవుఁడ వేలినస్వామివి
పోవయ్యా నీవు నాకు ♦ మొక్కేఁగేదగునా
లేవు' మని గుబ్బచనుమొన
లా విభు నెదసోఁక నెత్తె ♦ నారనిపేర్మిన్. 121

ఉ. ఎత్తిన పట్టువీడక యు♦పేంద్రుఁడు తత్కుచకుంభపాళిపై
నత్తమిలెన్ దురంతవిర♦హార్ణవపూరము నీదుకై వడిన్
హత్తి రసాలసాలమున♦నల్లెడు మల్లియతీవె కై వడిన్
గుత్తఁపు గుబ్బలాడి చను♦గుత్తులఁ దత్తనువొత్తి నొక్కుచున్. 122

వ. ఇట్లు మదనకదనారంభ సముజ్జృంభణమనోభిలాష నారాధామాధవులు మందకర చందనాది కస్తూరికాపరిమళద్రవ్యంబులకు సొమ్మసిల్లియుండిరి. అప్పు డమ్మందయాన పురందరాది బృందారకబృంద వందిత పాదారవిందుఁడగు నాగోవిందునిం గలయు మోహావేశంబునఁ బట్టరాని గుట్టెనసి చిట్టాడుచు మట్టుమీఱి యతండు కౌఁగిటఁ జేర్చినంజేర్చనీయక యబ్బురంపు సిబ్బెంపుగుబ్బల నిబ్బరంబున సోఁకినసోఁకనీయక కటికచీఁకటి కప్పులఁ గుప్పునన్ గప్పు గొప్పకప్పుకొప్పు నిమిరినన్ నిమురనీయక, మిక్కిలి యెక్కువైన చక్కనిచెక్కుఁ గీఁటినన్ గీఁటనీయక, మధుర సుధారస ధారాధరమందరంబైన బింబాధరంబుఁ గ్రోలినన్ గ్రోలనీయక కుందనంపుటందంపు గంబైనపువ్వును గంటుపఱుచు తుంటవింటిపాదుసాహిదివాణంబు నాటిన నంటనీయక, మెండొడ్డుకొన నేమఱించి యొయ్యన విరులశయ్యకుం జేర్చి లాలించి కౌఁగలించి బాహాబాహి గచాకచిం బెనఁగి యల్లందునకుంగమకించి చివురుపారుజారు తావిమోవి తేనెలం గ్రోలి పైకొని కోవెలచందంబునం గుబగుబంబలుకుచు 'మేలు భళీ హశాసు శహబాసు నాసామి యద్దిరా' యనిమెచ్చి యొక్కరొక్కరు మేనులప్పళించి వింతవింతపిలుపులం బిలుచుచుఁ గెందామరలంబోలు గందామరల నరమోడ్పులు గావించుచు మన్మథబ్రహ్మానందంబునం దోలలాడుచుండిరని చెప్పి శుకుండిట్లనియె. 123

శా. కస్తూరీతిలకోజ్జ్వలస్థితిముఖా ♦ కైవల్యలక్ష్మీసఖా
హస్తోదంచితశంఖచక్రరుచిరా ♦ హస్తీంద్రరక్షాపరా
అస్తోకామృతపర్షివేణునినదా ♦ యానందలీలామృతా
త్రిస్తానేకజనాభయప్రదకరా ♦ ధారాధరశ్రీధరా! 124

కం. సాగఘనసారతుహినో
సీరాలేపాంగరాగ♦శీతలతట రా
ధారమణీ కుచదుర్గయు
గారోహ విహారలీల ♦ యదుకులబాలా! 125

మాలిని

దళిత విపులమాయా ♦ ద్రావిడామ్నాయగేయా
జలరుహదళనేత్రా ♦ సవ్యసాచ్యాప్తమిత్రా
బలవిభవ విరామా ♦ భానువంశాబ్ధిసోమా
కలశ జలధి శాయీ ♦ కామితార్థప్రదాయీ! 126

గద్యము

ఇది శ్రీమ త్పాండ్యమండలాధీశ్వర శ్రీవిజయరంగ
చొక్కనాథ కటాక్షలబ్ధాఖిల సంపత్పారంపరీ
సమేధమాన సముఖమీనాక్షీనాయక
తనూభవ.మీనాక్షీదేవీకటాక్షలబ్ధ
కవితా సాంప్రదాయక వేంకట
కృష్ణప్పనాయక ప్రణీతంబైన
రాధికాసాంత్వనం బను
చాటుప్రబంధంబు
సర్వంబు నేకాశ్వాసము.

కం. ఈకథఁ జదివిన వినినను
బ్రాకటముగ వ్రాసినాను ♦ బహుళ సంపదలున్
గైకొనుమనుచును వారికి
శ్రీకరముగ గోపశౌరి ♦ చెలువున నొసఁగున్.

# సారంగధర చరిత్రము.

[వచనము]

[శైలికి ఉదాహరణముగా గ్రంథమునందుఁ గొంతభాగము]

సముఖము

వేంకటకృష్ణప్ప నాయకుఁడు

— అంత సారంగధరుండు బినతల్లిం గనినయంత, భయభక్తివినయ సంభ్రమంబులు మనంబునఁ బెనఁగొన సాష్టాంగముగా మ్రొక్కిన నా జక్కవ గుబ్బలాడి గ్రక్కునఁ జేతులుజాచి లేవనెత్తి తనచనుగుబ్బ మొన లొత్తించుక నతని యురంబు సోఁకఁ గౌఁగలించుకొని, మొగంబు మొగంబునం జేర్చి చెక్కిలినొక్కి ముద్దుఁబెట్టుకొని, నొక్కుచునుండు నచ్చేడియంగాంచి యా కుమారుండు బినతల్లికిం దనమీఁది నెనరు మిక్కిలి గావున నక్కరణి నాదరించె, నిదితక్కువగాదని తలంచి, కరకమలంబులు ముకుళించి, 'రాజు లేని వేళ నే నిందు రాఁజెల్లదు; తల్లీ!యుల్లంబు సైచుకొ'మ్మనుటయు,నమ్మాటు మాయలాడియు, 'నిట్లు పలుకంగాఁదగునే? నీవు నావసుధావల్లభుండు నొక్కరూపంబు గావున తడఁబడి మ్రొక్కఁజెల్లునే,' యని సుశీలయుంబలె నా దుశ్శీలచేయిఁజాపి, ముందుగ విచ్చేయుమని యమ్మహాత్మునిఁ దోడ్కొని, 'అతివినయం ధూర్తలక్షణ' మ్మనువిధంబున నరిగి కప్పురంబులు చిలికిన చల్లని పన్నీటనాతని పాదంబులు గడిగియొత్తించి, బేర్చిన ముత్తియంబులు జేర్చిన పసిండి గద్దియఁ గూర్చుండనునిచిన, యానరేంద్రనందనుండు, 'జననీ! తక్కినవారికిం బలె యింత యుపచారం బేమిటికి? యేను నీ కుమారుండనుఁగానే!' యనుటయు నాపుష్పఁబోఁడి, బొమ్మంచుకెమ్మోవి చిగురునం జిరునగవుమొలకలు గులుక, కప్పురంపు వీడియంపుతావి ఘుమ్ముమన, తేనియ చినుకులొలుక నిట్లుపలికె; 'ఓ జగన్మోహనాంగ! నాకుమారుండ వగుదువు, నిక్కంబుపలికితివి. నీదుసుగుణత్వంబును, నీచక్కఁదనంబు నీ యొయ్యారంబు నిచ్చలులు నిచ్చలు పలుక విని వీనులకువిందులయ్యె; ఇప్పుడు కనుంగొనుటచే కన్నులకుం బండువయ్యె, నాకోరికలు లభించె, నే నోఁచిన నోములు ఫలించె; చంద్ర జయంత వసంత కంతు నలకూబరాదుల చక్కఁదనంబులు విన్నదియే గాక కన్నది లేదు. డెందంబున కానందంబు కదలింపఁ గన్నులార నినుఁ జూడఁగంటి, నామనంబునం గల్గు దుందుడుకులు నేఁటి తోడం దీఱె; కామినీకుసుమసాయకా! నీవంటి నిధానంబు గల్గుటం జేసి యెంతటి పలుకులకుఁ జింతవలదు, పచ్చవింటి వజీరునింబోలు నీవు వచ్చుటం జేసి రాజేంద్రుండు రాలేదను పరితాపంబేటికి?

వెన్నయుండఁగా నేయిలేదని చింతింపనేల? నీవెన్నుండును నన్నుఁ జూడరా వని దూరుచునుంటి; ఇప్పుడు నాపై నెనరు గలందులకు గురుతుగంటి, నిన్నుఁగూడి మనంగంటి; నాదు యపరంజిమేడ నీ వెన్నుండునుఁ జూడ రావుగదా! యీ యింద్రనీలంపుసోరణగండ్ల యందంబు, యీసొగసు గొప్పటోవరుల చందంబు, నా కలువలరాయలరాతి యరుంగుల తంగులు, నాహారువంజి(హారుమంజి)ముత్యముల మేలుకట్లును, నీ మగరాల నిగరాల గోడల వేడుకలు నిచ్చు కీరపారావతాదుల వినోదంబులు, తక్కనుం గల విశేషంబుల సంతోషంబునఁ జూచి, యీ మానికెపుటోవరు లందు పువ్వులపాన్పున కమ్మతెమ్మెరలు వీవఁ గొంతసేపు పవ్వళించి, గంధము చెక్కలాకులు గైకొని పోదువుగాని రమ్మన—

అప్పుడమియొడయని కొడుకు వెడనగవంకురింప నప్పుడంతుకం జూచి, 'సత్వరంబుగాఁ జనవలయు, ప్రాణపదంబగు నా పావురంబు యిచ్చోట వ్రాలె, నీవు మా పినతల్లివిగావున రవికిరణంబుల కేనియుఁ జొరఁగూడని యంతఃపురంబునకు వచ్చి నీ పదంబులకు మ్రొక్కితి. నీ కటాక్షంబున నన్ని భాగ్యంబులు గల్గియున్నయవి; కాలయాపనంబు సేయక పావురం బొసంగినం బోయెద' ననిన, నక్కురంగలోచన లోచనాంచలంబుల నించుకించుక చక్క చిక్కని చంద్రిక లీనం జూచి, నవ్వుచు, 'నింత తీవరంబేమి? యించుక సేపు విశ్రమించి పోవుదువు గాక' యని, యూరాచపట్టిఁజేపట్టి వట్టియాసల నా దిట్టతోడనే లేచి మట్టుమీఱిన మోహంబునఁ బయిడిమేడకుం దోడుకొని పోయెను.

## గద్యము.

సముఖ మీనాక్షీ తనూభవ వేంకట కృష్ణప్ప నాయక
ప్రణీతంబైన సారంగధర చరిత్ర
వచన కావ్యంబు నందు
యేడవ యధ్యాయము.



# సారంగధర చరిత్రము.



## ఎనిమిద అధ్యాయము.

అప్పుడు ప్రోడలగు చేడియ లాచేడియం జూచి, యక్కుమారుని చక్కదనంబును, యా చక్కెరబొమ్మ యక్కఱయుం జూచి, 'నేటి కిబ్బోటి కేమో పాటువచ్చునని తోఁచుచున్నయది. ఇత్తఱి, యా బిత్తరి కింత తత్తఱం బేమిటికి? సూటిగాని చోట మోహంబు బాటించుట ఖ్యాతి గాదు. ఇవ్విధంబు మాను మని బలికినఁ బగతుల మగుదుము. ఈవనితను మనము మానుపలేము. దైవగతి విపరీతం బయ్యోనని దోఁచుచున్నయది. మన మేమిసేయంగలవారము? ఆయమ్మ నియమించు చందంబున నుందుద, మీఁకమీఁద నెటులయ్యో నట్టులగుఁగాక!' యని గుసగుసలం బోవుచు నటు నిటు నడయాడుచుండ, చిత్రాంగి విచిత్రంబైన మేడ మీఁద కతనిఁ దోడుకొని, తన పదపద్మరాగంబులు సోపాన పద్మరాగంబులు, పరస్పరంబు సంధింప, బంగరు శలాకయుం బోని యంగవల్లికాంతియు నచ్చటి కవాటంపు కుందనంపు తళుకులు నెయ్యంబున వియ్యంబులంద, పలకవజ్రంబుల గవాక్షులు తన కటాక్షకాంతు లక్షుల నేకీభవింప, తృణగ్రాహి నీలమణి మయంబులైన కంబంబుల డంబులు తన నీలాలక కదంబంబుల నొండొంటి నొరసికొని విలాసినీ మణిప్రభావిభాసమానంబులైన చవికె, లుప్పరంబులు, తిన్నియలు, జవాదిగిన్నియ లిడినతావులు, నాదియైన వినోదంబు, లాతనికిం జూపుచు, మేడమీఁదికిం బోవునప్పుడు, చంద్రకాంతమణిమయంబులైన యరుంగుల రంగులు, యింద్రనీల మాణిక్యమయ స్తంభకాంతులు రెండునుఁ బెనంగొని గంగా యమునా సంగమంబులభంగి నెఱింగించె. నాయకంబులైన పద్మరాగకాంతినికాయంబులు సాంధ్యరాగంబు చందంబుఁ గందళింప,

చెక్కడంపు టోవరులకెప్పులు చవుకట్లుచప్పున నొప్పుమీాఱు, మగరాల నిగరాల నెలకట్టుచాయలు వెన్నెలల వెదఁజల్లు మువ్వెలుంగులకు ఠావైన యారెలు, పరిమెళ దట్టంబులైన గంధపట్టియలు, త్రాణమిాఱ మేళవించిన వీణియలును, గాలి సోఁకినఁబలుకు కిన్నెరియలును, తేనియలం జిలుకఁ బలుకు చిలుకలును,నలువంకల నలంకరించిన గోరువంకలును, చక్కెరవిలు మాప్టీని ఢక్కల వలెఁ జెలంగు నంగులుఁ గల్గి, సకల శృంగారసంపదల సదనంబైన యా సదనంబున నొక్క మణిమయవేది నక్కుమారుం గూర్చుండ నునిచి, యెక్కుడుఁ జూచినం గొక్కోక కళారహస్యంబులైన చౌశీతి బంధంబులం బెనఁగు గంధర్వ కామినులను గంధర్వులను వ్రాసిన చిత్రపటంబులం జూపుచు, 'నోయీా, నెఱజాణ! యీా చక్కి నొక్కిం చుక చూడుము: గొల్లాయిల్లాండ్ర చనుగుబ్బలఁ బట్టి, వారి కెమ్మోవులఁ బలుమొనలుఁబెట్టి యనురాగంబున భోగించు గోపాలుని చందంబు యెట్టులున్న' దనవుఁడు, నవ్వీరకుండు నవ్వి!

'ద్రోణపుత్రుని బాణాగ్నిచేత దగ్ధంబై పడిన పరీక్షితుని, తన యఖండిత బ్రహ్మచర్యవ్రత మహాత్వంబునఁ బ్రతికించిన మహానుభావు నకు నా విహారంబులు లోకవిడంబనంబు లింతియకాని సహజంబులు గాదు.'

'రాకుమార చంద్రా! చంద్రశేఖరుండు దారుకావనంబునఁ దపసి చపలాక్షి నొక్కతెం గదిసి మారుని నక్కనకాంగి జంకెన చూపుల జంకించె...'

'తల్లీ! తుంటవిల్తునిం గంటిమంటలచే మంటఁ గలిపిన ముక్కంటి ......కామారికిం, గామాతురత్వంబు గలదే?'

'విశ్వామిత్రుండు, మేనకను ముద్దుబెట్టుకొని, కచంబు నిమిరి, కుచంబు లంటఁ గమకించుటఁ గంటివా!'

'అమ్మా! యమ్మానివరుండు మహారాజ రాజేశ్వరుండై, యప రిమిత భోగంబు లనుభవించి, రోసి యాశాపాశంబులు తెగఁగోసి, విరక్తిం బొంది, బ్రహ్మత్వంబుఁగోరి మహాతపంబు సేయుచుఁ గురుకులంబునకు

జననియైన శకుంతల నుత్పాదింపఁగోరి, యవ్విధంబున కోడఁబడియె నింతయ కాని, యంతవానికిఁ గంతుసంతాపంబు గలదె? కలిఁగెనేని, త్రిజగన్మోహిని యైన రంభ తనకుం దానె వలచి వచ్చిన యెడ చట్రాయిఁగా శపించునే!'

'పంటిమొనల వాతెఱ గట్టిగా నొక్కుచు, నెమ్మేనులఁ జెమ్మట లుప్పతిల్ల నొండొరులఁ దొడరి పెనంగి, కళావిలాసంబులు వెలయ, నలసతఁ బొందియు సందీక సరిబిత్తరు లానుకొని కల్లంబునకుం బెనంగి వే మారు సాదనలం జేయు వీరలం జూచితే?

'జననీ! జెట్లకు వేమారు సాదనలు జేయుట యుక్తంబె కదా!'

'కమ్మవిలుకాని సంగరంబుల ధేనుక బంధంబునం బెనంగు రంభా నలకూబరుల వీక్షింపుము.

కరేణుకా బంధంబున భోగించు గురుసతీ నిశాపతుల నాలోకింపుము.

ఉపరతి క్రీడావిశేషంబుల నోలలాడు నహల్యా పురందరులఁ గనుఁగొనుము.

సింహవిక్రమంబునం గలయు తారా జయంతులఁ జూడుము.

ఊరుపీడన క్రీడలం జోడుగూడు వాశకన్యా పరాశరులం దిలకింపుము.

పద్మాసనంబను బంధభేదంబునఁ బద్మబాణుని సమరంబు సలుపు యూర్వశీ వరుణుల విలోకింపుము!'

'జనయిత్రీ! ఇవి చిత్రంబులు; యిందు విశేషంబేమి!' యనియె. ఆ చిత్రాంగి, తానాడు యారజంపుఘూటల కెల్ల నొగ్గక నేర్పునం ద్రోసి పలుకు నక్కుమారుని భావం బెఱుంగక, నా సైకతనితంబ కదంబించిన చందంబున, పొంకంబగు కుంకుమంబును, క్రొందిమీఱు జవాదియు, విరి వితానంబు, రత్నభూషణ వినరంబులు, గాజు గిన్నియల, పటికంపు దొన్నియల బంగరు తట్టల నమర్చి, తెనర్చిన మోహంబునం దెచ్చి యునిచి, 'రాయా, వన్నెకాడా! యీ విరిసరంబులు జుట్టుకొనుము, జవాదిచే

తిలకంబుఁ బెట్టుకొనుము, యీమల్లికా గంధం బలందుకొనుము, యీ భోగతరంబులైన రతనంబుల భూషణంబుల నలంకరించుకొనుము, యీ యమూల్య దుకూలంబులు ధరింపు' మని, యాతాఁగ యొసంగరాగా, సారోదాత్తుండును, ధౌతభావంబున నవియొల్లక తల్పంబునం బెట్టి, 'తల్లియుఁ దండ్రియుఁ గూడబెట్టిన ధనంబులన్నియుఁ గుమారు లవి గా కెవ్వరివి గా నోపు వచ్చికొనిపోయెద, నిది నాసొమ్ముగా నీయింట నుండనిమ్ము;' అని ప్రియంబు గడలుకొనం బలికిన నాచిలుకల కొలికి తన హావభావ విలాసంబుల జాణతనంపు మాటల, నమ్మేటి మానసంబు గోరంత యేనిఁ జలింపంజేయఁ జాలక, యూరట లేని యారాటము మల్లడిఁగొను నుల్లంబున, 'నక్కటా! యేమిసేయుదు: చట్టు పిళ్ళారికిఁ జక్కిలిగింత లిడిన చందంబున నీతని చిత్తంబు మెత్తనఁ బడదు. దాదాపులకు వచ్చిన తాలిమి చెల్లునే? తాళిన మీనకేతనుండు ఘాతకుండు; యింక నేమిటం గుట్టు; సముఖంబున రాయభార మేమిటికి?' యని యూహించి, సిగ్గుసిగ్గులనుఁ బరిత్యజించి, యేకాంతంబుగా నలు దిక్కులుఁగాంచి, పయ్యెద తొలంగ మీటినట్ల పక్కన విచ్చు చన్నుంగవ బైటపడ, నీవీబంధం బూడ, పొక్కిలి చక్కఁదనంబు మిక్కిలి గనంబడ, కామాంధ కారంబు గప్పటం జేసి కన్నుఁ గానక, యగ్గంధగజగామిని, బాహుమూలంబులు తళుకు తళుక్కనఁ, సందిట దండలు కంకణంబులు రవలగాజులు ఘల్లు ఘల్లు మన, కరంబుల సాచి కౌఁగలింపఁ జూచుటయు, నయ్యుత్తమపురుషుండు, పాపభయంబున గడగడ వడఁకుచు 'హరహర! యిది యేమిగొడవ వచ్చె!' ననుచు దిగ్గునలేచి, 'తల్లీ! నేవచ్చి తడవాయె, పోయివచ్చెద' ననుటయు, నా గరిత, 'యోయీ, రూపరేఖావసంత! కాసంతయు దయలేదే ఆత్మజాకారంబున నా వేడుకం జెల్లింతునంటివి. 'సత్యవాణీ సరస్వతీ' యటన్న వాక్య మేమిటికిందప్పె? ఆత్మజుండను పేరు మన్మథునకుం గలదు. నీవును దదాకారంబున రతులం దేల్పుము. ఏమిటిమాట, మరునకు మోమాటమి లేదు? అని పలుకుచు. నడుము జవ్వాడ, కుచకుంభంబుల తారహారము లసియాడ, పులకాంకురంబులు మేనంగూడ, తాల్మియూడ, వాలుగడాలుమన్నీఁడు పైయాడ, నింపుఁగొనియు నోడక, వాఁకిటి కడ్డంబు

నిల్చి, యా గట్టువాయింతి, బలిమిం బట్టఁ బోవుటయు, నతఁ డవ్వాలుఁగంటిం గనుంగొని, 'నీకు నాయాన...అంటకు' మనిన, 'నోయి, మనోహరాంగ! నే నంటఁబడినదానను గాను; నిన్నంటిన నేమి?' యనుటయు 'నో యమ్మా! యటంటఁ గాదు. మదీయ జనకుం డంటినపిమ్మట నిన్నంటఁ దగ'దనుటయు, 'నంటుమీఱి నిన్నంటకుండిన, మేనం బ్రాణంబులు గెంటక నెటులుండు? మేలుమేలు! నా మేలు దీటు సేయక నేలు, మేలా జాల, మేలా జాలిం బెట్టుట?' యని, దీనత్వంబు దోపఁ బలుకుచు, వింతవింత చెయ్వులం గులుకుచుఁ, గీలెడలించిన జంత్రింపు బొమ్మ కైవడి, నాతని యురంబున వ్రాలి మోహాంబుధిం దేలి, కెమ్మోవిం గ్రోలం గమకించుటయు, 'హా మహాదేవ!' యనుచు, నా గజగామిని రెండు భుజంబులు రెండు చేతులం బట్టి త్రోయం బోవ నప్పు డవ్వనిత, మణికంకణంబు మెఱయ, నా రాచపట్టి హస్తంబట్టు. దుప్పటిఁ జుట్టిపట్టుకొని, కూర్చుండఁబెట్టి, 'నను కన్నులవిలుమన్నీని బన్నంబుల పాలుచేసి కదలఁజూచిన న్మొదలనిత్తునే? నా కన్నుల కఱవుం దీర్చిన నీమేను కౌఁగిటఁ జేర్చుకొనకయే, వీనుల తేనియలుఁ జిలుకఁ బలుకు నీ నోటికి బహుమానంబుగా నా తియ్యవాతెఱ విందుసెయ్యకయే, కప్పురంపువాసనలం గుప్పు నీ కమ్మకెమ్మోవికి సమ్మానంబుగా నే ముద్దాడకయే, నామనోభావంబుఁ గఱచు నీదు హావభావంబులకు మెచ్చుఁగా నీవి నియ్యకయే, నిన్నుం బోవనిత్తునే? రమ్ము రమ్ము: వేగిరమ్ము మానుము. కులుకుకోకిల నణంచు గళరవంబుపలుకులుసారు మొలనూలి గంటలనాదులు వినక నీకుఁ బోవందగ' దను మాటల వాడిశూలంబులు, చెవులందోనాటం దిమ్మువట్టి సొమ్మసిలి, క్రమ్మఱం దెలిసి, యమ్మంత్రి నందను వాక్యంబులు నిక్కంబు అయ్యెనని విన్నంబోయి, కన్నీరుగారఁ బెదవులు దడుపుచు, పులుకుపులుకునం జూచి, పలుకుపలుకనకుం దైన్యంబు దోలుక, 'నేఁజెల్ల, సతీమతల్లీ! నీవు పినతల్లివని వచ్చినందుల కెట్టి ఫలంబుగలిగె, నెదుటివారి యుల్లంబెఱుంగక నీమాటలాడ నెట్టు నోరాడె? యేల తల్లడిల్లెదవు; నీవు తల్లివి నేను తనూజుండ, తల్లియుం దైవసమానంబు. అదియునుం గాక, యొరులచేడియలు నాకుం దోఁట్టువులు! యా

వెఱ్ఱిబుద్ధులు నీ కేలవచ్చె? యిట్టి పాపంబు నాకేల గట్టెదవు? యిందున, శాశ్వతంబైన యపకీర్తి వచ్చుఁ, బరలోకంబున దండధరునిదండన లోర్వం దరంబుగాదు; సీతాలతాంగివంటి రత్నాంగికిఁ జనియించిన తన కిట్టి గుణంబులు రానేర్చునే? భూమీశ్వరునాన, యీతలంపులు మానుము. పదివేలు బలుకనేల, నా హృదయశుద్ధి పరమేశ్వరుం డొక్కరుండె యెఱుంగు' ననుటయు, నయ్యలివేణియు నెలనవ్వు మొగంబునంబొలయ, 'నిజంబు పలికితివి. నీవు పతివ్రతకొడుకవు. నీ గుణంబులు నీవె పొగడు కొనవలదు, హృదయంబుంగంటి: నే తల్లింగాను, దైవంబునుంగాను, మీరాజునకు భోగస్త్రీని; మదన వేదనా దోదూయమాన హృదయలైన సుదతులకు, వావు లేటికి? ధర్మంబు లేటికి? తగవు లేటికి? నా కన్నులాన. నిన్నుం గూడకమాన. తక్కుపలుకులు విడువుము, పెక్కు లేమిటికి నిమిషంబునిన్నుం గలసినం జాలు' నని యంతకంతకు నగ్గలంబైన తమకంబునం బెగ్గిలి, తలుపు మూయంబోవు నవ్వువ్విబోణిం జూచి, 'నేను భోగస్త్రీని, వావులు నాకుఁ బనిలేదంటివి. వంశంబునకెల్ల యొక్కఁడేయని యొట్టిడిన పిన్నవాడే వేఱుపోయితి నన్నుం దీరునే? యీ యవివేకంబున కేమందు? ఎందేని యీవావి జగమందుఁగలదె? రత్నాంగి యొకటియు, నీవొకటియుఁ గాదు: తలంచిచూడుము. పదరకుము, కాయంబు బుద్బుదప్రాయంబు ... ...యకృత్యంబులు చేయఁబూనకుము. నిన్ను విభుం డఱచేతినిమ్మపండుగతి నత్యాసక్తితో లాలింప, నిలింపసంపద లనుభవింపుచు, సొంపున నుండునట్టి నీవు కావరంబునం గన్నుంగానక నేలత్రుళ్లెదవు? ఇందున నాపత్పరంపరలు సిద్ధం' బనుటయు, నత్తరళాక్షి కటాక్షాంచలంబుల నొక్కించుక యంకురించిన యలుక సానఁదీఱిన చెఱుకువిలుతుని వాడితూపులం బోని మిటారిచూపులం జూచి, 'యోరీ! యెన్ని నేర్చినావురా!యిందున కొంతమోసంబునుఁ గలుగఁజేసి, జముం డనువాఁ డొక్కరుండు గలండని భయంబున దుద్దుపెట్టి పోవందలంచెదు. రాజయ్యాని, రెడ్డయ్యాని! ఆనాఁటికిం జూచుకొందము భూవల్లభుం డీకల్లఁ దెలిసి దండించిన దండింపనిమ్ము. ఎక్కడి వావి, యెక్కడి పాపము? వెలకొమ్మ లెవ్వరిసొమ్ము? వలచివచ్చిన జవరాలిని విరాళింబెట్ట వలవదు.

రతీదేవి పూవిలుతునకు వలచిరాదో, రంభ నలకూబరునకు మేలుఁ జెందదో, యీ వలపుతలంపు నాయెడనే బుట్టెనే? దారుకావని మౌని మానినులకుం దగిలెఁగాని నీవలె నీలకంఠుండు నేరఁడయ్యెనో, గురునియిల్లాలిని రమించెంగాని కలువలచెలికాఁడు నీవలె నేరఁడయ్యెనో, యహల్యాకాంత నంటుకొనియెంగాని నీవలె నింద్రుండు నేరండయ్యెనో? వారికన్న నీకువివేకం బధికంబుగాఁబోలు! నీకుఁగలిఁగిన బుద్ధి వారికి లేదయ్యెనో? ఆనాఁటికి నీవుంటివేని వారల యోజనలు జెఱుపవే' యనిన విని యా సుజనుండు, 'యీ వెడమాట లేమిటికి? సృష్టిస్థితి సంహారక ర్తలైన దేవత లెట్లువర్తిల్లినం జెల్లుగాని, తక్కినవారలకుం జెల్లునే? రంభ మొదలైన వెలయాండ్రుసైతము నిట్లు పుత్రులంబట్టిరే? మననేరవు: ఒక్కకార్యంబునుఁ గననేరవు, యెంతచెప్పిన విననేరవు: చాలుఁజాలు, విడువిడు, పోవలయు' నని బలికిన, నక్కలికి కలిబోసినవెనుక నుట్టిఁ గనుంగొనిన చందంబున నాశకుం బారంబులేదు గావున నక్కుమారతిలకునిం దిలకించి 'యోరీ ఱాయైనఁ గఱుంగుఁగాని నీమనంబు గఱుఁగదయ్యె. ఇది నీకు మంచి దటరా? ఆఁడది యుసురుమంటే మోసంబు గాఁదటరా? నే బలికినపలుకుల కలుకచేఁ గనుఁగొనలఁ గెంపునించెదవు, యీ కెంపు నా కెమ్మోవిపై నుంచితే దోసమా? నామనంబునం గోర్కులిలిపెద, వది నా గబ్బిగుబ్బల నిలుపమంటే దోసమా, కుమారకా! వెన్నెలకాఁకకు, మందమలయానిలమ్ముల రాకకు, చిలుకల మూఁకకు, కోయిలల వీఁకకు, వసంతుని జోకకు, మదనుని ధాకకు, నేకరణిఁ దాళుకొనుదానరా, కెమ్మోవి యానరా, నీకు మరునానరా, కాఁగిలిఁ గరుణింపరా, యించుక చల్లనిచూపు నింపరా, నామనవి యాలింపరా!'

—అంచు నత్యంతం బుప్పతిలి కనుఁగొలఁకులఁ గాటుకకన్నీరు మున్నీరువలె వెడలి చనుగొండ మునుంగసేయఁ బెక్కువిధంబుల వేఁడు కొను నప్పల్లవాధరిమాటలు విననొల్లక యాచకులంజూచిన లోభివాని చందంబున వేఱెపరాకుం జూచుచు, నేమనిన నేమివచ్చునో యని నోరెత్త వెఱచి యీడఁబాఱు నుపాయంబు జింతింపుచు, కొంతతడవుండి యటు నిటుఁ జూచి 'యీచెలిం బట్టిన వలరాభూతంబు కొంచాన విడువదు;

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

యెప్పుడిదినేనిం దప్పించుకొనిపోవుట యెట్లనని యప్పుడంకుశ పట్టినసుప్పటి విడచి సాముసేసిన యరమట్టి దట్టిచల్లడంబులతో వెలువడి, పులిచే విడువంబడిన లేడివడువున రాహుదంష్ట్రా విముక్తుండునైన చందురుని చాడ్పునం బోవునెడ, 'నోరీ! రసికుండవని యుంటి; పైదుప్పటి విడచి పోయెదవు, నీ యంగులెల్లం గంటి మారుబారికి వెఱచి నేను కోరిన యెడ చీరికింగొనక, నోరికిందగని క్రూరంబులు పలికి జారిపోయెదు, నలదురా దురాత్మకా! యేల జెడిపోయెదురా? వలదురా, కోపంబులునారోపించి భూపాలునకుం గోపంబు దీపింపంజేసి నీ కీలుంగీలుం గోయింతు, యింతులతో నా యింతలేసి రంతులు? నీ గురుతు నాచెంతం జిక్కె, మంచిది పొమ్ము పొమ్మని బొమ్ముం దాటింపుచుం బగంజాటు నవ్వాధూటిం దిరిగిచూచి సుగుణాకరుండైన రాకుమారుం 'డంబా! నీవు కుసుమాంబకుని యంబకంబులకునోడి పాడివీడి యాడిగెలకు నన్నుంబాలుసేయుట తగవుగాదు నీవు బలుకు భయంకర భాషణంబులకు వెఱచి, నీ మనోరథంబు నెరవేర్పం బూనితేని, లోకంబున నపకీర్తియుం, బరలోకంబున యమునిచే నార్తియుం బొంది పెక్కుజన్మంబుల హీనజాతులం బుట్టవలయు. అంతబాధ పడుటకంటె రాజుచేత నాజ్ఞపడుటేనియు మేలు; వసుమతీపతి చిత్తంబు వకావకలై నన్నుం దెగంజూచునట్లుగా విపరీతంపుమాటలు పలికెదనంటివి. 'వినాశకాలె విపరీతబుద్ధి' యనువితంబున నీకు బుద్ధిపొడమె. నీ వచించిన సుద్దులే నిజంబని తండ్రి నాపయిం గోపించి యాజ్ఞసేయించెనేనియు నాకాశవాణియు, భూకాంతయు నెఱుంగరే? ఆకోల నిన్నుం దోడనె చుట్టుకొను, నీకు నరిపోయినట్టు లుండుము; పోయివచ్చెదనని పలికి యా గురుకుచనగరు వెడలి, సారధి తెచ్చినిలిపిన కనకమణిమయ రథంబును, మావంతుండుదెచ్చిన భద్రదంతావళంబును, సడివాగెంజేసిన కాంభోజకాశ్వరాజంబును, శిబికావహులు దెచ్చిన బంగరుపల్లకియుం జూడక, యూడిగంబులు దెచ్చి పాదంబులంబూన్చిన రవలపావలు మెట్టకయే, చింతాకాంతహృదంతరుండై, దిక్కులు చూడకయె తన నగరికిం జనియె... [సశేషము.]

అనుబంధము— 3

# జైమిని భారతము.

[ వ చ న ము ]

[ ఆంధ్రసాహిత్యపరిషత్ ప్రచురణమునందు తృతీయాశ్వాసమున లోపించిన భాగము. ]

సముఖము

వేంకట కృష్ణప్ప నాయకుఁడు

......అంత భేరీపటహాదివాద్యంబులు మ్రోయ రయంబున ననేక దేశంబులు క్రమించుచుం జని యాఁడుమండలంబునకుంజనియె. తద్దేశంబునకు

స్త్రీమండల వృత్తాంతము.

రాణి నీలనిభవేణియు రాకేందుబింబవదనయుఁ గుంద కోరక సమాన రదనయుఁ బల్లవాధరయు గంబుకంధరయుఁ బర్వతోపమానవక్షోరుహయు మల్లికామృదుళ బాహయు నణుమధ్యయు నతిపుణ్యాసాధ్వియు జలజనిభపాణియు సైకతశ్రోణియు రంభాసమోరుకాండయు రతిప్రచండయు రాజీవరక్త చరణయు రత్నమయసర్వాభరణయునై, హావభావవిలాసవిభ్రమంబుల నింపుమీఱుచు, నంగజకళారహస్యంబులు దెలిసి పురుషునిమనం బెఱింగి శృంగారవిలాసంబులం బ్రొద్దులుపుచ్చుచు, చౌసీతిబంధంబులఁ దనుపుచు సరసవాగ్విలాసంబులు నెరపుచుఁ బ్రమీలయను నామధేయంబు గాంచి, నరులకు సురల కసురులకు సిద్ధులకు సాధ్యులకు నసాధ్యమైన ధనుర్విద్యాకౌశలంబునం బొలుపొందుచు ధైర్యవీర్యసాహసంబు లుగ్ర శాసనంబు లుక్కు మెఱయ, లక్షయేనుంగులు నన్నియ గుఱ్ఱంబులు నన్నియ రథంబులును విషకన్యక లనంబరఁగిన పదిలక్షల కన్నెలు గదాముసలముద్గర భిండివాల తోమరశక్తి ముసుండిశరశరాసనఖడ్గఖేటకా ద్యాయుధములతో గరిడిసాదనల నెప్పుడుఁ జరించుచుండ నఖండితవైభవంబున రాజ్యం బేలుచు నుండు. తద్దేశంబునకు మార్గవశంబునం బోయిన పురుషులను జేరం బిలిచి యందలి యిందుముఖు లమృతమధురాలాపంబుల, నాలింగనంబుల నధరామృతప్రదానంబుల, నంగజకేళీవిలాసంబుల నాహ్లాదంబు పుట్టించి వశీకరించి యొక్కొక్కపురుషునితోఁ బెక్కండ్రు వనితలు భోగించుచు, సురతకేళీసుఖంబుల జొక్కించుచు గ్రీడించుచుండ, నొక్కమాసంబులో నాపురుషుండు పరలోకంబున కరుగు. వానితోఁ గూడ రమించిన యక్కాంత లందఱు నగ్నిప్రవేశంబు సేయుదురు. అందొక్కయువతికి గర్భంబునిలుచు; అది కనియెనేని యాఁడుఁబిడ్డనుం గాంచుఁ గాని పుత్రునిం గాంచదు. ఇది యాదేశంబునందలి నడవడి. జనమేజయ నరేంద్రా! విజయ భుజవిక్రమరక్షితం బైన యశ్వరత్నం బప్పాటిసమీపంబునకుంజని పచ్చికమేయుచు నుండునెడఁ గఱివంకకనుబొమ్మల వంక

లకుఁ గొంకినచందంబున గుడుసువడం దిగిచిన సింగాణివిండ్లును, గలికి చూపులకలికి వెనుక దాఁగినవితంబున నంపపొదులలోనం బొదలు లకోరి కోలలును, వట్రువ గబ్బిగుబ్బలు గనుంగొని భ్రమపడినచందంబున బిఱబిఱ దిరుగుచక్రంబులును, బెడంగుజడలయందంబునకు వణంకెడు చందంబునఁ దళతళ మనికత్తులు మెఱయ వీరశృంగారరసంబు లంగనా రూపంబుగైకొన్నకైవడి వీఁక మీఱురాకేందుముఖులు తేజీలుదువాళిం పుచుఁ గోకిల లొక్కుమ్మడిఁ గాకలీస్వనంబు లొనరించుకరణి వీరాలాపం బులు నార్పులు నట్టహాసంబులు పంతంబులు మెఱయం బోరు దీరుటయు, నందొక్కసుందరవదన, గుఱ్ఱంబుమీఁటి యధ్వరహరిం బట్టికొని వచ్చి తమ యేలికసానిసమ్ముఖంబున నిలిపి 'రాజరాజేశ్వరీ! యీహయంబుధర్మజునిచే విడువఁబడినది. హయరక్షణార్థంబుగాఁ బరాక్రమోపాజ్ఞుం డగు నర్జునుండు చనుదెంచి యున్నవాఁ' డని పలుకరించిన, నయ్యంగనామణి బంగరురంగులం దురంగలించు తురంగశాలలోనఁ గట్టుటకునియమించి, యంతరంగంబున నెంతయు సంతసం బెసంగ 'నేఁటితో నాకోరికలు నెఱవేఱె. సుఖంబులు సమకూరె, వెడవిలుకాని వేదనలుఁదీఱె, సంది యంబులేదు. ఇందుకొఱ కాపురందరనందనుం డిచ్చటికి వచ్చు. వచ్చి నప్పుడె గ్రుచ్చి కౌఁగలించి, మధురాధరంబు మేన కాకదీరం గ్రోలి, చౌసీతిబంధభేదంబుల బెనంగి యనంగసామ్రాజ్యంబు కొల్లలాడెద: ఇది మొద లనుదినంబును ననంగసంగరంబున వానితోడం గూడెద. నాపాలి దైవంబులన్ వేఁడెద'నని యెడపీడని కోరికలు పొడమ, నప్పడఁతుక పదివన్నియ బంగారునకు మెఱుంగు పెట్టినహొరంగునఁ బైగోజవ్వాదికిఁ బువ్వుఁదావి గట్టినరీతిఁ జిన్నారిజాబిల్లిమీఁద సుధారసంబు చిలికించిన విధంబున రంగైనయంగంబుల శృంగారింపఁ దొడంగి, యంగజునిచక్రం బులంబోలెఁ దళుకుతళుక్కునఁ జెక్కులఁ గుల్కు కళ్కురతనంబులకమ్మలు పెట్టి చివురాకుఁ గెమ్మోవి కెంపుల సొంపు మీఱునుపాణిముత్యపుముంగర ధరియించి, వింత వింతమణులకంటసరములుకంటెయు నేవళంబునుముత్యాల దండలు సందిటికడెంబులు ప్రత్తికాయతాయెతులు కంకణంబులు రవల గాజులు కడెంబులు మొలనూలు నొడ్డాణంబు నందెలు పాడగంబులు

పాదసరములు మెట్టెలుఁ బిల్లాణిలు వీరముద్రికలు మొదలగు నానావిధ భూషణంబులఁ గై సేసి, తనయనురాగరసంబు వెల్లువగట్టెనో యన నందం బగుచందురకావిపావడపైఁ దన మనోమాలిన్యంబు వెలికుఱికిన తెఱంగున మవ్వంపుఁ జువ్వ నివ్వటిల్లు రాయంచయంచుల మించుపైఁ టాణిదువ్వటంబు గట్టి, మట్టుమీఱిన మదనానలంబు తన్నుఁజుట్టుకొనిన తెఱంగున నిండు తగటిఱవిక కుంకుమపూఁత పొంకంపుసిబ్బెంపు గుబ్బలగబ్బుమీఱ నిండు ముసుఁ ద్దు చేసి, చిలుకతేజివజీరుని తేజి తెఱంగునఁ గనుపట్టు మరకతంపుఁ బిడెంపు బాఁకు చేపట్టి, విరవాజిసరుల తావియుఁ గోవజవ్వాజిపట్టెల వాసనయు దిక్కుల గుమ్ము గుమ్మని క్రమ్మ గిలుకుపావలు మెట్టి, నెమ్మిమె మేఘమండలంబు వెలువడు క్రొక్కారుమెఱుంగుతీవియ వోలె నంతిపురంబు వెలువడి యాప్తలైన చెలికత్తెలు వెంటరా బంగరుగుమ్మలుం బోలు నండజ యానలు దండలం జేరి కైదండ లొసంగ, నవరత్నఖచితంబులగు బంగరు బెత్తంబుల మొత్తంబులు చెలంగఁ గటికవారలు ‘రాజరాజేశ్వరీ! రాజ పరమేశ్వరీ! అష్టదిగ్రాజమనోభయంకరీ! కేరళదేశాధీశ్వరీ! స్వామినీ! పరాకు, హెచ్చరిక, జతను, సావధానత,’ యని హెచ్చరికలు దెలుప నల్ల నల్లనవచ్చి డాలుమీఱు పగడాలకంబంబులు దారవజ్రంబులబోదెలు జీవ దంతంపుదంతెలు, యీళంపునీలంపు దూలంబులు కెంపుటోడుబిళ్లలపై కప్ప డంబులు నానారత్నవిచిత్రంబులు బాలభానుప్రభాభాసమానంబులు గగన లక్ష్మీనివాసంబులునైన తమ్మిరేకులఁ బోలుపొందుకనక కలశంబులవిలసిల్లు ద్వారంబులును జంద్రకాంతమయంబులైన వజ్రమణిమయ గజరాజ శోభితంబులైన పార్శ్వంబులంగనుపట్టు సోపానంబులు హెచ్చురతులపచ్చ రాతిన్నెలు గలశంబులు తుండంబులఁ గైకొని యభిషేకంబు లొనర్చు దారవజ్రంపు టేనుంగు లిరుగడలం గడలుకొన మూర్తీభవించిన సామ్రాజ్యలక్ష్మివలె నొప్పుచు లక్ష్మీవిగ్రహంబులం బోలుపొందు ద్వారదేశంబులుం గలిగి జాళువాసరిగకుట్టుపని హరువుల ప్రతిమలం బ్రతి లేని తెరలును, క్రొత్తముత్తెంబుల జల్లులమేలుకట్లును, నెమిలిఱెక్కల ఛాయలం బ్రతిక్షణంబును వింతలైనకాంతులు మంతుమీఱ రత్నగర్భ మైన పుడమి కన్నకరణినున్న తివాసులనొప్పుచు సుధర్మాస్థానంబు కరణిఁ

బ్రభాశోభితంబై నవాటంబును ప్రభావిజిత మేరుకూటంబును నగు కొలువు కూటంబున, బాలభానుకిరణంబులతో వాదంబులు సేయు పాదంబులును, బసిఁడిగట్టు పై తట్టువలెఁ గనుపట్టు విస్తారంబును గలిగి, గోమేధిక పుష్యరాగ మరకతముక్తాప్రముఖనిఖిలరత్న విరాజితంబై గ్రహనక్షత్రనికర తారకానికరకోరకితంబై నయాకసంబు తెఱంగునను నఖిలసురాసురపూజితంబు నైనసింహాసనంబునం గూర్చుండి, సామదానభేదదండచతురోపాయులగు మందయానలు సందడించి కొలువ నొక్కచక్కిఁ జక్కెరబొమ్మలు చక్కెర యుక్కెరలకన్న మిక్కుటంబై చొకాటంబులు నైన దండకతారావళీ ప్రముఖ ప్రబంధంబులు విన్నపంబు సేయ, మఱియొక్క దిక్కున రాకేందు వదనలు మీమాంసావ్యాకరణాదిశాస్త్రంబు లనర్గళప్రవాహంబులుగా నుపన్యసింప, వేఱొక్కచాయఁ బల్లవాధరలు బ్రహ్మాండపురాణంబు విష్ణుపురాణంబు పద్మపురాణంబు మొదలగు నష్టాదశపురాణంబుల కథలు వినిపింప, మఱొక్కదిక్కున నీలవేణులు చిత్తరుబొమ్మలవలె శిరఃకంపంబు సేయుచు జంత్రగాత్రంబులతోయి గీతప్రబంధంబులు ఘననయ దేశీయంబులు వినికిసేయ, నొకవంక మకరాంకవిజయపతాకలం బోలె రంభోర్వశీమేనకాదుల నెంత లేదనుబిరుదుపాత్రలు చర్చరి చారి మొదలగు పదియాఱు నాట్యంబులు నభినయంబులు గనుఁగొనిపింప, నొక్క ప్రదేశంబునఁ గలకంఠకంఠులు పరిహాసంబులు వినోదంబులు గాఁ బ్రసంగంబులు సేయ, నిరువంకల రవలకంకణంబులు ఘల్లుఘల్లనఁ, బంకజాక్షులు కనకదండ మండితంబులైన ధవళచామరంబులు వీవఁ, గత్తి కేడెంబు సురె చికటారి సిడెము వంకి పట్టిసబాణముసలముద్గరభిందివాలములు బరిచి నేజా మొదలగు ముప్పదిరెండాయుధంబులును, గుంచెకాళంజియుఁ జేయిపావడ యడపంబును గింటె సురటియు నిలువుటద్దంబులు మొదలగు మహారాజచిహ్నంబులఁ బూని యూడిగంపుఁజెలువ లూడిగంబులు సేయ సాక్షాత్కరించిన వీరమోహినిచందంబున నిండోలగంబున నుండె.

అంతఁ గుంతీసుతమధ్యముండు కాంతాజనులు మఘవాజిం గొనిపోయిరని చారులు పలుకరించిన నవ్వి తగిన రాయబారులం బనిచి గుఱ్ఱంబు విడువుమని మందలించిన తొడ, నమ్మండలేశ్వరి ముఖచంద్రమండలంబున

వెన్నెలయునుంబోలె మందహాసంబు గందళింపఁ 'గిరీటి మేటివీరుండని వింటిమి. ఆతని రణకలాకౌశలంబు పరీక్షింపకయె కవ్వడిం గడవ నీయము. నే నిదె సమరసన్నాహంబుగా నరుగుదెంచెద. పార్థునిరమ్మనుండు. పొం' డని బహుమానంబులు చేసి పంపిన, నియోగులు వేగంబె యరుగుదెంచి యవ్విజయునకు వివరించిరి. అంతఁ దురంగమాతంగశతాంగ వీరభట మహా ర్భటీసమేతంబుగాఁ బ్రమీల మోహరించి రథచక్రఘోషంబును గేతనపటా

ప్రమీలావిజ యులయుద్ధము.

త్కారంబును గార్ముకజ్యానాదంబును లలితమధురసింహ నాదంబును భూనభోంతరంబు దీటుకొన శతమఖతనయునిం గాంచి తనకులుకుఁజూపులం బోనివాలుతూపులు వింట సంధించి రథరథ్య కేతనసమేతంబుగా నించుటయుఁ, బార్థుండును నంగనతోడి కయ్యంబునకు రోయుచుఁ దీఱనికతంబున మూఁడువాడితూపులు సంధించి యేయుటయు, నది తోడ్తనేఖండించి తీవ్రిముఖంబులైన శిలీముఖంబులచే దశదిశాముఖంబులు గప్పి, తక్కిన బోటులు ఘోటకంబులమీటి సామ జంబులఁ బురికొల్పి రథంబులం దోలి చిలుకుటమ్ములచే గ్రుచ్చియు నీఁటెలం బొడిచియు బట్టసంబుల నఱికియు శూలమ్ములం గ్రుమ్మియు వంకులం జిమ్మియు జముదాళ్ళం బొడిచియు గదల నడిచియు ముసలంబుల మోఁదియు ముద్గరంబులం జిదిమియుఁ గిరుసుకత్తుల విదళించియుఁ జిఱుత కడ్డియలఁ గొట్టియుఁ దారసిల్లిన నయ్యిరువాగును బూర్వపశ్చిమసముద్రం బులవలెం దాఁకి తుములంబుగా సమరంబు గావించు నెడఁ, బ్రమీల యింద్రినందనుం జూచి 'కిరీటి! మమ్ము నీబోఁటికిం గెలువఁగూడదు. నీకె కాదు. అనిమిషసిద్ధసాధ్యగరుడోరగాదులేనియు నన్ను గెలువలేరు. నీకు గుఱ్ఱంబు గావలయునేని దురభిమానంబు మాని ప్రియంబున నన్ను

ప్రమీల యర్జును మోహించుట.

వరియించిన హయంబు నిత్తుం గాక లేక యున్న నిన్నుం బోనిత్తునే? నీయగ్రజుండైన యుధిష్ఠిరుండు సోమపానంబు సేయ నిమ్ము, నీవు నాయధరామృతపానంబు సేయుము. ఆతండు కురుదేశం బేల నిమ్ము. నీవు నా కురుదేశంబేలుము. ఈ దేశం బునకు నీవె యొడయఁడ వయ్యెదవు.' అనిన ధనంజయుండు దరహాసంబు నెమ్మొగమ్మునం గనుపట్ట 'జవ్వనీ! పువ్విలుతుని కేళికి నిన్నుం గూడిన

నరుండు మానసమాత్రంబునఁ బంచత్వంబు నొంది యధోగతికిం జను. అంతట యువతిమండలంబేలు వాఁడెవ్వండు? ధర్మజునకు మరల హయంబు సేర్చువారెవ్వరు?' అనినం బ్రమీల వాలారుమెఱుంగుఁ జూపులం జూచుచు 'నీవు దైవయోగంబున మాదేశంబునకువచ్చినవాఁడవు. ఇంక నెచ్చటికిఁ బోవంగలవు? ఎట్లయిన నీప్రాణంబు లపహరింపక మాన. నామహోగ్రబాణంబులచే నీ మేను జల్లెడకన్నంతలుగా గాయంబులం బడి వేదనం బొరలుచు వృథా ప్రాణంబు లప్పగింప నేల?'. అనినఁ గన్నులఁ గెంపు నింపుచు నిలింపపతినందనుండు నారి నాఱమ్ములు సంధించి యేసిన, నవ్విలాసిని యన్నియు నారసమ్ముల వానిని రూపఱంజేసి వెండియు నేఁడు వాఁడిబాణంబులు మేనం గీలించి, మఱియు వేలకొలంది తూపులవాన గురిసిన, సురపతితనూభవుండు నమ్మోహనాంగిపై సమ్మోహనాస్త్రంబు వింట సంధించిన, నవ్వాలుఁగంటి యయ్యస్త్రంబుతోడం గూడ గాండీవ గుణంబుఖండించిన, నరుండు కోదండంబున వేఱొండునారిం గూర్చి యున్నారిం బరిమార్పక మాన నని కట్టలుకం గనుబొమ ముడిపాటు గదియించుటయు, నాకాశవాణి 'యర్జునా! నిర్జరుల కైన దీనిం గెలువ శక్యంబు గాదు. నీవు పదివేలయేఁడులు పోరినం జయంబు చేకూరదు. రిత్తయాయాసం బేమిటికి? ఒక్కనాఁటిరాత్రి దీనిఁదనియించి హయంబు గొని యథేచ్ఛంబుగాఁ జను' మనిన నర్జునుండు నమ్ములు విల్లు నరదంబున నునుచుటయు, నయ్యంగన యతిత్వరితంబుగా వచ్చి యాలింగనంబు సేసి పురంబునకుం దోడుకపోయి, యరదంబు డిగ్గి, నిగ్గుమగఱాల నిగరాలకమ్మలు కపోల ఫలకంబుల గులుక కమ్మకడానిబొమ్మయుం బోని నెమ్మేనికాంతులు కుసుమచాపుని ప్రతాపముంబోలె దిక్కులు బిక్కటిల్ల, చెఱకువిలుతుం డొఱవెఱికి ఝళిపించిన కత్తుల ధళధళలంబోలె నారజపు టోరజూపులు కలువవిరిసోనలం జల్ల చిలుకముక్కులం బోని చక్కని నఖంబుల నలకంబులదిద్దుచు నొయ్యారంబు లునికింజెందిన చందంబున, విలాసవిభవంబులు మూర్తీభవించిన యందంబున సింగారంబు రూపుఁ దాల్చిన వడువున, యెదురువచ్చి, తన సమీపంబునకు వచ్చుచున్న

ప్రమీల యర్జును నంతిపురంబునకు గొనిపోవుట.

పురందరనందనునిం గనుంగొని యుల్లంబు ఝల్లుఝల్లుమని గబ్బిగుబ్బ లుబ్బ, నాపాదమస్తకంబును పులకల మొలకలు నెలకొన, కమ్మజవ్వాది వాసనలు గ్రిమ్ము నెమ్మేన ఘుమ్మను కమ్మచెమ్మటలూర, నడుపఱ్ఱెద మీఱు, కప్పుగీల్గొప్పు నించుకవీడ, కొనసియాడ, బొమ్మంచు కెమ్మోవి కంపింప, మొలనూలు ఘంటలు నటింప, నీవీబంధంబు జాఱ, జేరవచ్చి విప్పఁజెప్ప లఱమోవ్పుగ నివ్వెఱపాటు, నిబ్బరంపుమోహంబు నాగుబ్బ కొన, నా బిబ్బోకవతి తనమనంబున నిట్లని వితర్కించె.

'రూపరేఖావంతుఁడు, కంతుఁడో యామినీకాంతుఁడో యల వసంతుఁడో జయంతుఁడో నలమహీకాంతుఁడో, యెంత చక్కదనంబు, యెంత విలాసంబు, యెంత యొయ్యారంబు, యెంతకళ!' యంచు దలంచుచు నుండునప్పుడు, చిత్తజుం డయ్యుత్తమపురుష మత్తకాశినుల మీఁద దండెత్తఁ దలఁచి యెలదేటి యెలగోలుమూకలకు తేనియగానం బులు నొసఁగఁ బనిచి, గోరువంకబలకంబుల బొక్కపరచి, గండుమీనుని శాన వేయించి, తమ్మిపూముద్దర, మామిడిచిగురుబాకు శాయంబనిచి, పువుమొగ్గగుణి శిరంబున నునిచి, విరువాజి తీఁగవేట గట్టిగాగట్టి, మోదుగమొగ్గ బాగుదారు డాబునవైచి, గేదంగి చిక్కటారి కరంబున బూని, పొన్నవిరిబారు వెన్నునవైచి, చెఱకుసింగిణియు, తమ్మిమొగ్గ తరగస లిరుదెసలంగట్టి, పంచదార ఖాణంబులుమేసి పొగరించిన పచ్చ వన్నియ చిలుకతేజి నెక్కి, దునేదారుగావచ్చి, యిరువురి ధైర్యంబను సీమలెత్తికట్టి, యుక్తాయుక్తవిచారంబు లనియెడు నగడ్తలంబూడ్చి, హృదయంబులనుకోటలు లగ్గలనెక్కి గగ్గోలుగా నార్చి, తుంటవింటన్ జంటజంటగా నరవిందబాణంబు నశోకసాయకంబు, నవరసాలకిసల యాస్త్రంబు మల్లికాముకుళభల్లంబుఁ బ్రయోగించి, యంతట కోపంబున, చాపంబు సారించి, యా యిరువురియేపు రూపుమాపఁ దలంచి, నీలోత్పల బ్రహ్మాస్త్రంబు సంధించి, యాకర్ణాంతంబుగా దిగిచి, ప్రయోగింప బూనుటయు, నంతఁ బ్రమీల నిమీలితనేత్రయై తలయూచి, రేకకున్ జోకకున్ చక్కఁదనంబునకున్ సొక్కి సొక్కి తనమనంబున వితర్కింపఁ దొడఁగె.

'ఔరౌరా! యీ మనోహరాకారుని యాకారంబు, మజ్ఝారే! శచీకుమారు నమ్మారు ముమ్మారు పరాసాదు. వీని కనుంగవపోడిమికి నోడి కెందమ్ములు నీరమ్ములంగలసె. అప్పప్పా! యీ యెమ్మెకాని కనుబొమలు సూచినయెడ నంగజుని సింగాణివిండ్లు నిష్ఫలంబులని దోఁచుచున్నయది. అక్కక్క! వీని ముక్కు సంపంగిపెక్కుల చిక్కులం బెట్టు నునుకోఁటురు బెట్టినట్లున్నది. అయ్యారే! మదనుని మదహస్తికి మదరేఖ కనుపట్టినయట్లు శృంగారరసంబు మోసులెత్తిన తెఱంగున బవిరిగడ్డంబు, గప్పుమీసంబును గనుపించుచున్నయవి. అమ్మమ్మా! వీని కమ్మ కెమ్మోవి ఫారు బరికించి దొండపండు బెంపువడియె. అన్ననన్న! యీ సరసుని పలువరుస దాడిమివిత్తులఁ జిత్తులఁ బెట్టె, నజ్జారే! త్రైలోక్యమంగళంబైన వీనిగళంబునకు దక్షిణావర్తశంఖంబు బ్రదక్షిణంబు వచ్చు: మేలుమేలు! యీ మన్మథాకారుని పేరురంబు మేఁటికవాటంబుఁగా నున్నయది. భళిభళీ! మెండైన కండంబులుదిరిగి యేనుఁగు తుండంబులు వలె వీని బాహుదండంబులు కన్నులు బండువులుగా చాయందొడంగి చెవులతో నేకాంతమాడఁ బోయినగతి, యీ రాజనందను మూపులవైపు లెంతనివర్ణింతు. ఆపాదమస్తకం బతిసౌందర్యంబుగా నిర్మించి విధి నడుము పిడికిటఁ బెట్టె, ఊర్ధ్వాధోభాగంబులు సరిగాఁజూచివిడిచెఁ గాఁబోలు లేకున్న నంతసన్నంబుగా నుండునే? - సరోవరంబునుఁ బోలె గంభీరంబైన నాభియు, వారితరంగంబుల తెఱంగున రంగలరు వళిత్రయంబు, చిత్రంబయ్యెడు. పిఱుందుల యందంబు జూచినంతనే నాధైర్యంబు మందం బౌచున్నయది. శృంగారరసప్రవాహంబుల భంగి, వలరాయలతోఁట యనఁటిమ్రానుల తీరున వీని యూరువులు, పేరమీఱిన చిత్రజుండను మత్తవృషభంబు మూపులె వీని జానువులు, మన్మథకాహళల హాళహాళికలు బిక్కలుబట్టు వీనిపిక్కలు, వీనిపాదంబు లరుణారవిందంబులు; అయ్యారే! వీని యొయ్యారము వేయారులలోనంగాన. వీని యాకారంబు నిలువుసీరను బండుచున్నయది. ఈమేటి నీటొక్కచే కోటిసేయు. ఈ వన్నెకాని చెన్ను చిత్రరూపంబు లిఖింప కూడదు. ఈ మోహనాంగు డించుక సేపు సమీపమున నిలిచినఁజాలు. నామనోరథంబు నెఱవేరె. జంటితేనియ

మోవిఁ బంటికొద్దినొక్కి చక్కఁజెక్కు నిలుమార్చిముద్దిడుకొని, కానికతరంబైన వీనికంఠంబున గరంబువైచి యొప్పైన పేరురమ్మున సిబ్బెంపుగబ్బిగుబ్బలు గసిదీఱంగుఱిమ్మి, యందచందంబులకెల్ల నాస్పదంబైన వీని నెమ్మేను బిగువుసందిటఁగ్రుచ్చి మచ్చికమీఱఁ బెనంగి యనంగసామ్రాజ్యంబు కొల్లలాడినఁగాని, సోయగంబు చికిలిప్రాయంబును గల్గినందులకు ఫలంబేమి?'

అని యుల్లంబున కోరినకోరికెలు పల్లవింప పల్లవభల్లునకుఁ దల్లడిల్లుచు, నా కంజలోచన మంజీర ఝుళంఝుళారావంబులు మెఱయ సరయంబుగా జనుదెంచి, తన చనుగుబ్బమొన లొత్తుచుక నతనియురంబు నకుసోఁకఁ గౌఁగిలించుకొని, మొగంబు మొగంబునఁజేర్చి, యుస్సురని, చెక్కిలినొక్కి ముద్దుబెట్టుక మేనునివిరి, కై దండయొసఁగి పురందరనందనుఁ దనపురంబునకుఁ దోడ్కొనిపోయి, యంతిపురంబునకరిగి, కొలువుశృంగారంబు సడలించి, కొందఱు కెందలిరాకుపాణులు గొలువ మజ్జనగృహంబున కరిగె.

అంత నచ్చుతునిమేనమఱంది నొక్కముచ్చెకంటి పచ్చలగద్దియ నునిచె, నొక్కకంబుకంఠి జలకంబులార్చె, నొక్కపుత్తడిబొమ్మ తడి యొత్తె, నొక్కచెలువ చలువ లందిచ్చె; అవ్వేళబ్రమీల ననంగనంగర కిరీటియగు కిరీటికి యోరశిగవైచి కమ్మవిరువాజి జాజిపూలసరమ్ములు మీసరమ్ముగాజుట్టి సరిగంచు చెంగావిరుమాలచెంగులు వెన్నునజీరాడ, కళలుదేర తీరైనమొగమ్మున సిస్తుగా గస్తూరితిలకంబుఁ దీర్చి, కట్టాణి ముత్తియంబుల కట్టుపనులగోటునం గనుపట్టు పసింబట్టుచల్లడంబును దొడిగి, జవాదియు గప్పురంబును దట్టుపునుఁగు, వాసనలుగుబాళించు కలపంబు మేననలంది, సర్వాభరణ భూషితునిఁ గావించి, కడాని పసన్నుచిలుకలకొలుకులనీడల గులాబీవన్నె మవ్వటంపువలెవాటుఁ-జాఱవైచి, నిలువుటద్దంబుజూపి, మణిగణప్రభా భాసితంబైన పాదుకలు పాదంబుల దొడిగి కై దండయొసఁగి, భోజనాగారంబునకుఁ దోడ్కొని పోయి—

తామిరువురు, సరససల్లాపంబులు మెఱయ, భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయాదులఁ దృప్తిఁజెంది, యొక్క గంధగజయాన గంధోదకంబు నొసఁగ గండూషించి, ప్రక్షాళితపాణిపాదులై, మట్టుమీఱినమోహంబున, చెట్టలుబట్టుక నొంటొరులుసొక్క, నొక యండజయాన యండఁజేరి వెండితేకులంబోని తెల్లటాకుల సన్నంబుగా ముత్తియంపుసున్నంబిడి, నడమియూనెయుఁ దోడిమెయు నివ్వలవ్వలవిడిచివైచి, ద్విగుణిత ఘన సారకస్తూరికాభాగంబులైన బాగంబు లొసంగిన, వీడియంబుఁ జేయుచు మందమందగమనంబున వచ్చి, కిరీటి పచ్చచిలుకుల మేడల, మలుకులఁ దళుకొత్తుచు డంబుమీఱు పగడంబుగోళ్లును, బంగరుతీఁగె నమోనాహఁ౯ాసు పనిహారువుల మురువులమరు జీవదంతంపుపట్టెలును, యింద్రనీలజాలకంబుల మెప్పుమీఱు గొప్పముత్యాలచప్పరంబులును, పున్నమివెన్నెలల తోడ సన్నలుతాఁకు వలువదువ్వలపై కప్పడంబు పైనొప్పు హంసతూలికాతల్పం బును, కన్నులఁ గోరకింపఁజేయు కెంపుచాయల సొంపుమీఱు బురడాలు, సూర్యపుటంబు దిటంబు తలగడదిండ్లును కీచుబుఱ్ఱలు పల్కులంగులుకు లేకంబుగాగుముకు బటువుబిళ్లలు. వేకవానులు నడపంబులు, సురటియు, వెలిపావడయు, నడపంబును, కుంచెలుధరించిన జాభువా జంత్రపు బొమ్మలును, నెచ్చెలిచ్చట మచ్చరైన పచ్చబాగూళ్లలోనుంచిన జవాదిభరిణెలును, కుంకుమరసంబు నించిన పింగాణిగిన్నెలునూ, పొంకం బగు బుక్కాపొడిపొట్లంబులు, పచ్చికస్తూరివీణియలు, పునుఁగుచట్టంబులు, బాగాలజాలవల్లికలు, ముడిపూవు కెత్తులు, పన్నీరుమెరవులును, రాధా మాధవుల తారాశశాంకుల రంభానలకూబరుల మేనకాగాధేయుల విలాసం బుల వ్రాసిన చౌసీతి బంధంబుల బటంబులును, జిటికెవేసిన గుటగుటఁ బలుకు శుకీలును, గోకోకంబు జదువు గోరువంకలును, పంచదారలం దొలుకఁబలుకు పంచవన్నియచిలుకలు, మట్టుమీఱు వాసనలకుంబట్టులై యుమరు యగరుసాంబ్రాణిధూపంబులును, మేలుకట్ల మకరందబిందువులఁ జిందు చందువలును, పొందుమీఱు కుందనంపు నింపుసొంపు రతనంపు మండీరమండితంబైన కేళీమందిరంబుఁ జేరి—

మదనకదనారంభ సముజ్జృంభమాణ మనోభిలాషల నా ప్రమీలా సుందరీ పురందరనందను లమందానందకర కస్తూరికాచందనాది పరిమళ ద్రవ్యంబులకు సొమ్మసిల్లి పరుండునప్పుడు—

అమ్మందయాన బృందారకబృంద వందిత పాదారవిందుండగు నా శక్రనందనుఁ గలయుమోహావేశంబున పట్టరానిగుట్టును బిట్టువీడుచు, మట్టుమీఱి యాతండు కౌఁగిటఁ జేర్చిన జేర్చనీయక నబ్బురంపు గబ్బి సిబ్బెంపుగుబ్బల నిబ్బరంబున జెయిసోఁకినన్ సోఁకనీయక, కటికచీఁకటి కప్పులంగప్పనంగప్పు కప్పుఁగొప్పు నిమిరిన నిమురనీయక, మిక్కిలియుక్కువైన చక్కనిచెక్కుఁ గీటినం గీఁటనీయక, మధురసుధారసధారా ధురంధరంబైన బింబాధరంబు గ్రోలినంగ్రోలనీయక, కుందనంపుటద్దంబు గంటెనపువ్వులన్ గుంటుపఱుచు తుంటవింటిపాదుశాహిదివాణంబు నంటిన నంటనీయక యేమరించి యొయ్యనొయ్యన విరులశయ్యకుం జేర్చి, రాగించి, కౌఁగిలించి యదలించి బాహాబాహిఁ గచాకచిఁ బెనంగి—

అల్లందులకుం గమకించి నీవివదలించి మైగదించి నేర్పుమించి చివురుసొరు జాలువారు తావిమోవితేనెలం గ్రోలి పైకొని, కోకిలల చందంబున శ్రవణానందంబుగా గుబగుబఁబలుకుచు 'మేలు! భళీ! హసాను! శాబాస్!' అని మెచ్చుచు, యొకరొకరిమేను లప్పళించి వింతవింతపిలుపులఁ బిలుచుచు, గెందామరలఁబోలు గందామరలు మోముప్పలుగావించుచు నుపరతిక్రీడావిశేషంబులఁ దనియుచు, మన్మథ బ్రహ్మానందంబునందేలుచు సుఖంబున నుండి మఱునాఁడు మత్తమాతంగతురంగ మణిభూషణావళులతోడంగూడ మఖవాజి నర్పించి మొక్కుటయు నయ్యర్జునుండు సాదరంబుగా వీడ్కొని చనియె. అని చెప్పి మఱియు జైమినిమునీంద్రుండు జనమేజయనరేంద్రునిం గనుంగొని యిట్లనియె.

అయ్యలరాజు నారాయణామాత్య
ప్రణీతంబగు

# హంసవింశతి

సమగ్రముగా, పాఠభేదములతో, విపులమగు భూమికతో,
రాయల్ సైజున ముద్రితమగును.

[ షుమారు 300 పేజీలు: అట్టబైండింగు ]

సెప్టెంబరు మాసాంతమున వెలువడును.